# చతుర సమీక్ష

ఈ శీర్షికద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్లీ చెప్పకుండా, అవసరమైన మేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒక వైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', 'ఈనాడు' కాంపౌండ్, హైదరాబాద్-500 482 అనే చిరునామాకు పోస్ట్‌చేయాలి.

మాకు అందిన సమీక్షలలో ఉత్తమమైనవిగా ఎంపికచేసి ప్రచురించిన వాటిలో మొదటి మూడింటికి రూ. 100/-, రూ. 75/-, రూ. 50/- చొప్పున; మరో మూడింటికి రూ. 25/- చొప్పున నగదు బహుమతులు పంపగలం. పాఠకుల పరిశీలనాశక్తిని, రచనాసక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటు చేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.

✶ కొందరు బహుమతి విజేతలు తమ బహుమతి తాలూకు చెక్కు అందలేదనీ, అడ్రసు మారిందనీ రాస్తున్నారు. బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలోనే పంపుతున్నాం. అడ్రసుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడే జాగ్రత్తపడటం మంచిది. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు సాధ్యంకాదు.

----------------- కూపన్ -----------------

జనవరి చతుర నవల 'ప్రేమపందెం'

సమీక్షకుని పేరు : ..............................

చిరునామా : ..............................

..............................

..............................

..............................

# రచయితలకు సూచనలు



ప్రచురించే ప్రతి నవలకు రు. 2,000/- పారితోషికం అందజేస్తున్న 'చతుర' లో ప్రతిభావంతులైన రచయితలకు నెలనెలా నవలల పోటీయే. వైవిధ్య పూరిత ఇతివృత్తాలతో, ఆసక్తికర రచనా సంవిధానంతో పాఠకులను ఆకట్టుకో గల నవలలకు వేదిక 'చతుర'.

★ 'చతుర'లో నవలకు వేసే చిత్రాలు, చతుర కథలు, చతుర ప్రపంచం వంటి శీర్షికలు కాక కేవలం నవల మాత్రమే అచ్చులో 100 పేజీలు ఉంటుంది. "చతుర"లో అచ్చులో ఒక పేజీలో సుమారుగా 350 పదాలు వస్తున్నాయి. నవలనుబట్టి పేజీల సంఖ్య పెంచటంగాని, తగ్గించటంగాని ఉండదుగనుక నవలలన్నీ సరిగా ఈ సైజుకు సరిపడేలా, మొత్తంమీద 35వేల పదాలకు తక్కువకాకుండా ఉండాలి. వ్రాత ప్రతిలో వారివారి దస్తూరీని బట్టి, ఒక పేజీకి ఎన్నిపదాలు వస్తున్నాయనే దానినిబట్టి మొత్తం నవల ఎన్ని పేజీలు ఉండాలనేది ప్లాన్‌వేసుకోవటం అవసరం.

★ ఈ లెక్క ప్రకారం "చతుర" కొరకై ప్రత్యేకంగా రాసిన నవలలు మాత్రమే పరిశీలనార్హాలవుతాయి.

★ నవలను ప్రచురించే సమయంలో అవసరాన్నిబట్టి కొంత కుదించవలసివచ్చే పక్షంలో, అందుకు అభ్యంతరంలేనివారే తమ నవలలను పంపించాలి.

★ ప్రచురణకై ఎన్నికకాని నవలలు తిప్పి పంపేందుకై నవలతోపాటే తగు పోస్టేజిని జతపరచాలి. వ్రాతప్రతులు పోస్టులోగాని, ఇతరత్రాగాని పోయిన సందర్భాల్లో మా బాధ్యత ఉండదు.

★ సాధారణంగా నవలలు మాకు అందిన 4 వారాలలోగా ప్రచురణార్హంగా భావిస్తే ఆ విషయం తెలియపర్చటమో, లేనిపక్షంలో తిప్పి పంపటమో జరుగుతుంది.

★ పారితోషికం ఏ నెల చతురలో ప్రచురిస్తే ఆ నెల మొదటివారంలో పంపబడు తుంది.

ఎడిటర్

**చతుర**

'ఈనాడు' కాంపౌండ్, హైదరాబాద్-500 482




# చతుర కథలు

## శిక్ష ఎందుకు?

"గుడ్‌మార్నింగ్ సార్!" అన్న పలకరింపుతో తలెత్తిచూశాడు గౌతమ్.

ఎదురుగా నలభైఏళ్ల గోపాలరావు నిల్చుని వున్నాడు. ఓ ప్రభుత్వ సంస్థలో సివిల్ ఇంజనీరు అతను.

"హలో!" అన్నాడు గౌతమ్. ముక్తసరిగా.

నెల్లాళ్లుగా తరచు అక్కడికి వస్తూనేవున్నాడు గోపాలరావు. అది ఓ మంత్రిగారి కార్యాలయం. గౌతమ్ మంత్రిగారి ఆంతరంగిక కార్యదర్శి.

రెండేళ్లక్రితం ఓ కాంట్రాక్టర్ దగ్గర లంచం తీసుకుంటూండగా రెడ్‌హ్యాండెడ్‌గా పట్టుబడ్డాడు గోపాలరావు. అప్పటినుంచీ సస్పెన్షన్‌లోనే వున్నాడు. ఎంక్వయిరీ పూర్తయి గోపాలరావుకు కంపల్సరీ రిటైర్మెంటు శిక్షను విధించింది డిపార్టుమెంటు. దానిపై మంత్రిగారికి అప్పీలు చేసుకున్నాడతను. ప్రస్తుతం ఆ కేసు ఫైలు మంత్రిగారి టేబుల్‌పైన మూణ్నెల్లుగా పడి వుంది. ఆర్డరు కోసం మంత్రిగారిని కలుసుకుని మొరపెట్టుకున్నట్లయితే పని జరుగవచ్చునని ఎవరో సలహా ఇవ్వడంతో, నెల్లాళ్ల నుంచీ మంత్రిగారి ఆఫీసుచుట్టూ ప్రదక్షిణలు చేస్తూనే వున్నాడు. మంత్రిగారిని కలుసుకోవడమైతే కుదరలేదుగాని, ఆయన కార్యదర్శి అయిన గౌతమ్‌యొక్క సానుభూతిని మాత్రం చూరగొనగలిగాడు.

"మంత్రిగారు మంచిమనిషి. నీ కేసును సానుభూతితో పరిశీలిస్తారు. నువ్వు నిశ్చింతగా వుండు" అని హామీ ఇచ్చాడు గౌతమ్.

ఎలాగైతేనేం ఓరోజున తీరిక చేసుకుని గోపాలరావు ఫైలును చూశారు మంత్రిగారు. కేసును స్టడీచేస్తూంటే ఆయన ముఖంలో రంగులు మారడం గమనించాడు గౌతమ్.

ఆ తరువాత, ఫైలులో మంత్రిగారు వేసిన ఆర్డర్సు చూసి తెల్లబోయాడు గౌతమ్. గోపాలరావు అప్పీలును కొట్టివేయడమేకాక, డిపార్టుమెంటు విధించిన శిక్షను పెంచుతూ, అతన్ని సర్వీసులోంచి తొలగించవలసిందిగా ఆర్డర్స్ పాస్‌చేశారు మంత్రిగారు!

"ఇదేమిటి్సార్? కేవలం అయిదు వందలు లంచం తీసుకున్నందుకే ఇంత పెద్ద శిక్షా!



కవర్‌పేజీ ఫొటోగ్రాఫర్: వి. సత్యమూర్తి

ఏదో కక్కుర్తిపడ్డాడు. చిన్న శిక్ష వేస్తే బుద్ధి తెచ్చుకుని మసలుకుంటాడేమో!'' అన్నాడు గౌతమ్ మంత్రిగారితో.

అది విని అదోలా నవ్వారు మంత్రిగారు. ''నేను శిక్షించేది లంచం తీసుకున్నందుకని ఎవరు చెప్పారు? అజాగ్రత్తగా ఉండి పట్టుబడ్డందుకు ఈ శిక్ష! అసలు నేడు దేశంలో లంచాలు ఎందరు తీసుకోవడంలేదు చెప్పు! వేలూ, లక్షలూ లంచం తీసుకున్నవాళ్లంతా దొరికిపోతున్నారా? ఆఫ్టరాల్ అయిదువందలకే రెడ్‌హ్యాండెడ్‌గా దొరికిపోయాడు ఈ గోపాలరావు. అంటే అతనెంతటి అసమర్థుడో అర్థమయిపోతోంది! లంచం తీసుకోవడం నేరంకాదు - పట్టుబడడం నేరం! నేను ఏదైనా సహించగలనుగాని, అసమర్థతను మాత్రం సహించలేను. అందుకే అతన్ని డిస్మిస్ చేయవలసిందిగా ఆర్డర్ వేశాను...''

మంత్రిగారి పలుకులను ఆలకించగానే మూర్ఛవచ్చినంతపనయింది గౌతమ్‌కి.

— మోహిని

## తెలివి

అమెరికన్లు ఇద్దరు భారత్ దర్శన్ టూర్ చేస్తూ విశాఖపట్నం వచ్చారు. ఇక్కడ ఓ ఇద్దరు యువకులను పరిచయం చేసుకొని ఆ చుట్టుపక్కల ఉన్న 'దర్శనీయ స్థలాలను' చూడాలన్న ఉబలాటాన్ని వ్యక్తపరిచారు. వీళ్ళు 'సరే' అని నగరపర్యటన అయ్యాక, 'బొబ్బిలి కోట' చూపించుదామన్న ఉద్దేశ్యంతో బయల్దేరదీసి రైల్వేస్టేషన్‌కు వచ్చారు. టిక్కెట్ కౌంటర్‌లో బొబ్బిలికి తమకు ఇద్దరికి కలిపి ఒక టిక్కెట్టూ, అమెరికన్స్‌ను మాత్రం రెండు టిక్కెట్లూ తీసుకోమని చెప్పారు. టిక్కెట్లు తీసుకున్న తర్వాత నలుగురూ ట్రయిను ఎక్కి ఎదురెదురుగా కూర్చుని ప్రయాణించసాగారు.

యువకులిద్దరూ ఒకే టిక్కెట్టుతో ప్రయాణించడం చూసి అమెరికన్స్‌కు చాలా ఆశ్చర్యం వేసింది. అయినా ఏమీ అడగకుండా చూస్తూ కూర్చున్నారు.

ఇంతలో టి.సి వచ్చి అందరి టిక్కెట్లు చెక్ చేయడం మొదలుపెట్టాడు. వీళ్ళు ఎలా మేనేజ్ చేస్తారా? అని ఆ విదేశీయులు కుతూహలంగా చూస్తున్నారు. టి.సి ఇంకా అవతలివరుసలో ఉండగానే యువకులు ఇద్దరూ కలసి గబగబా వెళ్ళి బాత్‌రూంలో దూరి తలుపు వేసుకున్నారు.

టి.సి కంపార్టుమెంటులోని అందరి టిక్కెట్లు చెక్‌చేసి బాత్‌రూం దగ్గిరకొచ్చాడు. తలుపు మూసి ఉండడంతో అనుమానం వచ్చి తట్టాడు. లోపల ఉన్నవారు తలుపుకింద



నుంచి ఓ టిక్కెట్ బయటకు తోశారు. టి.సి ఆ టిక్కెట్‌ను చెక్‌చేసి మళ్ళీ కిందనుంచి లోపలికి తోసేశాడు.

బోగీలో అందరి దగ్గిరా, చివరికి బాత్‌రూంలో ఉన్నవాడిదగ్గిర కూడా టిక్కెట్టు ఉండడం టి.సి.కి చాలా ఆనందం వేసింది. యువకుల ప్లాను చూసి అమెరికన్లకు మతిపోయింది. వాళ్ళ తెలివితేటలని వారిలోవారే తెగమెచ్చుకున్నారు.

బొబ్బిలిలో ట్రయిను ఆగగానే నెమ్మదిగా బాత్‌రూం తలుపు తెరుచుకుని ఆ యువకులు, విదేశీయులతోబాటు దిగిపోయారు. స్టేషన్‌నుంచి జాగ్రత్తగా బయటపడి సాయంత్రంవరకూ బొబ్బిలి అంతా చూపించి మళ్లా తిరుగు ప్రయాణానికి సిద్ధమయ్యారు. టిక్కెట్టు కౌంటర్‌లో ఆ యువకులు తమ ఇద్దరికీ కలిసి మళ్ళా ఒక టిక్కట్టే తీసుకోమని చెపుదామనుకుంటూండగా అమెరికన్సు గుసగుసలాడుకుని వాళ్ళూ ఒక టిక్కట్టే తీసుకుని ట్రయిను ఎక్కారు.

ట్రయిను బయల్దేరింది. కొంతసేపటికి టి.సి వచ్చి టిక్కెట్ల తనిఖీ ప్రారంభించాడు. యధాప్రకారం యువకులు తమ ప్లాను అమలువరిచే ఉద్దేశ్యంతో బాత్‌రూంలోకి వెళ్ళడానికి సిద్ధమవుతూండగా వీళ్ళకంటే ముందే హడావుడిగా లేచిపోయి అమెరికన్సు ఇద్దరూ గబగబా బాత్‌రూంలో దూరి తలుపువేసేసుకున్నారు. యువకులు తెల్లబోయి ఒకరినొకరు చూసుకుంటూండగా టి.సి చెక్‌చేసుకుంటూ ముందుముందుకు వచ్చేస్తున్నాడు.

అప్పుడు ఒక యువకుడు లేచి వెళ్ళి నెమ్మదిగా బాత్‌రూం తలుపు తట్టాడు. తలుపు కింద నుంచి టిక్కెట్టు బయటకొచ్చింది. ఆ టిక్కెట్టు తీసుకుని ఏమీ ఎరగనట్టువచ్చి సీట్లో కూర్చున్నాడతను.

టి.సి దగ్గిరకు రాగానే యువకులిద్దరూ తమ దగ్గిరున్న రెండు టిక్కెట్లూ చూపించారు. తమ ప్లాను సొంతం చేసుకున్నందుకు ఆ విదేశీయులమీద వాళ్లకు ఒళ్ళు మండిపోతోంది. టి.సిని పిలిచి బాత్‌రూంలో టిక్కెట్టు లేని వాళ్ళు ఇద్దరు దాక్కున్నారని చెప్పారు. టి.సి వెళ్ళి బాత్‌రూం తలుపు తట్టాడు. లోపలున్న అమెరికన్స్‌కి సంగతి అర్ధంకాలేదు "టిక్కెట్టు ఇచ్చినా మళ్ళీ ఎందుకు తలుపు తట్టేడు?" అనుకుంటూ తలుపుతీశారు.

టి.సి ఇద్దర్నీ బయటకు లాగి భారీగా ఫైను వేశాడు. తమ పథకం ఎక్కడ ఫేలయ్యిందో అర్ధంకాక వాళ్ళిద్దరూ ఆ యువకులవైపు అయోమయంగా చూశారు.

"తెలుగువాడి తెలివితేటల్ని మీరు అంత తక్కువ అంచనా వేస్తారా?" అనుకుంటూ ఆ యువకులు ముసిముసిగా నవ్వుతూ కిటికీలోంచి బయటకు చూస్తున్నారు. ట్రయిను యధాప్రకారం సాగిపోతూనే ఉంది.

— బళ్ళా షణ్ముఖరావు

## జరుగుతున్న కథ

ఉదయం ఆలస్యంగా నిద్రలేచిన రాఘవ, తమ ఫాక్టరీ వర్క్సు మేనేజర్ పాండే ఇంట్లో ప్రమాదం జరిగిందని ఆలకించడంతో వున్నవళంగా వరుగెత్తాడు చూడడానికి.

కంపెనీ ఇచ్చిన బంగళాలో వుంటున్నాడు పాండే. రాఘవ వెళ్లేసరికి పరిస్థితి అల్లకల్లోలంగా వుంది. యల్.పి.జి. సిలెండర్ లీక్ అవడం పాండే భార్య గమనించలేదట. వంట చేస్తూంటే నడెన్‌గా సిలెండర్ పేలిపోయి ప్రమాదం సంభవించింది. వంటిల్లూ, ఆ ప్రక్క గదీ పూర్తిగా శిథిలమయిపోయాయి. చావుబతుకులలోనున్న పాండే భార్యను ఆసుపత్రికి తరలించారట.

విచారంగా ఖిన్నవదనంతో కూర్చునివున్న పాండేని పలుకరించే ధైర్యంచాలక, ప్రేలుడు సంభవించిన ప్రదేశాన్ని చూపులతోనే సర్వేచేశాడు రాఘవ విచారంగా. అతని దృష్టి ప్రేలుడికి కరిగిపోగా తునాతునకలయిపడివున్న సిలెండర్ ముక్కలలో ఒకదానిమీద పడింది. అప్రయత్నంగా దానిని తీసిన రాఘవ అదిరిపడ్డాడు.

ఆ ముక్కమీద ఎర్రటి పెయింటుతో పెట్టిన ఇంటూ మార్క్ వుంది!







మరుక్షణం నెలరోజులక్రితపు సంఘటన అతని మదిలో మెదిలింది.

గ్యాస్ సిలెండర్‌ను తయారుచేసే కంపెనీలో క్వాలిటీ కంట్రోల్ ఇంజనీరుగా పనిచేస్తున్న రాఘవ, ఆరోజు వర్క్స్ మేనేజర్ పిలుస్తున్నాడని చెప్పడంతో బెదురుతూనే వెళ్లాడు.

"మిస్టర్ రాఘవా! వాటీజ్ దిస్?" రాఘవ గదిలో అడుగుపెట్టడంతోనే బెబ్బులిలా గర్జించాడు వర్క్స్‌మేనేజర్, తనముందున్న కాగితాన్ని అతనికి చూపుతూ.

ఫాక్టరీలో కొత్తగా తయారైన ఖాళీ సిలెండర్ల మొత్తం బ్యాచ్‌నే క్వాలిటీ సరిగా లేదని రిజెక్ట్ చేస్తూ క్రితంరోజు రాఘవ రాసిన రిపోర్టు అది.

తమ కంపెనీ యల్.పి.జి. సిలెండర్లను తయారుచేసి గ్యాస్ కంపెనీలకు సప్లయ్‌చేస్తుంది. వాటిని గ్యాస్‌తో నింపి కన్స్యూమర్స్‌కి సప్లయ్‌చేస్తాయి గ్యాస్‌కంపెనీలు. ఆ సిలెండర్ల తయారీలో క్వాలిటీకంట్రోల్‌ని జాగ్రత్తగా పాటించకపోయినట్లయితే ప్రమాదాలు జరిగే అవకాశం వుంది... ఫాక్టరీ తయారుచేసిన లేటెస్ట్ లాట్ క్వాలిటీవిషయంలో సంతృప్తికరంగా లేకపోవడంతో ఆ లాటంతా రిజెక్ట్‌చేశాడు రాఘవ, వాటిని మార్కెట్ చేయడానికి వీల్లేదంటూ... అదే విషయం వివరంగా చెప్పాడు అతను వర్క్స్ మేనేజర్‌తో.

"నాన్సెన్స్! మొత్తం లాటంతా రిజెక్ట్‌చేస్తే కంపెనీకి ఎంత నష్టం వస్తుందో ఆలోచించావా?" అంటూ రంకెలువేశాడు అతను. "వెంటనే వాటిని రీఎగ్జామిన్‌చేసి ఓకే చెయ్యి"

"అయాం సారీ సార్! నేను క్వాలిటీ కంట్రోల్ ఇంజనీర్ని. తప్పుడు సర్టిఫికేట్ ఇచ్చి ప్రజలను రిస్కులో పెట్టలేను" అంటూ ఖచ్చితంగా చెప్పేశాడు రాఘవ, అతని అరుపులకు బెదరకుండా.

"డోంట్ బీ సిల్లీ! రెండువేలు జీతమిచ్చి నిన్ను పనిలో పెట్టుకున్నది ఫాక్టరీ సరుకంతా రిజెక్ట్ చేస్తావనికాదు - సర్టిఫై చేస్తావని. ఇప్పుడు ఆ సిలెండర్లను సర్టిఫై చేయకపోయావంటే నిన్ను వుద్యోగంలోంచి తీసివేయాల్సి వుంటుంది, జాగ్రత్త!" అంటూ తీవ్రం.గా హెచ్చరించాడు వర్క్స్ మేనేజర్.

రాఘవ తొణకలేదు. ఉద్యోగంకోసం మనస్సాక్షిని చంపుకోలేక వెంటనే రాజీనామా ఇచ్చేసి వచ్చేశాడు. అతికష్టంమీద ఆర్నెల్ల క్రితం సంపాదించిన ఆ వుద్యోగం అలా వదులుకోవడంతో మళ్లీ ఉద్యోగాల వేటలో పడ్డాడతను.

తాను రిజెక్ట్ చేసిన సిలెండర్లను కంపెనీ మార్కెట్‌చేసిందనీ, వాటిలో ఒకటి విధివశాత్తు వర్క్స్‌మేనేజర్ ఇంట్లోకే వచ్చిందనీ - ఆ సిలెండర్‌ముక్కను చూడగానే గ్రహించాడు రాఘవ. ఇంకా ఎందరు అటువంటి ప్రమాదానికి గురికానున్నారోనని అతని గుండె ఝల్లుమంది.

రిజెక్ట్‌చేస్తూ తాను పెట్టిన ఇంటూ మార్కున్న సిలెండర్ ముక్కను చూస్తూ నిశ్చేష్టుడైన రాఘవ దగ్గరకు వచ్చాడు వర్క్స్ మేనేజర్ పాండే. ఆ గుర్తును అతనికి చూపించాడు రాఘవ మౌనంగా.

అర్థంచేసుకున్న పాండే వదనంలో కత్తివేటుకు నెత్తురుచుక్క లేకుండాపోయింది!

—విశ్వమోహిని



# 'సతిమంటలు' పై సమీక్షలు

నవంబరు 'చతుర'లో ప్రచురితమైన సింహప్రసాద్ నవల 'సతిమంటలు'పై మాకు అందిన సమీక్షలలో ఉత్తమంగా ఉన్న ఆరింటిని ఈ సంచికలో ప్రచురిస్తున్నాం.

## అలాగే మిగిలిపోకూడదు!

(ప్రథమ బహుమతి రు: 100/- పొందిన సమీక్ష)

కొత్త కథా సంవిధానంతో 'విధవ'ల జీవితాల లోకి లోతుగా వెళ్లి, వారి స్థితిగతులనూ, పరిసరాలనూ విపులీకరించి హృదయానికి హత్తుకునేలా చెప్పడం బావుందీ నవల ''సతిమంటలు''లో. ప్రతి సన్నివేశం ఆర్ద్రతను కల్గించేవిధంగా చిత్రించారు రచయిత.

స్త్రీ సమస్య అనాదిగా వస్తున్నదే! ఇది నిన్నటిదీ నేటిదీ కాదు, రేపటిది కూడా! స్త్రీ సమస్యలన్నింటికీ ఇప్పటివరకూ ఏ రచయిత ఒక పరిష్కారమార్గం చూపించిన దాఖలాలు లేవు! ఆ సమస్యలని విశ్లేషణచేసి చూపిస్తున్నారంతే. ఒకరకంగా అలా సమస్యలని ఎనలైజ్ చేసి వ్రాసి భయపెడ్తున్నారేమో? అనిపిస్తుంది. అంటే ఇక్కడ స్త్రీలపై జాలి చూపించీ, నిస్సహాయురాలుగా చిత్రించీ, చిత్రించీ మనమే వాళ్లను ఎదగనీకుండా చేస్తున్నామా? అన్న ప్రశ్న ఉత్పన్నం కాకపోదు! సింపతీ చూపడంవల్ల వాళ్లు ఎదగలేరనే విషయం మనం గుర్తుంచుకోవాలి!

కథాగమనం ఉత్కంఠగా సాగినా అక్కడక్కడా రచయిత తేలిపోయారు. దివ్యలాంటి ఆత్మస్థయిర్యంగల జర్నలిస్టు ప్రతి చిన్న విషయానికీ కదలిపోవడం, ఇంటికొచ్చి కడవలకొద్దీ కన్నీళ్ళు కార్చటం, ఆమె కూడా స్త్రీ అయినందువల్లా?! నవలలో దాదాపు సగంవరకూ ఆమె భోరున ఏడ్చేసే సీన్లు చాలా వున్నాయి. ఇంకా పక్కింటి బేబిచేత సినిమా ఫక్కీలో పెద్ద పెద్దమాటలు చెప్పించటం. ఆ పిల్లకి ఆ వయసుకు అర్థంకాని విషయాల్ని తను ఆవేశంతో చెప్పడం. అవి రచయిత మరోరకంగా చెప్పివుంటే బావుండేదేమో?

నవల్లో దివ్య ఎదుర్కొన్న మొదటి సంఘటన హైదరాబాదులో 'చార్మినార్' మీంచి దూకి ఆత్మహత్య చేసుకున్న ముగ్గురు సోదరీమణులకు చెందింది. ఆ బేస్‌మీద అప్పట్లో చాలా కథలొచ్చాయి. సమాజం సిగ్గుపడాల్సిన సంఘటన అది!! ఇక సతిసంఘటన ఆంధ్ర రాష్ట్రంలో ఓ గ్రామంలో జరిగినట్లుగా ఉంది- పాత్రలన్నీ తెలుగుతనాన్ని నింపుకొని ఉంటే వాళ్లమధ్యకి రాజపుత్ర యువకులు ఎక్కడ్నుంచి వచ్చారో? అసలు 'చునీ్న' ఉత్సవం అంటే ఏమిటో రచయిత వివరించేవరకూ పాఠకులకి తెలిసే విషయం కాదు.

వారు ఇప్పుడిప్పుడే ఎదుగుతున్న ఈ తరుణంలో వారిలో మార్పు తీసుకొచ్చేందుకూ, ముమ్ముందు ఇంకా ఎదిగేందుకూ ప్రతిరచనా దోహదపడాలి. అంతేకానీ వారి సమస్యలని మళ్లీ భూతద్దంలోంచి చూపి ఇంకా జడిపించడం ఎందుకు??

— *శ్రీనివాసరాజా, కరీంనగర్.*

## గుండెల్ని తాకే శూలాలు

**(ద్వితీయ బహుమతి రు. 75/- పొందిన సమీక్ష)**

కాలం మారింది. స్త్రీలీనాడు రాజకీయాల్లో రాణిస్తున్నారు. ఆటల్లో ఆసియాడ్‌కెళ్తున్నారు. ఐ.ఎ.యస్., ఐ.పి.యస్.లు కూడా అవుతున్నారు. పురుషులతో సమానంగా స్వేచ్ఛననుభవిస్తున్నారు. ఇటువంటి కాలంలోనా ఈ నవల రాసేది అని సతిమంటలు గురించి కొందరు అనుకోవచ్చు. నిజమే నేడు స్త్రీలు స్వేచ్ఛాస్వాతంత్ర్యాలు అనుభవిస్తున్నారు, కాని వారి శాతమెంత? నూరులో ఒకటి కూడా కాదు... ఆ ఒకటిలో నూరవవంతు! అంతే!! మనరాష్ట్రంలో ఈరోజు ఆ ఆచారం లేకపోవచ్చు. కాని దేశంలో ఉంది. అందుకు రూపాకన్వర్ ఉదంతంకన్న రుజువేంకావాలి? కాబట్టి ఇది బర్నింగ్ ప్రాబ్లమే!

హేయాతిహేయమైన ఈ ఆచారం ఎందుకు జరుగుతోందో, ఎలా జరుగుతోందో, సతికి గురయ్యే అబల మానసిక క్షోభ ఎలాంటిదో హృద్యంగా, ఛాందసులుసైతం ఆలోచించే విధంగా చెప్పగలగడంలో రచయిత సక్సెస్ అయ్యారు. సమస్య పూర్వాపరాలను చర్చించి పరిష్కారాన్ని పాఠకులకే వదిలారు. అందువల్లే పాఠకుడు సమస్య గురించి కొంతసేపైనా ఆలోచించగలడు.

కొన్నిచోట్ల రచయిత వ్రాసిన వాక్యాలు శూలాల్లా గుండెల్ని తాకుతాయి. సమస్యకు ఎంతో స్పందిస్తేగాని, ఆ స్పందనని పాఠకుడిలోకూడా కలిగించాలనే తపనతో ఎంతో శ్రమిస్తేగాని ఏ రచయితా అలాంటి వాక్యాల్ని వ్రాయలేడు. స్త్రీ ఆదిశక్తని పైకి అంటూనే పురాణాలు, ఇతిహాసాలు, వేదాలు స్త్రీ శక్తిని ఎలా అణచివేస్తున్నాయో రచయిత చక్కగా చెప్పారు. అసలు సమస్యనేకాక, మరికొన్ని స్త్రీల సమస్యల్ని అనుబంధంగా తీసుకోవడం నవలకు నిండుదనాన్నిచ్చింది. కాని, అసలు (సతి)తో కాక అనుబంధం (వరకట్న చావు)తో నవలను ముగించడం బాగోలేదు. రచయిత సతిని మాత్రమే కాక స్త్రీ సమస్యలన్నింటినీ తీసుకున్నారనీ అనుకోలేం. ఎందుకంటే స్త్రీ సమస్యలనేకం.

—*లంక ఫణీందర్, తుంగభద్రడ్యామ్.*

## ఆశావహ భవితవ్యం

**(తృతీయ బహుమతి రు. 50/- పొందిన సమీక్ష)**

సింహ ప్రసాద్‌గారి పురాతన, చారిత్రక, ఆధునాతన 'సతిమంటలు' దశలవారీ ప్రదర్శన నవల పరిచయ వాక్యాలకి తగినట్లుగా హృదయాలకు హత్తుకునేవిధంగా ఉంది.

సమకాలికతకు ఫ్లాష్‌బ్యాక్ జోడించి, చారిత్రక దర్పణంలో ఆచరణ ప్రతిబింబాన్ని చూపడంలో రచయిత ప్రతిభ చక్కగా ద్యోతకమైంది. ఈ ప్రక్రియే రచనకు వైవిధ్యం తెచ్చింది. వస్తువు పాతదే అయినా దానిని మలిచినతీరు మెచ్చదగింది.

ఈమధ్య రూపాకన్వర్ 'సతి' కదిలించిన ఆవేదనాతరంగాలు, సుడిగుండాల ముద్ర రచనలో అడుగడుగునా కనిపిస్తుంది.

సమకాలికతకోసం మాత్రమే సీతను చొప్పించినట్లుగా ఉంది. రచయిత 'సతి' గురించిన చారిత్రక విషయాలపట్ల చూపిన శ్రద్ధ సమకాలికతపట్ల చూపలేదనే

చెప్పాలి. బహుశా ఇది నడుస్తున్న చరిత్ర అనేమో!

నాయికను జర్నలిస్టు చేయడం నావెల్టీయే. అయితే ఆమెలో ఆచరణాత్మకత, తెలివితేటల కన్నా ఆవేదనాత్మకతే ఎక్కువగా ఆవిష్కరింప బడటం శోచనీయం. సీత విషయంలో దివ్య ఒక మామూలు ఆడపిల్లకన్నా ఎక్కువేం చేయలేకపోయింది. తనవాడైన చైతన్యతో ఎందుకు చెప్పలేకపోయిందో, సీత విషయంలో ఆమె ఆలోచనేమిటో స్పష్టంకాలేదు. తానుగా నిలదొక్కుకుని, ధైర్యము, సేవాభావములున్న దివ్య తన స్వంత వదినను కాపాడుకోలేకపోవటం, తల్లిదండ్రులు, అన్నల స్వభావాలు తెలిసీ ఆలోచించలేకపోవడం స్త్రీ సహజమైన బలహీనతను వ్యక్తపరుస్తున్నదేకాని మరోటి కాదు.

ప్రతి చిన్న సంస్కరణకు ఏ వీరేశలింగమో రావాలనుకోకుండా 'ప్రయత్నించి చిన్న దీపమైనా వెలిగించు' అని చైతన్య నిరూపించాడు. అయితే ఆడది పెళ్ళే సర్వస్వం అనుకోవల్సిన అవసరం లేదని చాటిఉంటే బాగుండేది. దివ్యను, చైతన్య వివాహమాడితేనే అభ్యుదయగామి అయినట్లా?

ముగింపు 'స్త్రీ సంఘటిత శక్తి' కావటంమాత్రం స్ఫూర్తినిచ్చింది. ఆశావహమైన భవితవ్యం కనులకు తోచింది.

-- ఆర్. లక్ష్మీకుమార్, వరంగల్

## సజీవ పాత్రలు

*(నాలుగవ బహుమతి రు: 25/- పొందిన సమీక్ష)*

**నే**టి ఆధునిక యుగపు, (అ) సభ్యసమాజంలో స్త్రీలపై జరిగే అత్యాచారాలను, ముఖ్యంగా విధవల దయనీయ జీవితాలను, సతీసహగమన దురాచారాలను గూర్చి అసహజత్వానికి తావివ్వకుండా, 'సతిమంటలు' నవలలో రచయిత సింహప్రసాద్‌గారు వ్యక్తపరిచారు.

దీపాదేవిని బలవంతంగా సహగమనానికి ప్రేరేపించి, ఆమె నోట్లో మత్తుమందుకుక్కి, అటు ప్రజలకు మూఢత్వపు ముసుగును కప్పి, అర్థంలేని ఆచారాలపేరుతో అంధుల్ని చేసి, తమ ఆర్థిక, రాజకీయ స్వలాభాలకు వాళ్ళను కీలుబొమ్మలుగా వాడుకున్న మృత్యుంజయరావు, సూరపరాజులాంటి మేకవన్నె పులుల ఆటకట్టించడానికి, దివ్య చేసిన ప్రయత్నాలు ఎంతైనా ప్రశంసనీయం!

దీపాదేవి అన్యాయంగా మంటలకాహుతి అవుతున్నా, జరిగే అక్రమాన్ని చుట్టూవున్న ప్రజలముందు బయటపెట్టి ఆమెను రక్షించే ధైర్యంలేక, తన చేతులమీదుగానే సహగమనాన్ని శాస్త్రోక్తంగా జరిపించి, ఒక వైపు అంతర్మథనానికి గురౌతూ, మరోవైపు తనలోని ఇన్‌ఫీరియారిటీ కాంప్లెక్సును కప్పిపుచ్చుకోడానికి సతిని సమర్థిస్తూ, ఆంగ్లవిద్యనీ, ప్రభుత్వ విధానాలను దుయ్యబట్టే సోమయాజుల పాత్ర చిత్రీకరణ చాలా బాగుంది. కన్న కూతురు ప్రాణాలతో కాలి బూడిదైనా, లోకం దృష్టిలో దేవతగా మారిందని పైకి ఆనందం వ్యక్తంచేస్తూ, కొండంత ఆవేదనను దిగమింగి, "గతంగతః" అనుకొంటూ ఆత్మసాక్షిని చంపుకొని జీవచ్ఛవంలా బ్రతికే దీపతండ్రి నేటి సగటు మనిషికొక నిదర్శనం.

సుందరిని చాకచక్యంగా బానిసత్వపు చెరనుండి విముక్తి చేసిన దివ్య, తన తల్లిదండ్రులు, అన్నయ్యల పైశాచికత్వానికి వదినను బలికాకుండా కాపాడటంలో మాత్రం ఓటమిని చవిచూడక తప్పలేదు.

— జె.వి.వి. ప్రసాదరావ్, మద్రాసు.

## స్త్రీ సమస్యలు ఎన్నో...!

*(అయిదవ బహుమతి రు. 25/- పొందిన సమీక్ష)*

**స్త్రీ**ని గురించిన ఒక మహోన్నత వాక్యంతో ప్రారంభింపబడిన 'సతిమంటలు' నవల కేవలం ఒక 'సతి' దురాచారాన్ని గురించి 'యిన్‌ఫర్మేటివ్'గా వుంది తప్ప మరే ప్రయోజనాన్నీ సాధించలేకపోయింది.

దివ్య పాత్ర చిత్రీకరణ కూడా వెలితిగానే వుంది. మహిళా జాగృతికోసం, చైతన్యంకోసం యీ పాత్ర చాలా ఆరాటపడుతున్నట్లు కనిపిస్తుందే తప్ప వాస్తవంలో చేసిందేమీలేదు. ఈ పాత్రకంటే చైతన్య, మహర్షిలాంటి పురుష పాత్రలే ప్రాక్టికల్‌గా వున్నాయి. దివ్య ఏ కొద్దో

గొప్పో చేసినా దాని వెనుక యీ ఇద్దరి పురుమల ప్రోత్సాహం, ప్రోద్బలమే ప్రస్ఫుటం అవుతుంది. దివ్య పాత్రను విధవగా చిత్రించటం ఎందుకో అర్థంకాదు. విధవలు కానివాళ్ళు విధవల బాగుకోసం పాటుపడకూడదని రచయిత ఉద్దేశ్యమా? తన స్వంత వదిన అయిన సీత జీవితాన్ని చక్కదిద్దటంలో కూడా దివ్య విఫలమయింది. ఇంటినుండి బయటపడి తన దగ్గరకొచ్చిన సీతను మళ్ళీ ఆ యింట్లోనే వదిలి వెళ్ళడం ఆమె అవివేకానికి తార్కాణం. తన అన్న, తల్లి, తండ్రీ ఎంతటి కర్కోటకులో తెలిసి కూడా వారి కల్లబొల్లి మాటలు, నటన నమ్మి ఆమెను అక్కడ వదిలి వెళ్ళటం దివ్య భావచైతన్యానికి నిదర్శనమా? అలాగే సుందరి దగ్గరికి వెళ్ళినప్పుడు విధవల జీవితంలో చేదు అనుభవాలను ఆమె నోటిద్వారా విని "ఎంత పచ్చి నిజం! ఎంత క్రూరమైన నిజం!" అని కేవలం విస్తుపోవటం ఆమె వ్యక్తిత్వాన్ని కించపరచటమే!

సామాజిక సమస్యకు రాజకీయాలతో ముడి పెట్టే వ్యర్థప్రయత్నం కూడా రచయిత చేశారు. దీన్ని కేవలం ఒక సామాజిక రుగ్మతగా చిత్రీకరించివుంటే బావుండేదేమో! స్కానింగ్ ద్వారా బిడ్డ ఆడో, మగో తెలుసుకొని అబార్షన్‌కు పాల్పడే అన్యాయాన్ని కూడా చర్చించారు గాని కథతో అది ముడిపడలేదు. పానకాలు ఫొటోల ప్రహసనం అంతా నాటకీయంగా వుంది. పాత్రలమధ్య సంభాషణలలో ఉపన్యాసధోరణి వ్యక్తపరచటానికి, వీలైనంత ఎక్కువ యిన్‌ఫర్మేషన్ అందించటానికి కథను సాగదీశారు. చివరికి తన పెళ్ళి విషయంలో కూడా దివ్య స్వతంత్రంగా, ధైర్యంగా వ్యవవహరించలేకపోవటం ఆశ్చర్యం కలిగిస్తుంది.

స్త్రీలకు సంబంధించిన ఎన్నో సమస్యలు వున్నాయి అని రచయిత చెప్పదలచుకున్నారని స్పష్టమవుతుంది గాని, దేన్నీ రచయిత పూర్తిగా చెప్పలేకపోయారు. ఏ సమస్యకూ పరిష్కారాన్ని కూడా సూచించలేదు. అందుకే యీ నవల అసంతృప్తిని కలిగించింది. 'సతి'పట్ల నిరసనకంటే ప్రోత్సాహమే కలిగించే రీతిలో యీ నవల్లో కొన్నిచోట్ల సంభాషణలు చోటుచేసుకోవటం విచారకరం.

– **ఈతకోట ఉదయకిరణ్**, నెల్లూరు.

# యదార్థ గాథ...!

**(అరవబహుమతి రు: 25/- పొందిన సమీక్ష)**

ప్రపంచం ఇరవైఒకటో శతాబ్దంలోకి అడుగుపెడుతున్న ఈ కాలంలో కూడా అంతరించిపోయిందనుకున్న సతీసహగమనం అక్కడక్కడ తలెత్తుతూనే వుంది. పత్రికాప్రపంచం దృష్టికిరాని సంఘటనలు ఎన్ని వున్నాయో! ఈ అంశంమీద చక్కటి సామాజిక ప్రయోజనకరమైన రచనల్లో ఇదే మొదటిది కావచ్చు. నేడు స్త్రీలు ఎదుర్కొనే ప్రధానమైన సమస్యలన్నిటినీ ఇందులో ప్రస్తావించారు. సందర్భోచితంగా ఉదహరించిన సంఘటనలు చదువరుల మనసుల్లో ఆలోచనను తప్పనిసరిగా ప్రభావితం చేస్తాయి. ఈ సమస్యలన్నిటినీ దివ్య ఆలోచనల ద్వారా పాఠకుల మనసుల్లో ఆలోచనలను, రేకెత్తించేందుకు ప్రయత్నంచేసి సఫలీకృతులయ్యారు రచయిత. మధురలో భర్త చనిపోయిన స్త్రీల దీనగాథ, ఒకపూట భోజనం గురించి వాళ్ళుపడే పాట్లు హృదయాన్ని కదిలిస్తాయి. భర్త చనిపోయినంత మాత్రాన ఇంత నికృష్టపు బ్రతుకు సమాజం వాళ్ళకి కలగచేయడం దురదృష్టం. దీపానతికి బ్రెయిన్‌వాష్ చేసి భర్త శవంతోపాటు సజీవదహనం చేశారు ఆస్తిలో వాటాపోకుండా వుండడం కోసం. రామారావు, మహంకాళి, ఆంజనేయులు సీతని సజీవదహనం చేశారు డబ్బు రాబట్టడం కోసం. బ్రతకడానికి దారిలేక ఎప్పుడు చావు వస్తుందా అని ఎదురుచూస్తూ మధురలో (అక్కడనే కాదు, దేశంలో ఎక్కడయినా ఒకటే పరిస్థితి) ఆత్మాభిమానాన్ని చంపుకుని బతుకుతున్నారు భర్త చనిపోయిన స్త్రీలు. కట్నం ఇచ్చుకోలేని దురదృష్టకరమైన పరిస్థితి ఎదురై వెంకటరత్నంగారి పిల్లలు ఆత్మహత్య చేసుకున్నారు.

సతిమంటల భుగభుగల్నుంచీ, వరకట్నపు చిత్రవధల హాహాకారాల్నుంచీ, అవమానాన్ని పరీక్షల విషనాల్కల్నుంచీ విముక్తం కావాలని అంటూ ఒక ఉత్తేజకరమైన ముగింపు ఇచ్చారు రచయిత. ప్రతి ఒక్కరిని కదిలించి, ఆలోచింపచేసేఉత్తమమైన రచన"సతిమంటలు"

– **యన్నంశెట్టి మురళీకృష్ణ**, రాజమండ్రి.

# చతుర

సంపుటి: 14    సంచిక: 12    జనవరి 1992


అతను... ఓ ఆకతాయి బ్రహ్మచారి. అందర్నీ ఆటపట్టించి ఆనందించటం అతని హాబీ! సృష్టిలోని అందాన్నంతా తనలోనే నిక్షిప్తం చేసుకున్నట్లున్న అనుపమాన సౌందర్య రాశికి తొలిచూపులోనే హృదయం అర్పించేసుకున్నాడు. అతనిలోని ఒకానొక గుణాన్ని ఏవగించుకున్న ఆమె అతన్ని తృణీకరించటంతో అతని జీవన నరళి మరోమలుపు తిరిగింది.

ఏమిటా మలుపు? ఆమె 'ప్రేమఫలాన్ని' జయించేటందుకు అతను ఎలాంటి నియమపోరాటం చేశాడు? ఎదురైన ఇక్కట్లు ఎలాంటివి? చివరికి ప్రేమ పందెంలో ఎవరు ఓడి ఎవరు గెలిచారు?

హాస్యపు చిరు జల్లులు చిలకరిస్తూ,
మనోరంజకమైన శైలితో

## కె.ఎమ్.కోకిల రాసిన

# ప్రేమపందెం

ఈనెల 'చతుర' సమర్పిస్తున్న సమగ్ర నవల

"ఛీ!నీకీ జన్మలో బుద్ధిరాదురా!" కోపంగా అన్నాడు సుబ్బారావ్.

గౌతమ్ తన దుబ్బు మీసాల్ని దువ్వెనతో క్రిందికి దువ్వుకుంటూ చిరునవ్వు నవ్వాడు.

"ఛీ...నవ్వుతావ్ పైగా సిగ్గులేకుండా!"

"నేనేం చేశానిప్పుడు?" అమాయకంగా ముఖం పెట్టాడు గౌతమ్. నిజంగా తెలియకకాదు. అదోరకం తుంటరితనం.

అదే గదిలోవున్న డుంబూ ఈ అంకుల్స్ ఇద్దరికేసీ మార్చి మార్చి చూశాడు. 'ఇంతదాకా బాగానేవున్నారుగా! సడన్‌గా వీళ్ళిద్దరూ ఎందుకిలా దెబ్బలాడేసుకుంటున్నారు చెప్మా?' అని.

"చూడ్రా! ఈడుంబుగాడు ఎంత ముద్దుగా, అమాయకంగా వున్నాడో! వాడి మీదా నీ ప్రతాపం? నీకిదేం పాడుబుద్ధి?"

గౌతమ్ ముఖంలోని తెచ్చికోలు అమాయకత్వం ఇంకా అలాగేవుంది. "వాణ్ణి నేనేం చేశానిప్పుడు?"

"నోర్ముయ్ వెధవా!" అని మిత్రుణ్ణి గసిరి-

"రేయ్ డుంబూ ఇలారా!" అన్నాడు సుబ్బారావ్.

"ఏంటంకుల్?" అంటూ రాబోయాడు.

"ఏం లేదుగానీ నువ్వెళ్ళి ఆడుకోపో" బుగ్గల్ని ఉబ్బించి నవ్వు దాచుకుంటూ అన్నాడు గౌతమ్.

డుంబూ ఎవరిమాట వినాలో అర్థంకాక అలాగే నించుండిపోయాడు.

సుబ్బారావే లేచి వాడి దగ్గరికి వెళ్ళి వాడి చొక్కాకి వీపు వైపు అతికించివున్న కాగితం ముక్కని పీకేశాడు.

ఆ చిన్న కాగితం ముక్కమీద నేను గాడిదని అనే అక్షరాలు స్కెచ్ పెన్‌తో కుదురుగా రాసున్నాయి.

"ఊఁ... ఇంకవెళ్ళి ఆడుకో" అన్నాడు సుబ్బారావ్ ఆ కాగితం ముక్కని వుండలా చుట్టి కిటికీలోంచి బైటికి గిరవాటేస్తూ.

"ఏంటంకుల్ అది?" డుంబూ ఆసక్తిగా అడిగాడు.

"ఏదో ఒకట్లే. నువ్వెళ్ళి ఆడుకో పో" అనేశాడు సుబ్బారావ్.

డుంబూ బుర్ర గోక్కుంటూ బైటికెళ్ళిపోయాడు-

"ఏం పనుల్రా ఇవి? వాళ్ళమ్మా నాన్నా చూస్తే ఏమనుకుంటారు?" మిత్రుడి వైపు ఎర్రగా చూస్తూ అన్నాడు సుబ్బారావ్.

"ఏమీ అనుకోరు. అందరూ నీలాంటి సెన్సాఫ్ హ్యూమర్ లేని రాచిప్పలే వుంటారా? ఏదోలే కొంటె కుర్రాళ్ళు మా అబ్బాయిని ఆట పట్టించడానికి చేసుంటార్లే అని నవ్వుకుంటారు" తననితాను డిఫెండ్ చేసుకుంటూ అన్నాడు గౌతమ్.

"సెన్సాఫ్ హ్యూమరా నీ బొంద? నీలోని పిల్లకాయ మెంటాలిటీకి నువ్ పెట్టుకున్న ముద్దు పేరది! ఛీ! ఎన్నిసార్లు చెప్పినా వినిపించుకోవుగదా! ఎప్పుడు ఎవర్ని ఏడిపిద్దామా అని చూస్తుంటావ్! ఇలా ఎదుటి వ్యక్తుల్ని టీజ్ చేయడం ఎంత చెడ్డ అలవాటో తెలుసా?"

"ఆపరా బాబూ నీ ఉపన్యాసం! ఏదో పసివెధవ కదాని ముచ్చటపడి ఆట పట్టించబోతే దానికింత రాద్ధాంతం దేనికి?" విసుక్కున్నాడు గౌతమ్.

"హూఁ... ఒక్కసారి మన క్లాస్‌మేట్ గాయత్రిని గుర్తుచేసుకో. నీ టీజింగ్ వల్ల పాపం ఆ అమ్మాయి..."

సుబ్బారావ్ గాయత్రి ప్రస్తావన తీసుకురాగానే గౌతమ్ ముఖం కళావిహీనమయ్యింది. "సర్లే సర్లే! ఇప్పుడా గొడవదేనికి?" అన్నాడు అదోలా తల విదిలిస్తూ.

"అవసరం కాబట్టే గుర్తు చేస్తున్నాను. నువ్వా అమ్మాయిని 'తాటకి, శూర్పణఖ' అంటూ నానా రకాల ఛండాలపు నిక్‌నేమ్స్ పెట్టి ఘోరంగా ఏడిపించబట్టేగా పాపం ఆత్మహత్య చేసుకోబోయింది?"

"కానీ బ్రతికిందిగా?"

"అదృష్టవశాత్తూ బ్రతికిందిలే! ఒకవేళ నిజంగానే చనిపోయుంటే ఆ పాపం నిన్నెప్పటికీ వదిలేది కాదు. పాపం సంగతలా ఉంచి పోలీసులు పట్టుకెళ్ళి ఉండేవారు"

"సర్లే సర్లే"





ఇంకా అక్కడే వుంటే అలాగే వేపుకు తింటా డనిపించి చటుక్కున లేచి షర్ట్ తగిలించుకుని గబగబా బైటికెళ్లిపోయాడు. గౌతమ్.

'వీడీ జన్మలో మారడు' అనుకున్నాడు సుబ్బారావ్.

వాళ్ళిద్దరూ బాల్య మిత్రులు. ప్రాణస్నేహితులని నిస్సంకోచంగా చెప్పుకోవచ్చు.

★ ★ ★

"రేయ్ రేయ్...టున్ టున్‌రా!" బస్టాప్‌లో తమకి ఒకింత ఎడంగా నిలబడ్డ ఓ స్థూలకాయురాలి వేపు క్రీగంట చూస్తూ అన్నాడు గౌతమ్ సుబ్బారావ్‌తో.

"చప్ నోర్మూయ్... ఆవిడ వింటే బాధ పడ్తుంది" కసిరాడు సుబ్బారావ్.

"బాధ పడేదే అయితే ఆ శరీరాన్ని అంతలా ఎందుకు పెంచేస్తుంది?"

"భగవంతుడిచ్చిన శరీరానికి ఆవిడేంచేస్తుంది పాపం? వూర్కో, మన మాటలు వినబడతాయ్" గౌతమ్ డొక్కలో మోచేత్తో పొడిచాడు సుబ్బారావ్.

"వినబడితే ఏం? కరిచేస్తుందా? మింగేస్తుందా? నీకేం ఫర్వాలేదు నువ్వలా చూస్తూండు, నేను చిన్న తమాషా చేస్తాను" అంటూ సుబ్బారావ్ వారించేలోపుగానే చకచకా ఆమెని సమీపించాడు గౌతమ్.

ముప్పై అయిదూ నలభై మధ్యలో వుంటుందామె వయసు. శుభ్రంగా ఉతికి నీట్‌గా ఇస్త్రీ చేసిన చేనేత చీరలో ఒబ్బిడిగాని లబడి వుందామె. భుజానికి వేళ్లాడుతూన్న వ్యానిటీ బ్యాగ్, బస్ కోసం ఆమె ఆత్రంగా ఎదురు చూస్తూన్న విధానం- ఆమె ఓ ఉద్యోగస్థురాలని చెప్పకనే చెబుతున్నాయి. విపరీతమైన లావుతప్పితే, ఆమెలో ఎగతాళిచేయాలన్పించడానికి మరే అవలక్షణమూ లేదు.

"నమస్తే మేడమ్!" ఆమెను సమీపిస్తూనే చేతులు జోడించాడు గౌతమ్.

ఆమె అతనికేసి ఎగాదిగా చూసింది. 'ఎవరు మీరు?' అన్నట్లు కళ్లతోనే ప్రశ్నించింది.

"నన్ను గుర్తు పట్టలేదా మేడమ్? నేనూ, గౌతమ్‌ని" ఎంతో పరిచయం వున్నవాడిలా ముఖం నిండా చిరునవ్వు నింపుకున్నాడు గౌతమ్.

ఈ వెధవ మళ్లీ కొంప మీదకి ఏదో గొడవ తెచ్చేలా వున్నాడని మనసులోనే భయపడ్తూ ప్రాణాలు బిగబట్టుకు చూడసాగాడు సుబ్బారావ్.

"గౌతమా?" ఆమె గౌతమ్ కేసి ఆశ్చర్యంగా చూసింది.

"అవును మేడమ్ గౌతమ్‌నే! ఆరోజుల్లో మీరు నన్నెంతో అభిమానంగా చూసేవారు. మన క్లాసంతటికీ నేను ఒక్కణ్ణే కదా బ్రిలియంట్ స్టూడెంట్‌ని. అందుకని నేనంటే మీకు స్పెషల్ లైకింగ్ వుండేది. అఫ్‌కోర్స్ తెలివైన స్టూడెంట్స్‌ని లెక్చరర్స్ అభిమానించడం సహజమే అనుకోండి! బాగున్నారా మేడమ్?"

వడవడా వాగేస్తున్న గౌతమ్ కేసి వెర్రి చూపొకటి చూసి- "సారీ... మీరెవరో నాకు తెలియదు. నేను మీరనుకొంటున్న లెక్చరర్‌ని కాదు" అందామె ఒకింత బిడియంగా.

"వ్వాట్?! మీరు మా కెమిస్ట్రీ లెక్చరర్ ఆండాళ్ళమ్మగారు కాదా?!!" ముఖం నిండా తెగ ఆశ్చర్యాన్ని నింపుకుంటూ అన్నాడు గౌతమ్- "వండర్‌ఫుల్! అద్భుతం! మనిషిని పోలిన మనుషులుంటారని తెలుసుగాని మరీ ఇంత అచ్చుగుద్దినట్టు వుండటం నిజంగా విచిత్రమే! నా కళ్ళను నేనే నమ్మలేక పోతున్నాను. వెరీవెరీ సారీ మేడమ్"

నిజానికతను చదివింది బి.కాం. బియ్యేస్సీ కాదు.

ఫర్వాలేదులే అన్నట్టు తలూపిందామె.

కానీ గౌతమ్ అంతటితో విడిచి పెట్టలేదు "నిజం మేడమ్... మీరచ్చం మా ఆండాళ్లమ్మ మేడమ్‌లాగేవున్నారు. అదే ఫిగరు అవే ఫేస్‌కట్స్..."

'ఇట్సాల్‌రైట్' అన్నట్టు తల పంకించి ఇబ్బందిగా నవ్విందామె.

"అవును మేడం... నిజం! మేమావిణ్ణి చాటుగా ఏనుగు మేడం ఏనుగుమేడం అని పిలుచుకునేవాళ్ళం. సారీ... వస్తాను మేడం" అనేసి ఆమె రియాక్షన్‌ని అబ్జర్వ్ చేయకుండానే చకచకా సుబ్బారావ్ వైపు అడుగులు వేశాడు గౌతమ్.



ఆమె పైకి వినిపించకుండా ఏదో గొణుక్కుంది. స్వతహాగా శాంతస్వభావురాలిలా ఉంది, పాపం. అందుకే గౌతమ్ మీద విరుచుకు పడలేదామె.

అయితే ఆమె ముఖం పాలిపోవడాన్ని మాత్రం మిత్రులిద్దరూ స్పష్టంగానే గమనించగలిగారు.

ఆ సమయంలో ఆ బస్టాప్‌లో వున్నది వాళ్లు ముగ్గురు మాత్రమే కాకపోయివుంటే గౌతమ్ అంత సాహసానికి పూనుకో గలిగేవాడు కాదేమో!

అంతలో తను ఎక్కాల్సిన బస్ రావడంతో ఆమె ఎక్కి వెళ్ళిపోయింది.

వెళ్ళిపోతున్న బస్‌వైపు చూస్తూ గౌతమ్ నుద్దేశించి అన్నాడు సుబ్బారావ్.

"ఎన్నిసార్లుచెప్పినా నీ బుద్ధి మార్చుకోవేంరా? పాపం ఆవిడెంత బాధ పడుంటుందో?"

గౌతమ్ నవ్వేసి వూరుకున్నాడు.

★ ★ ★

ఒకే వూళ్లో పుట్టిపెరిగి ఒకే బడిలోనూ, ఒకే కాలేజీలోనూ కలిసి చదువుకున్న మిత్రులు చాలామందే వుంటారు. అలాంటివారిని సాధారణంగా బ్రతుకుతెరువు విడదీస్తూంటుంది. మనుషులు ఎడమైపోయాక కాలగతిన ఎంతటి ప్రగాఢస్నేహమైనా రంగు వెలిసిపోవడం సహజం!

కానీ గౌతమ్ సుబ్బారావ్‌ల విషయంలో అలా జరక్కపోవడం వారి అదృష్టం కావచ్చు, బహుశా వాళ్ల స్నేహాన్ని చూసి ఆ భగవంతుడు ముచ్చటపడి వుండొచ్చు... ఏమయితేనేం, మొత్తానికి ఇద్దరికీ హైదరాబాద్‌లోనే ఉద్యోగాలు దొరికాయి, వేర్వేరు సంస్థల్లో. అందులోనూ రవంత అదృష్టం ఏమిటంటే వాళ్లిద్దరి ఆఫీసులూ ఒకే ఏరియాలో వుండటం! అందువల్ల వాళ్ళిద్దరూ ఆఫీసులకి వెళ్ళి రావడం కూడా కలిసే జరుగుతూంటుంది. ఎటొచ్చీ ఒకర్ని విడిచి ఒకరు వుండాల్సిరావటం కేవలం ఆఫీస్ అవర్స్‌లో మాత్రమే.

ఆఫీస్‌కెళ్లి అటెండెన్స్ రిజిష్టర్‌లో సైన్ చేసి తన సీట్లో కూర్చున్నాక బస్టాప్ టున్‌టున్ సంఘటన మనసులో మెదిలి తనలో తాను నవ్వుకున్నాడు గౌతమ్.

అది చూసి అడిగాడు ప్రక్కసీటు రాంబాబు.

"ఏంటి గురూ నీలో నువ్వే నవ్వేసుకుంటున్నావ్?"

"టున్‌టున్ గుర్తొచ్చింది?"

"'టున్‌టున్?!' పాత సిన్మాతారకదూ?"

"ఎస్...ఆ టున్‌టున్ సంగతే"

"ఉన్నట్టుండి ఆవిడెందుకు గుర్తొచ్చింది?"

"అదంతే!" వివరాలు చెప్పటం ఇష్టంలేక ముక్తసరిగా కట్‌చేసిన గౌతమ్, మేనేజర్ ఛాంబర్‌లోంచి పిలుపురాగా లేచి వెళ్లాడు లోపలికి.

"సర్?"

"బీసీటెడ్" అనలేదు మేనేజర్.అలా అని అతను ఏనాడూ అనడు. తన క్రింద వస్తేసే సబార్డినేట్స్ అందరూ క్రిమికీటకాదులతో సమానం ఆయన దృష్టిలో. క్రిములకీ, కీటకాలకీ సీట్స్ ఆఫర్‌చేసే పిచ్చివాళ్లెవ్వరూ వుండరు!

తన టేబుల్ మీదున్న ఫైళ్ళలోంచి ఒకదాన్ని తీసి గౌతమ్ వైపు విసురుతూ అన్నాడు మేనేజరు.

"వాటీజ్ దిస్?"

"ఫైల్ సర్" అనబోయి బావుండదని కంట్రోల్ చేసుకుని- "ఎనీథింగ్ రాంగ్ సర్?" అన్నాడు గౌతమ్.

"నాట్ ఎనీథింగ్! బట్ ఎవ్రీథింగ్ రాంగ్! ఆ గోవిందరాజులు అండ్‌సన్స్ కన్‌సైన్‌మెంట్‌లో..."

"ఫిగర్స్ తప్పు పడ్డాయా సార్?" మాట పూర్తికాకముందే అందుకుంటూ అడిగాడు గౌతమ్.

"అవును... ఏం వస్సేసేటప్పుడు ఒళ్ళు దగ్గరుండటం లేదా?" ఇంచుమించుగా అరిచాడు మేనేజరు.

"బీపీ పేషెంట్" అని మనసులో గొణుక్కున్నాడు. అధికారంలో వున్నవాళ్లందరికీ బీపీ దానంతటదే సంప్రాప్తమవుతుందనీ, అందుకే అలాతోక గిల్లిన వులుల్లా అరుస్తారనీ అతని



ఉద్దేశ్యం- "ఏమో సర్... నాకు తెలియదు" అన్నాడు గౌతమ్ వినయంగా.

"ఏంటి తెలియంది? ఫిగర్స్ వేసేటప్పుడు సున్నాలు మింగేస్తే కంపెనీ మునిగిపో తుందని తెలియదా?"

"తెలియదేమో సర్" గౌతమ్ కంఠంలోని వినయం చెక్కుచెదరలేదు.

బట్టతల మీద బొంగరాన్ని తిప్పినట్టని పించి మండిపడ్డాడు మేనేజరు.

"తెలియదేమోనా? వాడ్డుయుమీన్? ఏం తిక్కతిక్కగా వుందా?"

"సారీ సర్... ఆ ఫైల్ డీల్ చేసింది నేను కాదు పొట్లకాయగాడు"

అనేసి నాలుక్కరుచుకున్నాడు గౌతమ్. పొట్లకాయగాడు అంటే అతని ఉద్దేశ్యంలో తన కొలీగ్ పావనమూర్తి అన్నమాట! సన్నగా పొడు గ్గా రివటలా, గట్టిగా గాలివీస్తే మధ్యకి విరిగిపో యేలా వుంటాడు కాబట్టి అతనికా నిక్‌నేమ్ పెట్టాడితను.

మేనేజర్ కోపం నసాళానికి అంటింది.

"పొట్లకాయగాడా? హు ఈజ్ దట్ బ్లడీ స్నేక్ గోర్డ్?"

"పావనమూర్తి సర్!" చెప్పక తప్పలేదు గౌతమ్‌కి.

"ఎవరు పెట్టేరు అతనికా పేరు?"

"వాళ్ల పేరెంట్స్ అయిఉంటారుసర్" అతి తెలివిని ప్రదర్శించబోయాడు.

"షటప్...! నేనడిగింది అతని నిక్‌నేమ్ గురించి"

"ఏమో సర్...ఎవరు పెట్టారో తెలీదుగాని, మొత్తానికి అందరం అతణ్ణి అలాగే పిలు స్తూంటాం" జంకుతూనే చెప్పాడు గౌతమ్.

నోరు జారటమే తప్పు. జారేక లాక్కోలేకా పీక్కోలేకా చావాల్సిందే మరి!

"నాన్సెన్స్... మీరంతా ఆఫీస్‌కొస్తోంది పన్జే యడానికా, ఒకరికొకరు నిక్‌నేమ్స్ పెట్టుకుని అఘోరించడానికా?" అని మొత్తానికి ఏ కళ నున్నాడోగాని ఇంకా సాగదియ్యకుండా "స ర్లే...నువ్వెళ్లి అతన్ని పంపించు" అనేశాడు మేనేజరు.

"యస్ సర్" అంటూ బుద్ధిమంతుడిలా తలూపి అక్కడి నుంచి బైటపడ్డాడు గౌతమ్.

"మేనేజర్‌గారు మిమ్మల్ని రమ్మంటున్నా రు" అన్న గౌతమ్‌కేసి అదోలా చూశాడు పావన మూర్తి- "ఏదన్నా ఎక్కించి వచ్చావా?" అనే సందేహాన్ని కళ్లతో తొణికిసలాడిస్తూ.

ఆంధ్రదేశంలోని ఏ ఆఫీసులోనైనా ఒకడు ఆఫీసర్ ఛాంబర్‌లోంచి బైటికొచ్చి నీకు పిలు పని మరొకడితో చెబితే, ఆ పిలవబడ్డవాడు ఆ చెప్పిన వాడికేసి అలాగే చూస్తాడు. అది అత్యంత సహజం.

లోపలికెళ్లి 'గోవిందరాజులు అండ్ సన్స్' కన్‌సైన్‌మెంట్ విషయంలో మేనేజరుతో తల వాచేలా చీవాట్లు తిన్న పావనమూర్తికి మనసు ఏదోలా అయిపోయింది. గౌతమ్ మీద ఏమేం ఎక్కించాడోగానీ, ఓ పది నిముషాలు గడిచే సరికల్లా గౌతమ్‌కి లోపల్నుండి మళ్లీ పిలుపొ చ్చింది.

కాస్త భయపడ్తూనే లోపలికెళ్ళిన గౌతమ్‌ని చూసి ఎగిరి పడ్డాడు మేనేజరు. "వాట్ మి స్టర్? ఈ ఆఫీసులో అందరికీ నిక్‌నేమ్స్ పె ట్టిందీ, పెడుతున్నదీ నువ్వేనటగా? నువ్వొ స్తోంది ఉద్యోగం చెయ్యడానికా లేక స్టాఫ్‌కి తాటాకులు కట్టడానికా?" అంటూ మెత్తమె త్తగా ప్రారంభించి క్రమంగా స్థాయిని పెంచు తూ గట్టిగట్టిగా మందలించి పంపాడు మేనేజ రు. ఆ బిల్డింగ్ కట్టడానికి ఉపయోగించిన సిమెంట్ బహుశా చాలా మేలురకం అయ్యుంటుంది. అందుకే ఆయన అరిచిన అరుపులకది కూలిపోలేదు.

ఆ సాయంత్రం బస్టాప్‌లో కలిసిన గౌత మ్‌ని "అదేంటంత డల్‌గా వున్నావ్? ఆఫీ సులో ఏదన్నా గొడవగాని జరిగిందా?" అనడి గాడు సుబ్బారావ్!

అతనికి క్లుప్తంగా విషయం వివరించాడు గౌతమ్.

"చూశావా మరి? నీ ఈ స్వభావం మార్చు కోరా అంటే నా మాట వినవ్. నీకా స్వభావం వుండటం వల్లే కదా, మీ కొలీగ్స్ అందరికీ నిక్‌నేమ్ పెట్టి ఇవ్వాళ మీ మేనేజర్‌తో తిట్లు తినాల్సొచ్చింది?" అంటూ సుబ్బారావ్ యధా విధిగా హితోపదేశం ప్రారంభించబోయాడు.





"చాల్లే ఆపు నస!" అని గసిరేసి ముఖాన్ని ప్రక్కకి తిప్పుకున్నాడు గౌతమ్.

అసలే కాకమీదున్నాడు ఇంకా రెచ్చగొట్టడం దేనికిలే అని వూరుకుండి పోయాడు సుబ్బారావ్.

గౌతమ్‌లో సుబ్బారావ్‌కి నచ్చని అంశం అదొక్కటే... ఆ టీజింగ్ నేచర్! అతన్ని మార్చడానికి ఇతను చేయని ప్రయత్నమంటూ లేదు. కానీ-

పుట్టుకతో వచ్చిన బుద్ధి పుడకలతో గాని పోదన్నది జగద్విదితమే కదా?!

★ ★ ★

"రా డుంబూ, రా!" గుత్తొంకాయ కూర కోసం వంకాయల్లో మసాలా దట్టిస్తుండగా వచ్చిన డుంబూని ఆహ్వానించాడుసుబ్బారావ్.

డుంబూ అతని పక్కనే నేలమీద బాసింపట్టు వేసుక్కూర్చుంటూ అడిగాడు-

"అదేంటంకుల్ వంట రోజూ మీరే చేస్తారేం? గౌతం అంకుల్‌కి వంట చెయ్యటం రాదా?"

స్నేహితుడు చేతులు కాల్చుకుంటుంటే దర్జాగా కుర్చీలో కూర్చుని ఏదో వీక్లీ తిరగేస్తున్న గౌతమ్‌కి ఎక్కడో గిల్లినట్టనిపించింది ఆ పసికుంక మాటలకి. నీకెందురా బోడిగా? మా తిప్పలేవో మేం పడతాం! ఫో ఇక్కడ్నుంచి, అనాలని కూడా అనిపించింది. కానీ పోన్లే పసికుంక అని వూరుకున్నాడు.

అవును మరి... ఎప్పుడో తప్ప, ఇంచుమించు ప్రతిరోజు సుబ్బారావే వాళ్ళిద్దరికీ వంట చేస్తాడు. పేరుకి గిన్నెలు అంట్లు తోమే డ్యూటీ గౌతమ్‌దన్నమాటేగాని పాపం సుబ్బారావ్ వీలుసుబట్టి దాన్ని కూడా షేర్ చేస్కుంటూ వుంటాడు. అలాంటిది అతన్నిప్పుడే పసికుంక ఇలా రెచ్చగొడితే- కొంపదీసి అతగాడి మనసు మారిపోయి ఇకనుంచి వంట డ్యూటీలో కూడా సగం నువ్వు షేర్ చేస్కోవాల్సిందే అంటే అప్పుడు మునిగేది ఎవరి కొంప? గౌతమ్‌కి అసలే బద్ధకం జాస్తి.

"చెప్పరేంఅంకుల్? ఆ అంకుల్‌కి వంట రాదా?" తన ప్రశ్నకి బదులివ్వని సుబ్బారావ్‌ని రెట్టించాడు డుంబూ.

సుబ్బారావ్ వాడి బుగ్గలు పుణుకుతూ అన్నాడు-

"ఆ అంకుల్ చేస్తే మీ ప్రప్పీ కూడా తినదు. అంత దరిద్రంగా వండుతాడు ఆ సన్యాసి"

"యాక్ థూ!" అన్నాడు డుంబూ వికారంగా ముఖం పెట్టి.

గౌతమ్ ఇక వూరుకోలేక పోయాడు. "రేయ్ నీకేం పనీపాటా లేదా ఎప్పుడు మా గదిలో తగలడ్తావ్? పో ఇక్కడ్నించి" అనరిచాడు వాడికేసి కోపంగా చూస్తూ.

"ఈ హౌసోనర్ కొడుకునైన నన్ను పట్టుకుని ఇంతిన్సల్ట్ చేస్తావా? చూడు నిన్నేం చేస్తానో?" అని పైకయితే అనలేదుగానీ అంత తీక్షణంగానే చూసి అక్కడ్నించి లేచి వెళ్ళిపోయాడు డుంబూ.

"ఎందుకురా పాపం వాణ్ణలా గసిరి పంపించేశావ్?" నొచ్చుకోలుగా అన్నాడు సుబ్బారావ్.

"వేలెడంత లేడు గాని వెధవకి అన్నీ ఆరాలు కావాలి. నాకు వంటొస్తే వాడికేమిటంట, రాకపోతే వాడికేమిటంట?!" నుదురు చిట్లిస్తూ కోపంగా ముఖం పెట్టాడు గౌతమ్.

"నువ్వు దుర్వాసుడివని తెలీక ఏదో అడిగాళ్ళేరా!" నవ్వేస్తూ అన్నాడు సుబ్బారావ్.

"హుఁ... నువ్వే అనాలి నన్ను దుర్వాసుడని!"

"దుర్వాసుడివిగాక శాంతమూర్తివా? అద్దంలో నీ ముఖం చూడు"అంటూ ఉత్తుత్తికే కయ్యానికి కాలు దువ్వబోయాడు సుబ్బారావ్.

అడపాదడపా అలా శత్రువుల్లా మాట్లాడుకోవడం, ఒకసారి పోట్లాడేసుకోవడం వాళ్ళకొక హాబీలాంటిది.

"నా ముఖానికేం?" అంటూ ఇంకా ఏదో అనబోయాడు గౌతమ్. కానీ అంతలో డుంబూ పునఃప్రవేశించటంతో ఆగిపోయాడు.

"అంకుల్స్! మీ ఇద్దర్నీ రమ్మంటున్నారు మా డాడీ!" అంటూ నడుంమీద చేతులు వేసుకున్నాడు డుంబూ.

వాడి వాలకమూ అదీ చూస్తుంటే మిత్రులిద్దరికీ డౌట్ వొచ్చేసింది, 'కొంపదీసి ఈ నాగన్న ఏదన్నా చాడీగాని చెప్పేడేమో'నని.

"ఎందుకూ?" అడిగాడు సుబ్బారావ్.

"ఏమో నాకేం తెలుసు? మిమ్మల్ని పిలుచుకు రమ్మన్నారంతే!" అనేసి రాకెట్‌లా బైటికి దూసుకెళ్ళిపోయాడు డుంబూ.

"ఏరా ఆకతాయి వెధవా, నేను లేనప్పుడు వాణ్ణిగాని ఏదైనా చేశావా?" గౌతమ్‌కేసి అనుమానంగా చూశాడు.

లేదన్నట్టు పెదవి విరిచి అడ్డంగా తలాడించాడు గౌతమ్.

"మరైతే మన ఓనరుగారి పిలుపుకి కారణం ఏమైవుండునో?"

"ఏమో... వెళ్దాం పద!"

వీళ్ళిద్దరూ వెళ్ళేసరికి డుంబూ వాళ్ళ ఫాదర్ శ్రీరామమూర్తి హాల్లో అటూఇటూ పచార్లు చేస్తూ వున్నాడు.

"నమస్తే సర్" అన్నారు మిత్రద్వయం కోరస్‌గా.

"ఆఁ...ఆఁ... నమస్తే! రండ్రండి" నవ్వుతూ ఇన్వైట్ చేశాడు శ్రీరామమూర్తి.

ఆ నవ్వుచూసి 'థాంక్‌గాడ్! కొంపేం మునగలేదన్నమాట!' అనుకున్న సుబ్బారావ్, "ఏంటి సర్ పిలిచారట?" అన్నాడు వెళ్ళి సోఫాలో కూర్చుంటూ. అతనితోపాటు ఆ పక్కనే గౌతమ్ కూడా కూర్చున్నాడు.

"పావనీ! సుబ్బారావ్ గౌతమ్‌లొచ్చారు... మూడు కాఫీ!" అన్నాడు శ్రీరామ్మూర్తి వంటింట్లో వున్న భార్యనుద్దేశించి.

"ఆఁ...ఆఁ..." అని లోపల్నుండి బదులు వినిపించింది.

"అరెఁ... ఇప్పుడు కాఫీలూ గట్రా దేనికి సార్, భోజనాల టైము" వారింపుగా అన్నాడు సుబ్బారావ్.

శ్రీరామ్మూర్తి నవ్వేస్తూ- "కాఫీలే... గట్రాలేం లేవులే" అని, "మీతో ఒక ముఖ్యమైన విషయం మాట్లాడాలి! తీరు బాటుగానే వున్నారుగా?" అనడిగాడు.

"తీరుబాటుగాక ఇప్పుడు పన్లేముంటాయ్ సర్" అన్నాడు సుబ్బారావ్, రాత్రి ఎనిమిదింబావుకి ఎవ్వరైనా సరే చచ్చినట్టు తీరుబాటుగా వుండి తీరాలని ఎక్కడో ఏదో రూలున్నట్టు.

"వంటా గట్రా...?"

"ఆ అయ్యింది సార్! చేసేస్కున్నాం! ఇహ వెళ్ళి తినడమే తరువాయి" అన్నాడు గౌతమ్ పెద్ద పాటుపడి పోయినవాడిలా.

"ఉత్తిదే డాడీ! ఆ అంకుల్ అసలు వొండనే వొండడు. ఎప్పుడు చూసినా ఈ అంకులే వొండుతాడు"- నేనూ వున్నాను సుమా అన్నట్టు మాటల్లో తలదూర్చాడు అక్కడే ఏదో ఆడుకుంటూ వున్న డుంబూ.

"మా తిండి కార్యక్రమంమీద పట్టించావేంట్రా నువ్వు?" అనుకున్నాడు గౌతమ్ మనసులో.

"ఏం గౌతమ్ నీకు వంటరాదా?" శ్రీరామ్మూర్తి అడిగాడు.

"వచ్చుగాని అంతబాగా రాదు సార్!"

"అవును డాడీ! ఆ అంకుల్ వొండితే మన పప్పీ కూడా తినదట" చేతుల్తిప్పుతూ చెప్పాడు డుంబూ. వాడి వయసు చిన్నదన్నమాటే గాని మాటలు చాలా స్పష్టంగా మాట్లాడుతాడు.

"ఎవరు చెప్పేర్రా భడవా నీకు?" కొడుక్కేసి మురిపెంగా చూస్తూ నవ్వాడు శ్రీరామ్మూర్తి.

"నిజం సార్! నేనే చెప్పేను. నిజంగానే వాడి వంటఅంత ఛండాలం!" అని నవ్వేసి- "ఇంతకీ మీరు పిల్చిన సంగతి..." అంటూ నీళ్ళు నమిలాడు సుబ్బారావ్.

"మరేం లేదోయ్! మీ ఇద్దరి స్నేహం చూస్తుంటే నాకు చాలా ముచ్చటేస్తూంటుంది!"

"అయితే?" అన్నట్టు సంయుక్తంగా కళ్ళెగరేశారు మిత్రద్వయం.

"ఆనందరావుగారని మా పావనివాళ్ళ బంధువొకాయనున్నాడు"

"ఉంటే?" అనడిగినట్టుగా రవంత ముందుకొంగారు మిత్రద్వయం.

"మీరిద్దరూ ఒకర్ని విడిచి ఒకరు వుండలేనంత ప్రాణస్నేహితులు కదా! ఆ ఆనందరావ్ గారిక్కూడా ఒకర్ని విడిచి ఒకరుండలేనటువంటి ఇద్దరు కూతుళ్ళున్నారు. కవల పిల్లలు. ఇద్దరూ ఒకేలా వుంటారు. రూపంలోగానీ గు




ణంలోగాని వంక పెట్టడానికి ఆస్కారమే లేదు. మీరిద్దరూ ఆ అక్కచెల్లెళ్ళని చేసుకుంటే మీ జంటలు చూడ ముచ్చటగా వుండటమే కాదు... మీ స్నేహం కలకాలం ఇలా చెక్కుచెదరకుండా వుంటుంది. ఈమధ్యే ఏదో వీక్లీలో చదివాను- మీలాంటి వాళ్ళే ఇద్దరు వేరేవేరే అమ్మాయిల్ని పెళ్ళాడితే తమ స్నేహం ఎక్కడ చెడిపోతుందోనన్న భయంతో ఇద్దరూ కలిసి ఒకే అమ్మాయిని పెళ్ళిచేసుకున్నారట!... మిమ్మల్ని మరీ అంత పనిచేయమనటం లేదులేగాని... ఆ సిస్టర్స్ ఇద్దర్నీ చేసుకుంటే...''

''హాఛ్...'' తుమ్మేడు గౌతమ్. కావాలని కాదు, నిజంగా దానంతటదే వచ్చింది తుమ్ము.

''భలే ఫన్నీగా వుంది సార్ ఇది! అసలు మాకు సంబంధాలు చూడాలని మీకెందుకనిపించింది?'' నవ్వుతూ అడిగాడు సుబ్బారావ్.

''మొన్న ఆ ఆనందరావ్‌గారు కనబడి నా ఎరుకలో సంబంధాలేమైనా వుంటే చెప్పమని అడిగినప్పుడు నాకెందుకో సడన్‌గా మీరు గుర్తొచ్చారు. దాంతో ఇద్దరు బుద్ధిమంతులు మా ఇంట్లోనే వున్నారని మీ గురించి ఆయనకి చూచాయగా చెప్పాను...''

''ఇద్దరెవరుసార్ బుద్ధిమంతులు? నేనొక్కడ్నే కదా?''సుబ్బారావ్ సీరియస్‌గానే అడిగాడు.

''అవుననుకో... మీ గౌతమ్ ఒట్టి ఆకతాయి రకం అని నేనూ విన్నాను. కానీ అది బాల్యచాపల్యంలాంటిది. పెళ్లయ్యాక పోదా ఏంటి?!'' శ్రీరామ్మూర్తి కూడా సిన్సియర్‌గానే అన్నాడు.

గౌతమ్‌కి మండింది ఇద్దరి మీదా. అతను రాలుగాయే అవుగాక! ఆకతాయే అవుగాక! కానీ ఉన్నమాట ముఖంమీదే అంటే మండదా మరి?

ఎంతయినా శ్రీరామ్మూర్తిగారు హౌసోనరు కాబట్టి, ఆయనమీద మండిపడ్డం బావుండదు కాబట్టి, మండిపడకుండా ముఖం మాడ్చుకున్నాడు గౌతమ్.

బ్రహ్మచారులకి సిటీలో ఇల్లు అద్దెకి దొరికిందీ అంటే ఆ హౌసోనర్ దేవుడిక్రిందే లెక్క! చూస్తూచూస్తూ దేవుడిమీద మండిపడటం ఎవరితరం?

మాడిపోయిన మిత్రుడి ముఖాన్ని గమనించి కూడా గమనించనట్టే అన్నాడు సుబ్బారావ్, శ్రీరామ్మూర్తితో-

''మీరు పొరబడుతున్నారు సార్! వీడు మీరనుకుంటున్నట్టు ఉత్తుత్తి ఆకతాయి వెధవ కాదు. రౌడీ రాస్కెల్! వీణ్ణి మార్చటం వీణ్ణి పుట్టించిన ఆ బ్రహ్మతరం కూడా కాదు...''

''ఉత్తిదే నమ్మకండి సార్! పైకలా కనిపిస్తాడేగాని వాడు నాకన్నా రౌడీ రాస్కెల్!'' గౌతమ్ ఉక్రోషంగా అన్నాడు.

శ్రీరామ్మూర్తి నవ్వేస్తూ- ''మీరిద్దరూ ఎలాంటివాళ్ళో నాకు తెలీదా ఏమిటి గానీ, అసలు సంగతి చెప్పండి! మీకు ఇష్టమైతే నేను మీ పెద్దల్తోనూ ఆనందరావ్‌గార్తోనూ మాట్లాడ్తాను'' అని మిత్రద్వయాన్ని మళ్ళీ లైన్‌లోకి లాగాడు.

''సారీ సర్'' ముఖాన్ని రవంత ఇబ్బందిగా పెట్టి చెప్పాడు సుబ్బారావ్. ''ఈ విషయంలో మీరు నన్ను మన్నించాలి. నా పెళ్ళి మా మేనత్తకూతురితో దాదాపు డిసైడ్ అయిపోయింది. కాబట్టి నేను చేయగలిగిందేమీ లేదు. అంతగా కావాలంటే వాళ్ళిద్దర్లో ఒకర్ని మా గౌతమ్‌గాడికి అంటగట్టండి!''

శ్రీరామ్మూర్తికి చురుక్కుమనిపించింది ఆ మాట-

''అంటగట్టడం ఏమిటోయ్? వాళ్ళేమయినా నాసిరకం అమ్మాయిలనుకుంటున్నావా అంటగట్టడానికి? ఇద్దరికిద్దరూ పుత్తడిబొమ్మలు! ఏదో మీరిద్దరూ బుద్ధిమంతులు కదాని ఈ ప్రపోజల్ చేశానే తప్ప, ఆ అమ్మాయిలకి మీ కన్నా మంచి సంబంధాలు దొరకవని కాదు'' అన్నాడు ముఖాన్ని గంటుపెట్టుకుంటూ.

అనాలోచితంగా తానెంత పొరపాటు మాట అనేశాడో అప్పుడుగాని అర్థంకాలేదు సుబ్బారావ్‌కి. ''సారీ సర్! నా ఉద్దేశం అది కాదు. ఏదో నోరు జారి అలా వచ్చేసింది'' అన్నాడు తత్తరపడుతూ.

ఆ సిట్యుయేషన్ గౌతమ్‌కి కూడా ఇబ్బందిగా అనిపించింది.

''సరేలే! నీకు మ్యారేజ్ డిసైడ్ అయిపోయిందని నాకేం తెలుసు? ఊఁ... ఇంతకీ

మాకు పప్పన్నం ఎప్పుడూ?'' శ్రీరామ్మూర్తి పరిస్థితినర్థంచేసుకుని శాంతిస్తూ అన్నాడు.

''చిన్నప్పట్నుంచీ అనుకుంటున్న సంబంధమే సార్! కానీ పెళ్ళి మాత్రం ఇప్పుడప్పుడే కాదు. తనింకా బియ్యే ఫస్టియర్‌లో వుంది- చదువు పూర్తయ్యాక'' అన్నాడు బిడియంగా సుబ్బారావ్.

''మరి నీ సంగతేమిటోయ్? నీకూ ఏదన్నా సంబంధం రెడీగా వుందా?'' శ్రీరామ్మూర్తి గౌతమ్‌నడిగాడు.

''అబ్బే లేస్సార్! కానీ ఇప్పుడప్పుడే పెళ్ళి చేసుకునే ఉద్దేశం లేదు నాకు'' అన్నాడు గౌతమ్.

'ఇంకా చిన్న కూచిననుకుంటున్నాడు కాబోలు' లోలోన పళ్ళు నూరుకుంటూ అనుకొంది, ట్రేలో కాఫీ కప్పుల్తో అప్పుడే ఆ గదిలో కాలుపెట్టిన పావని. వంటింట్లోంచి ఓ చెవినిటు పారేసి అప్పటికే వాళ్ళ సంభాషణంతా ఆలకించేసిందామె. అసలు ఆనందరావ్‌గారి కూతుళ్ళ విషయం వాళ్లదగ్గర కదపమని భర్తని ఫోర్స్‌చేసింది ఆవిడే!

ముగ్గురికీ కాఫీ కప్పులందించి- 'ఇంతోటి సంబడానికి కాఫీలొకటి దండుగ' అనుకుంటూ లోపలికెళ్ళిపోయిందామె.

''ఈ నన్నానుల్నేత ఇల్లు ఖాళీ చేయించేయాలి!'' అనే దుర్నిర్ణయానికి సరిగ్గా ఆ క్షణంలోనే ఆమె మనసులో బీజంపడింది! పడదా మరి? ఆనందరావ్ చాలా కావాల్సినవాడు. దగ్గరి బంధువు.

★ ★ ★

నిద్రకుపక్రమించేముందు బోర్నవిటా తాగి పడుకోవటం మిత్రద్వయానికి అలవాటు.

ఆ రాత్రి దర్జాగా మంచమెక్కి కూర్చున్న గౌతమ్‌కి బోర్నవిటా గ్లాసందిస్తూ సడన్‌గా ఏదో గుర్తుకొచ్చినవాడిలా తల విదిలిస్తూ అడిగాడు సుబ్బారావ్.

''అవునొరేయ్ ఇందాక శ్రీరామ్మూర్తిగారితో నీకిప్పుడప్పుడే పెళ్ళి చేస్కునే ఉద్దేశం లేదని చెప్పావ్ కదా, ఒకవేళ ఆయన కారణమడిగితే ఏం చెప్పుండేవాడివి?''

''ఏముందీ వున్న విషయమే చెప్పేవాణ్ణి...''

''ఏమిటున్న విషయం?''

''అదేరా... ఆమధ్య నీకొకరోజు చెప్పలా? అదే... బుచ్చెమ్మగారి నవల్లోని హీరోయిన్ సంగతి...''

గతంలో ఒకసారి గౌతమ్ బుచ్చెమ్మగారి నవలేదో చదివి అందులోని హీరోయిన్ పాత్ర తన్నెంతో ఆకర్షించిందంటూ సదరు హీరోయిన్‌ని రచయిత్రి ఎలా వర్ణించిందో చెప్పి- ''అందచందాల్లోనూ, గుణగణాల్లోనూ అచ్చం అలా వుండే అమ్మాయి దొరికితే తప్ప నేను పెళ్ళి చేసుకోన్రా'' అన్నాడు సుబ్బారావ్‌తో.

ఏదో తమాషాకంటున్నాళ్ళే అనుకున్నాడు సుబ్బారావ్ ఆరోజు. కానీ మిత్రుడిపుడు మళ్ళీ ఆ విషయాల్ని గుర్తుచేయడంతో అతనొకింత డైలమాలో పడ్డాడు- 'కొంపదీసి ఈ పిచ్చిన్నాసి నిజంగానే అలాంటి స్థిరనిర్ణయాని కొచ్చేశాడా, ఏంటి?' అని.

అమాటే అడిగాడు ''అయితే నువ్వింకా ఆ దిక్కుమాలిన హీరోయిన్‌ని మర్చిపోలేదూ? నిజంగానే అలాంటి అమ్మాయిని చేస్కోవాలనుకుంటున్నావా?''

''నోర్ముయ్! ఆ నవల చదివేద్వాని నీకు ఆమెను దిక్కుమాలిన హీరోయిన్ అనే హక్కెక్కడేడ్చింది? చదివుంటే అంతమాట అనగలిగేవాడివేకాదు! ఓహ్... అందమంటే అలా వుండాలిరా! మనిషంటే అలా వుండాలి...'' చిరుకోపంలోంచి పారవశ్యంలోకి జారిపోతూ కళ్ళని సగంసగంగా మూశాడు గౌతమ్.

''ఛీ ఊర్కో... రచయితలకీ, రచయిత్రులకీ పనీపాటా ఏంవుండదు కాబట్టి ఏదేదో రాసి పారేస్తుంటారు. మన నవల్లోని హీరోహీరోయిన్లు నిజజీవితంలో కూడా వుంటారనుకుంటున్నావా? ఇంపాజిబుల్! రచయితలూ రచయిత్రులూ ఊహలోకాల్లో విహరిస్తుంటారు కాబట్టి వాళ్ళు సృష్టించే పాత్రలు కూడా ఊహామూర్తులే అయిఉంటాయ్...''

''కానీ బుచ్చెమ్మ అలాంటి రచయిత్రికాదు. ఆమె రచనలన్నీ సహజత్వానికి చాలా దగ్గరగా వుంటాయ్! ఆమె సృష్టించే పాత్రలన్నీ నిజజీవితంలో ఎక్కడో ఒకచోట మనకు తారసిల్లుతూనే వుంటాయ్'' సుబ్బారావ్ మాటల్ని ఖండిస్తూ అన్నాడు గౌతమ్.





''పైత్యం బాగానే ప్రకోపించినట్టుందే?! లేక పోతే ఏంట్రా? అలాంటి అమ్మాయిని పట్టుకుని ప్రేమించిగాని పెళ్ళి చేస్కోనంటావ్- అంతేనా?''

''అబ్బే ప్రేమించాలని రూలేంలేదు. అరేంజ్డ్ మ్యారేజ్ అయినా ఫర్వాలేదు. ఐమీన్ మా పెద్దలు ఏర్పాటుచేసిన పెళ్ళిచూపుల్లో అచ్చం అలాంటి అమ్మాయే ఎదురయ్యిందనుకో... అప్పుడు నేనామెని నిరభ్యంతరంగా పెళ్లాడేస్తానన్నమాట''

''నీ మొహం'' అన్నాడు సుబ్బారావు వెటకారంగా.

''నీ తలకాయ'' అన్నాడు గౌతమ్.

అంతలో 'ఇంక ముయ్యిండేహే నోళ్లు' అన్నట్టుగా గోడనున్న బీసీనాటి ముసలి గడియారం (అది సుబ్బారావుది. తన తాతయ్యగారి జ్ఞాపకార్థం దాన్నతను తెచ్చుకుని ఈ గదిలో తగిలించుకున్నాడు) 'ఠంగ్ ఠంగ్ ఠంగ్'మంటూ పదకొండుగంటలు కొట్టింది.

దాంతో మిత్రులిద్దరూ సైలెంటైపోయారు.



గౌతమ్ ముఖం సోడియంపేపర్ లైట్‌లా మెరిసిపోతుండటాన్ని గమనించి కుతూహలంగా అడిగాడు సుబ్బారావ్.

''ఏంట్రా చాలా ఉత్సాహంగా వున్నట్టున్నావ్? ఈరోజు నీ ధాష్టీకానికి ఏ అభాగ్యుడైనా ఎదురులేకుండా బలైపోయాడా ఏంటి?''

గౌతమ్ ఏరోజైనా ఎవరికైనా బాగా టాటాకులు కట్టగలిగిననాడు (అంటే టీజ్‌చేసి ఏడిపించిన నాడు) ఆ రోజంతా మహదానందపడిపోతూ వుంటాడు. అదతని వీక్‌నెస్. ఆ విషయాన్ని బాగా ఎరిగున్నవాడు కావడంవల్లే సుబ్బారావ్ అలా అడిగాడు.

గౌతమ్ ముసిముసి నవ్వు నవ్వి- ''ఊహుఁ'' అంటూ అడ్డంగా తలాడించాడు.

''మరైతే నీ సంతోషానికి కారణం?''

''ఈరోజు మహా సుదినంరా'' అన్నాడు గౌతమ్, ఏదో యూనివర్సల్ ట్రూత్ చెబుతున్నట్టు 'మహాసుదినం' అనే పదాన్ని బాగా ఒత్తివలుకుతూ.

''ఎందుకని? ఏదన్నా కారణంవల్ల మీ మేనేజర్ నిన్నుగాని మహా మెచ్చేసుకున్నాడా?''

''ఆ రోగ్‌గాడు సబార్డినేట్స్‌ని మెచ్చుకోవడం కూడానా? అది కాదది కాదు...''

''మరి?''

''ఇంటికెళ్లాక తీరుబాటుగా చెప్తాలే, అదిగో మన బస్సే వస్తున్నట్టుంది'' అంటూ అసలు విషయాన్ని దాటేశాడు గౌతమ్.

'బోడి సస్పెన్సు' అని మనసులో గొణుక్కున్నా ఆ వచ్చింది నిజంగా వాళ్ల బస్సే కాబట్టి తాత్కాలికంగా అప్పటికి కుతూహలాన్ని అణుచుకోక తప్పలేదు సుబ్బారావ్‌కి.

ఇంట్లో కాలు పెట్టూనే మిత్రుణ్ణి భుజాలు పట్టుక్కుదిపేస్తూ అడిగాడు సుబ్బారావ్.

''ఆఁ... ఇప్పుడు చెప్పు. ఏదో విశేషం వుండకపోతే నువ్ ఇంత సంతోషంగా వుండవ్. నీ సంతోషానికి కారణం?''

''ఆకలి దంచేస్తోంది. ముందు వంటప్రయత్నం మొదలెట్టు...'' సుబ్బారావ్‌ని ఏడిపించడానికి మంచానికి అడ్డంగా ఒరుగుతూ అన్నాడు గౌతమ్.

''ఈడ్చితంతే వెళ్లి బే ఆఫ్ బెంగాల్‌లో పడ్తావ్. లే... లేచి అసలు సంగతి చెప్పు'' కొట్టేసేవాడిలా చెయ్యెత్తుతూ అన్నాడు సుబ్బారావ్.

''కడుంగడు కుతూహలంతో వున్నట్టున్నావ్. సరే చెప్తారా'' అంటూ మిత్రుణ్ణి చేరబిలిచి ముఖంనిండా సంబరాన్ని నింపుకుంటూ చెప్పాడు గౌతమ్- ''ఈరోజు మహాసుదినం''

''తంతా ఆ దిక్కుమాలిన పదాన్నిగాని వాడేవంటే. వెధవ్వూరింపు చాలించి అస

ల్సంగతేమిటో చెప్పేడువ్..'' గయ్‌మంటూ లేచాడు సుబ్బారావ్.

తన్నుకు చచ్చేవాళ్ళలా ఆ తీరున మాట్లాడు కోకపోతే వాళ్ళకసలు మాట్లాడుకున్నట్టే అని పించదు. అది వాళ్ళిద్దరి ఉమ్మడి వీక్నెస్.

''సరేలే అయితే చెబుతాగానీ శ్రద్ధగా అల కించు'' అని ప్రారంభించి ముఖంలోని సంబ రాన్ని ద్విగుణీకృతం చేసేస్కుని అసలు విష యంలోకి వెళ్లాడు గౌతమ్- ''మరేం లేదురా! ఇవ్వాళ్ళ మా ఆఫీసులో అనూహ్య అనే అమ్మాయి కొత్తగా టైపిస్ట్‌గా జాయినయ్యింది! అబ్బ... ఎంతందంగా వుందనుకున్నావ్?''

ఏదో మహావిశేషం వుండుంటుందనుకున్న సుబ్బారావ్, మిత్రుడు చెప్పినదాన్లో అంతగా ఇదైపోవాల్సింది ఏమీ లేకపోవడం చేత ''ఓస్ ఇంతేనా?'' అనేశాడు తేలిగ్గా.

గౌతమ్ ముఖం రవ్వంత చిన్నపోయింది- ''అంత తేలిగ్గా కొట్టెయ్యకు. నువ్వామెని చూళ్లే దు కాబట్టి అలా అనగలుగుతున్నావ్. చూస్తే మతిపోతుంది నీకు... అబ్బ... ఏమందమే మందం. ఆ అందాన్ని చూడ్డానికి ఒళ్లంతా కళ్లున్నా సరిపోవు?'' అన్నాడు చిన్నబోయిన ముఖంలోనే కొండంత పారవశ్యాన్ని జొప్పించే సుకుంటూ.

''అయితే ఏమిటంట?'' అన్నట్టుగా కళ్లెగరే శాడు సుబ్బారావ్.

''అంతటి అపురూప సౌందర్యరాశి మా ఆఫీసులో కాలుపెట్టినందుకు నిజంగా మా ఆఫీసు యావత్తూ పునీతమైపోయిందేమో అనిపించింది నాకు. జోక్కాదు నవ్వకు. నిజంగా ఆమె స్టన్నింగ్ బ్యూటీ. అదేగాక ఆమె సీటు కూడా సరిగ్గా నా ఎదుటి సీటే! అంటే నేను తల పైకెత్తితే ఇకనుంచి నాక్కని పించేది ఆమె ముఖమే అన్నమాట. సారీ ముఖం కాదు, ముఖపద్మం అనాలి. నిజంగా నాకు చాలా చాలా ఆనందంగా వుందిరా''

గౌతమ్ మాటలు పైత్యభరితంగా వున్నా కంఠంలో సిన్సియారిటీకి కొదువ లేకపోవడా న్ని స్పష్టంగా గుర్తించి ఆశ్చర్యపోయాడు సు బ్బారావ్. 'కొంపదీసి ఆ అన్నులమిన్న వీడి గుండెని గుల్లగాని చేసేయలేదుగదా?' అని కించిత్ భయం కూడా పడ్డాడు.

''నీ వాలకం చూస్తుంటే తొలిచూపు ప్రే మంటారే, అలాంటిదే జరిగిపోయిందని అను మానంగా వుంది. యామై కరెక్ట్?''

''యూ ఆర్ ఎగ్జాక్టిలీ కరెక్ట్! నువ్వన్నది నూటికినూరుపాళ్లు నిజం. అయ్ లవ్ హర్. నేనామెని ప్రేమిస్తున్నాను'' ఆంగ్లాంధ్రభాషల్లో చెప్పాడు గౌతమ్.

'ఒక్కపూటలోనే వీడికింత తిక్క ఎక్కించే సిన ఆ అమ్మాయి సౌందర్యం ఎంత గొప్పదో కదా?' అని అనుకోకుండా వుండలేకపోయాడు సుబ్బారావ్.

''అయితే ప్రేమలో పడ్డావన్నమాట. కంగ్రా ట్స్...! అద్సరే బుచ్చెమ్మగారి నవల్లోని హీరో యిన్ క్వాలిటీస్ అన్నీ ఆ అమ్మాయిలో వున్నాయో లేవో...? ఆలోచించావా?''

''బుచ్చెమ్మా లేదు, పిచ్చమ్మా లేదు. అనూ హ్యలాంటి అద్భుత సౌందర్యరాశి అందాన్ని వర్ణించేటంత శక్తి ఆవిడ కలానికెక్కడే డ్చిందిరా? అనూహ్య, ద పారగాన్ ఆఫ్ బ్యూటీ. షి ఈజ్ హండ్రెడ్ టైమ్స్ బెటర్ దాన్ దట్ బ్లడీ బుచ్చెమ్మాస్ హీరోయిన్...''

'వాట్వాట్వాట్?' అనుకుంటూ ఆశ్చర్యంగా బుగ్గలు నొక్కుకున్నాడు సుబ్బారావ్.

ఔరా ప్రేమ ఎంత విచిత్రమైనది? తన అభిమాన రచయిత్రిని తీసి తుంగలో తొక్కే టంతగా ఒక్కరోజులో వీణ్ణి ఎలా మార్చిపారే సింది?

ఆఫ్టరాల్ బుచ్చెమ్మట... హవ్వ! అనుకుని సుబ్బారావ్ ఆశ్చర్యపోతుంటే- ''అవున్రా... వందేం ఖర్మా అధమపక్షం వెయ్యి రెట్లయినా గొప్పది నా అనూహ్య ఆ బుచ్చెమ్మ హీరోయిన్ కంటే'' అన్నాడు గర్వంగా గౌతమ్.

''నీ అనూహ్య?''

''వై నాట్? నేను ప్రేమిస్తున్నప్పుడు ఆమె నా దవ్వదేంటి?''

''ఏడ్చావ్... నువ్ ప్రేమించగానే సరిపో యిందా? ఆమె కూడా నిన్ను ప్రేమించాలిగా? అదీగాక ఈ సోకాల్డ్ 'లవ్ ఎట్ ఫస్ట్ సైట్' అనేది కేవలం బాహ్యసౌందర్యానికి సంబంధించిన వ్యామోహమే తప్ప నిజంగా




ప్రేమ కాదు. కాబోదు కూడా. ఆమె పాప్యులర్ అందగత్తె అయితే కావచ్చుగాని బుచ్చెమ్మగారి ప్రఖ్యాత హీరోయిన్‌కున్న గుణగణాలు...'' అంటూ ఇంకా ఏదో చెప్పబోతున్న సుబ్బారావ్ మీదకి తాడెక్కిన లేచాడు గౌతమ్-

''ఆపు నీ దరిద్రగొట్టు వాగుడు. శుభం పలకరా అంటే వెనకటికి నీలాంటివాడే ఇలాగే అన్నాట్ట. శుభమా అంటూ నేనేదో ప్రేమలో పడితే 'ఆమె నిన్ను ప్రేమించలేకపోతేనో?' అంటూ కుశ్శంకలు చెప్తావా కుశ్శంకలు. నీ నోట్లో బొద్దింకల్దూరా! ప్రేమను తిరస్కరించడానికి ఆమెకేమన్నా పిచ్చనుకున్నావా? ఆమె గుణగణాల గురించి మనం ఆలోచించాల్సిన పనేలేదు. అలాంటి కుసుమకోమల సుందరాంగిని సృష్టించిన బ్రహ్మదేవుడికి బాగా తెలుసు అందానికి దగ్గ గుణగణాలు ఆమెలో నింపాలని. తద్విరుద్ధంగా చేయడానికి ఆయనేం పిచ్చివాడేం కాదు... ఆఁ...''

తెగ ఆవేశపడిపోతున్న మిత్రుడికేసి తేలగుడ్లు వేసుకుచూశాడు సుబ్బారావ్.

'ప్రేమా పిచ్చీ ఒకటేనన్నాడో సినీకవి, ఇందుకే కాబోలు, సందేహం లేదెక్కేసింది వీడికి పిచ్చిమహాబాగా' అనుకుంటూ

''సర్లేరా... నువ్విప్పుడు వీరగీర ప్రేమావేశంలో వున్నావ్. ఈ స్థితిలో నీకిపుడేం చెప్పినా తలకెక్కదులేగాని, తర్వాత మాట్లాడుకుందాం కాసేపు రిలాక్సవ్వు'' అనేసి...

కిచెన్‌లోకి వెళ్లి కత్తి చేతిలోకి తీస్కుని బీరకాయల మీద దాడి ప్రారంభించాడు.

'హమ్మయ్యా' అనుకున్న గౌతమ్ మంచంమీద దుప్పటీదిండూ సరిచేసుకుని విశ్రాంతిగా మేను వాల్చాడు. జస్ట్ అలా కళ్లు మూసుకున్నాడు.

అంతే!

మూసుకున్న అతని కళ్లముందు ఠపీమని ప్రత్యక్షమైపోయింది అనూహ్య.

''చూడనూ... నువ్ నా ప్రేమని అంగీకరించవేమోననీ అదనీ ఇదనీ ఏదేదో వాగుతున్నాడు మా సుబ్బి వెధవ'' ఫిర్యాదు చేశాడు గౌతమ్.

బదులుగా చిరునవ్వు నవ్వింది అనూహ్య.

''అలా నవ్వేసి వూర్కుంటే కుదర్దు. అలాగేం జరగదూ, జన్మజన్మలకీ నేను నీ దాన్నే అని కోటి గొంతుకలతో చెప్పు...'' బుంగమూతి పెట్టి అన్నాడు గౌతమ్.

అలాగే అన్నట్టు తలాడించింది అనూహ్య.

''థాంక్యూ అనూ... థాంక్యూ. మ్చ్... మ్చ్... మ్చ్...'' అన్నాడు గౌతమ్.

'ఎక్కేసింది వెధవకి పిచ్చి బాగా ఎక్కేసిం'దనుకున్నాడు బీరకాయ చెక్కుతీస్తూ ఆ 'మ్చ్... మ్చ్...' శబ్దాల్నాలకించిన సుబ్బారావ్.

కానీ అతను మాత్రం చేయగలిగిందేముందీ?

ప్రేమపిచ్చి అనేది ఎక్కనే కూడదు! ఎక్కిందా ఇక అది అంతే. నదిలో పడ్డవాణ్ణి రక్షించినంత ఈజీ ఏంకాదు ప్రేమలో పడ్డవాణ్ణి రక్షించడం.

ఓ గంట తర్వాత-

సుబ్బారావ్ శుభ్రంగా వండి వడ్డిస్తే ఇంచక్కా మెక్కుతూ అనూహ్య అందాన్ని మళ్లీ పొగడ్డం ప్రారంభించబోయాడు గౌతమ్.

కానీ సుబ్బారావ్ ఆదిలోనే అడ్డుకున్నాడు ''ఆ అమ్మాయి గురించి నువ్విప్పుడేం చెప్పినా నేను విన్ను. ఆమెను నాకోసారి చూపించు, అప్పుడు చెబుతాను నీ అభిప్రాయం కరెక్టో కాదో, నువ్వేసింది రైట్ స్టెప్పో రాంగ్ స్టెప్పో'' అంటూ.

''దాందేముందీ; రేపు లంచవర్లో కాస్త వీలు కల్పించుకుని నువ్వోసారి మా ఆఫీసుకి రా...'' అన్నాడు గౌతమ్.

''అలాగే... కానీ ఈలోగా మాత్రం ఆమె ప్రస్తావన నా వద్ద తేవొద్దు'' అన్నాడు సుబ్బారావ్ ఖండితంగా.

మిత్రుడి ప్రేమ విషయంలో సుబ్బారావ్ అలా హైరానా పడిపోవడానికి తగినంత కారణముంది. వాళ్లిద్దరూ ఉద్యోగార్థమై వాళ్ల సొంత ఊర్ని విడిచి హైదరాబాద్ వచ్చేముందు గౌతమ్ తల్లి రామసీత, తండ్రి జోగారావ్‌గార్లు సుబ్బారావ్‌ని చాటుగా పిల్చి ''నువ్ పక్కనే వుంటావ్‌కదా అన్న ధీమాతో వాణ్ణి అంత దూరం పంపుతున్నాం. వాడికి ఉద్యోగం లేనంత మాత్రాన గడవని పరిస్థితి కాదుగా

మాది? అసలే తుంటరి వెధవ! వాళ్లనీ వీళ్లనీ ఏడిపించబోయి ఒక్కోసారి పీకలమీదకి తెచ్చుకుంటూ వుంటాడు. వాణ్ణి పద్దాకా ఓ కంట కనిపెట్టేవుండు. ఆ దుర్బుద్ధి మానుకోమని నూరిపోస్తూ వుండు. ఇహపోతే ఇప్పటివరకూ అయితే అమ్మాయి విషయంలో వాడి బుద్ధి పెడదోవ పట్టలేదులేగాని... ఏమో ఆ వయస లాంటిది. ప్రేమా గీమా అంటూ ఏమన్నా వెర్రిమొర్రి వేషాలు వెయ్యబోతాడేమో. ఎప్పటి కప్పుడు సి.ఐ.డీ వర్క్‌చేస్తూ అలాంటిదేమైనా జరిగితే మాకు తెలియజేయి. నీదీ ఆ వయసే అయినా నీ దారివేరు. నీకంటే మీ అత్తకూతురుంది కాబట్టి నీ బుద్ధి వక్రించదు. కేవలం నిన్ను చూసే వాణ్ణి హైదరాబాద్ పంపుతున్నాం. అక్కడ వాడుచేసే తప్పొప్పులన్నిటికీ బాధ్యత నీదే సుమా'' అంటూ చాలా స్ట్రాంగ్‌గా చెప్పిపంపారు.

''నేనున్నాగా... మీరేం వర్రీ కానక్కర్లే''దంటూ ఆ వూపులో అతను వాళ్లకు అభయం ఇచ్చేశాడు.

కాబట్టిప్పుడు గౌతమ్ ఏదన్నా రాంగ్‌స్టెప్ వేస్తే రేప్పొద్దున సుబ్బారావ్ గౌతమ్ అమ్మానాన్నలకి సంజాయిషీ ఇచ్చుకోవాల్సి వుంటుందికదా? అందుకూ అతనలా 'ఇదై'పోవడం.

ఆ రాత్రి గౌతమ్ సుబ్బారావ్‌తోపాటు ఎప్పటిలా నిద్రకి ఉపక్రమించడమైతే ఉపక్రమించాడు గాని... మదిలో దూరి గిలిగింతలు రేపుతూన్న అనూహ్య రూపం అతన్నో పట్టాన నిద్ర పోనివ్వలేదు.

తియ్యతియ్యటి ఊహలు... రంగురంగుల ఆశలు... మత్తు మత్తు కోరికలు... వెచ్చవెచ్చటి నిట్టూర్పులు.

చివరికి మరి కాస్సేపట్లో కోళ్లు కూస్తాయనగా చిన్న కునుకులాంటిది మాత్రం పట్టింది గౌతమ్‌కి. ఆ కారణంగా మర్నాడు అతను నిద్ర లేచేసరికి కళ్లు జ్యోతుల్లా ఎర్రబారాయి.

★ ★ ★

సుబ్బారావ్ ఆఫీసులో తన సీట్లో కూర్చుని ఏదో ఫైల్లోని కాగితాలు అటూఇటూ తిరగేస్తున్నాడన్నమాటేగాని, అతని ధ్యాస మాత్రం పనిమీదలేదు.

ఆలోచనలన్నీ గౌతమ్ చుట్టూ తిరుగుతున్నాయి.

ఆ అనూహ్య ఎవరో ఏమిటో ఎలాంటిదో? ఆ అమ్మాయిలో ఎంత ఆకర్షణ లేకపోతే ఆ వెధవ అలా ఉక్కిరిబిక్కిరైపోతాడు? రాత్రసలు నిద్ర పోయినట్టు లేడు. కళ్లు ఉబ్బిపోయి దవడలు పీక్కుపోయి డొక్కులా తయారయ్యాడు తెల్లారేసరికల్లా. వాడిలో అంత కలవరాన్ని రేపగలిగిందీ అంటే ఆ అమ్మాయిలో తప్పకుండా ఏదో ఒక స్పెషాలిటీ వుండితీరాలి. చాలా చాలా అందగత్తె అని చెబుతున్నాడేగాని ఏమో... అందం అనేది చూసే కళ్లని బట్టి కూడా వుంటుంది. తావలచింది రంభ, తా మునిగింది గంగ అని వూరికే అనలేదు పెద్దలు. వాడి కళ్లకామె రంభలా కన్పిస్తూండొచ్చుగాని నిజానికామె రంభ కాకపోనూవచ్చు. అసలామె రంభా ఊర్వశా అన్నది కాదు ప్రశ్న. అందానిదేముంది, అందం శాశ్వతం కాదు.

ఆమె గుణం ఎలాంటిదో? ఆమె ప్రవర్తన, వాళ్ల వంశం, సాంప్రదాయం ఎలాంటిదో?

ఇవేవీ ఆలోచించకుండా వాడు లటుక్కున ప్రేమలో పడిపోతే స్నేహితుడయ్యుండి చూస్తూ చూస్తూ ఊర్కోవడం తనకి భావ్యమా? అదీగాక వాడి అమ్మానాన్నలు తనమీద మోపిన బాధ్యత ఒకటి వుండనే వుందాయె.

ఎందుకైనా మంచిది ముందు జాగ్రత్త చర్యగా వెంటనే జోగారావ్‌గారికి లెటర్ రాసేస్తేనో? అనిపించిందో క్షణం.

కానీ ఆ ఆలోచనని మొగ్గలోనే తుంచేశాడు.

అప్పుడే ఏం ముంచుకుపోయిందని అలాంటి స్టెప్ తీసుకోవడం? ఆ అమ్మాయి వాళ్ల ఆఫీసులో జాయినై నిండా ఒక్కరోజైనా కాలేదు. వాడు కూడా ఏదో చూచాయగా అన్నాడే తప్ప, ఇంతలోనే అదేం నిజమైపోలేదుగా?

చూద్దాం... వ్యవహారం ముదిరితే అప్పుడు చూస్కోవచ్చు.

అయినా వాడేమంత వెర్రిపీనుక్కాదుగా అల్లాటప్పా అమ్మాయిని ప్రేమించేయడానికి? ఒకవేళ ఆ అమ్మాయిలో అందంతోపాటు ఇతర లక్షణాలన్నీ కూడా బాగానే వున్నట్టయితే వాడి ప్రేమని తానెందుక్కాదనాలి?




స్నేహితుడి మనసెరిగి ప్రవర్తించేవాడే కదా నిజమైన స్నేహితుడంటే?!

మరి కాసేపట్లో తాను గౌతమాఫీసుకెళ్ళి ఆమెను చూడబోతున్నాడని తెలిసుండి కూడా అలా పరిపరి విధాల ఆలోచిస్తూ బుర్రని ఖరాబు చేస్తున్నాడు సుబ్బారావ్. ధ్యాసని పని మీదకు మళ్లించాలని ఎన్నిసార్లు ప్రయత్నించినా అతనికది అసాధ్యమే అయ్యింది.

అనుకున్నట్టుగానే లంచ్ అవర్లో క్యాంటీన్‌లో దూరడం మానేసి గౌతమ్‌వాళ్ల ఆఫీసుకి బయలుదేరాడు సుబ్బారావ్.

వాకబుల్ డిస్టెన్సే అయినా టైమ్ చాలకపోవచ్చునన్న ఉద్దేశంతో ఆటోలో వెళ్లాడు.

సుబ్బారావ్‌ని చూడగానే గౌతమ్ చేటంత ముఖంతో సంబరంగా ఆహ్వానించాడు. "రారా... రా... నీ కోసమే ఎదురుచూస్తున్నా" అంటూ.

'ఓహో' అన్నట్టు తల ఆడించి సెక్షనంతా కలియచూశాడు సుబ్బారావ్.

ఓ కార్నర్ సీట్లో ముసలి అకౌంటెంట్ ఒకాయన రైటింగ్ పాడ్‌మీద తలవాల్చి నిద్దరోతూ కనిపించాడు తప్పితే, మిగతా సెక్షన్ అంతా ఖాళీగా వుంది. ఆ ముసలి అకౌంటెంట్‌కి గౌతమ్ పెట్టిన నిక్‌నేమ్ కుంభకర్ణుడు. అసలు పేరు నిత్యానందం.

"ఏదీ నీ ఫియాన్సీ?" అన్నట్టుగా కళ్లెగరేశాడు సుబ్బారావ్.

"బైటికెళ్లింది వస్తుందాగు" అన్నట్టుగా చేత్తో సైగచేశాడు గౌతమ్.

"సరే పద... ఈలోగా మనం అలా బైటికెళ్లి కాసిన్ని టీనీళ్లు కడుపులో పోసుకొద్దాం" అన్నాడు సుబ్బారావ్.

గౌతమ్ అయిష్టంగా ముఖం పెట్టాడు.

"వొద్దురా... ఆ దిక్కుమాలిన గణేష్‌భవన్‌లో టీ తాగడంకన్నా మానేసూర్కోవడం ఉత్తమం"

నిజమేననిపించింది సుబ్బారావుక్కూడా. గౌతమ్ వాళ్ల ఆఫీసుకు సమీపంలో వున్న హొటల్ ఆ గణేష్‌భవన్ ఒక్కటే. గతంలో రెండుమూడుసార్లు తాగివుండటంచేతే అందులోని టీ అంతచండాలంగా వుంటుందన్న వాస్తవం అతనికీ తెలుసు.

'అయితే వద్దులే' అనేసి ఖాళీగా వున్న ఓ కుర్చీని గౌతమ్ సీటుకి దగ్గరగా లాక్కుని కూర్చుంటూ అడిగాడు సుబ్బారావ్.

"ఈరోజు పలకరింపులూ గట్రా ఏమన్నా అయ్యాయా?"

"లేదు...నిన్న మా సెక్షన్‌హెడ్ అందరికీ పరిచయం చేసినప్పుడు తలా ఓ నమస్కారం పారేసిందంతే"

"ఎలా వుంది మనిషి? చురుకైనదేనా, లేకపోతే సోంబేరి మొహమా?"

గౌతమ్ సుబ్బారావ్ వైపు చురచురా చూశాడు.

"ఎంతమాట పడితే అంత మాటా అనేయకు. అష్టమహాపాతకాలూ చుట్టుకుంటాయ్"

"ఎందుకూ?" విషయం గ్రహించి కూడా కొంటెగా అడిగాడు సుబ్బారావ్.

"ఎందుకేంటి నీ మొహం! ఏదో అవసరార్థం మా ఆఫీసులో టైపిస్ట్‌గా చేరినంత మాత్రాన్న ఆమె మామూలు యువతి అనుకుంటున్నావా? నో... షి ఈజ్ ఏన్ ఏంజిల్! ఆమె ఒక దేవత. దేవతల్ని సోంబేరి మొహం అదీ ఇదీ అనకూడదు..."

"ఓర్నీ అసాధ్యం గూలా. మొత్తానికి ఆ అమ్మడెవరోగాని నీ పాలిటి అయస్కాంతమై నిన్నో ఇనపముక్కని చేసిపారేసింది" అనుకున్నాడు సుబ్బారావ్ మనసులో. "అటులనా?" అన్నాడు పైకి- కంఠంలో చిరువ్యంగ్యాన్ని ధ్వనింపజేస్తూ.

"నువ్వేం వేళాకోళం చెయ్యనక్కర్లేదు. ఆమెని చూశాక నువ్వే ఒప్పేసుకుంటావ్ నా మాట కరక్టేనని..." ముక్కుపుటాలెగరేస్తూ అన్నాడు గౌతమ్.

సుబ్బారావ్ ఏదో అనబోతూ నోరు తెరిచాడు. కానీ అనలేకపోయాడు. పైగా తెరిచిన ఆ నోరు తెరుచుకున్నట్టే వుండిపోయింది.

అందుక్కారణం అనూహ్య ఆఫీసు ప్రవేశం!

మెరుపుతీగ నింగినుండి నేలకు దిగిపోయిందేమో అనిపించిందో క్షణం. కళ్లు



అంతలా చెదిరిపోయినప్పుడు అలా అనిపించకుండా ఎలా వుంటుంది?

బ్రహ్మదేవుడు ఇంత అందగత్తెను ఎలా సృష్టించగలిగేడబ్బా? గలిగేడు పో, ఆ జగదేక సుందర్ని తన వద్దనే అట్టి పెట్టేస్కోకుండా భూమ్మీదకు ఎలా పంపించేయగలిగేడబ్బా? అని ఆశ్చర్యపోకుండా వుండలేకపోయాడు సుబ్బారావ్.





'ఒళ్లంతానే కాదు, ఒక్కో మనిషికీ రెండేసి ఒళ్లులుండి ఆ రెండు ఒళ్లున్నిండా కళ్లున్నా కూడా సరిపోవు ఆమె అందాన్ని తనివితీరా చూడ్డానికి' అని కూడా అనిపించింది సుబ్బారావ్‌కి.

అలా అనిపించిన మరుక్షణం అతనిలోని అంతరాత్మ గళం విప్పింది- "తప్పు తప్పు... నువ్వామెనలా చూడకూడదు. ఆమె నీ ప్రాణ స్నేహితుడి ఫియాన్సీ- ఉడ్ బీ వైఫు"

"అవునుగదూ... నిజమేగదూ?" అనుకుని చటుక్కున ఆమెవైపు నుండి చూపు మరల్చుకుని ఆ మీదట గౌతమ్‌వైపు చూశాడు సుబ్బారావ్.

గౌతమ్ ఈ లోకంలో ఉంటేగా?

తల దించుకుని టైప్‌మిషన్‌లో వైట్‌పేపర్ని

క్కిస్తోన్న అనూహ్యావైపు అర్ధనిమీలిత నేత్రాలతో పరవశంగా చూస్తూ ఏదో ట్రాన్స్‌లో వున్నవా డిలా అదోరకమైన విచిత్రమైన అవస్థలో వున్నాడు.

సుబ్బారావ్ మనసులో చటుక్కున ఊర్మిళ మెదిలింది. తను కూడా ఊర్మిళని పరవశంగా చూస్తాడు. కానీ మరీ ఇంత పరవశంగా ఏనాడైనా చూశాడా? జ్ఞాపకం చేసుకోబోయాడు. కానీ అంతలో అతని అంతరాత్మ మరోసారి గళం విప్పింది...

"తప్పురా వెధవా తప్పు. ఊర్మిళ ఊర్మిళే, అనూహ్యా అనూహ్యే. నీ వుడ్‌బీని నీ మిత్రుడి వుడ్‌బీతో పోల్చుకోవటంగానీ బేరీజు వేసుకోవడంగానీ తప్పున్నర తప్పు..." అంటూ.

దాంతో సుబ్బారావ్ ఏదో లోకంలో వున్న గౌతమ్ మోచేతిపై మెల్లగా గిచ్చేడు. నొప్పి కలిగించాలని కాదు, అతన్ని కూడా ఈ లోకంలోకి లాక్కొచ్చేస్తే ఇహ అక్కణ్ణించి నిష్క్రమించొచ్చుకదాని.

కానీ ఆ ప్రయత్నం గౌతమ్‌ని కించిత్తయినా కదిలించలేకపోయింది. కనీసం అతని అర్ధనిమీలిత నేత్రాల్ని పూర్తిగా తెరుచుకునేలా అయినా చేయలేకపోయింది.

దాంతో డోస్ సరిపోలేదని గ్రహించిన సుబ్బారావ్ ఈసారి గాఠ్ఠిగా గిచ్చాడు తిరిగి అదే స్పాట్‌లో.

అంతే...

గౌతమ్ కెవ్వుమని అరిచాడు.

ఆ అరుపుకి అనూహ్యా దిగ్గున తలపైకి లేపి అతనివైపు కంగారుగా చూసింది. కెవ్వుమని అరిచినప్పటికీ గౌతమ్ ఇంకా ఆమెవైపే చూస్తూండటంవల్ల ఇద్దరి చూపులూ కలుసుకున్నాయ్.

"అబ్బే మరేం లేదండీ. ఈ వెధవ నన్ను గిచ్చేడు. అంతే... మీరేం బాధపడకండి. మీ పని మీరు చేసుకోండి" కళ్లూ కళ్లూ కలిశాయి. కాబట్టి మనసూ మనసూ పెనవేసుకున్నట్టే అనుకున్నాడో ఏమో, కాస్త పిచ్చిగానే వాగాడు గౌతమ్.

అనూహ్యా విశాలమైన తన కళ్ల తాలూకు కనురెప్పల్ని అల్లాడిస్తూ ఆశ్చర్యంగా చూసింది.

"మధ్యలో నేను బాధపడటం ఏమిటి? ఆయనెవరో మిమ్మల్ని గిచ్చితే నాకెందుకూ బాధ?" 'మీకేవన్నా తిక్కా?' అన్నట్టు తలెగరేసింది.

గౌతమ్ తత్తరపడ్డాడు. "అహఁ... అహహ... ఊర్కే... ఊర్కే అన్నానండీ... పొరపాటు... పొరపాట్నన్నమాట..."

పైకయితే అలా తత్తరపడ్డాడుగాని మనసులో మాత్రం మహాబాధపడిపోయాడు- ఆమె తన ప్రేమహృదయాన్ని (లేక హృదయంలోని ప్రేమని) అర్థంచేస్కోకుండా నిన్ను గిచ్చితే నాకేం, రక్కితే నాకేం అనే ధోరణిలో మాట్లాడినందుకు.

అనూహ్యా ముత్యాల పేరులాంటి తన పలువరుస తళుక్కుమనేలా కిసుక్కున నవ్వింది.

"అబ్బ... ఎంత మధురంగా నవ్వారండీ" నాలుక చివరిదాకా వచ్చిన మాటల్ని విజ్ఞత వెన్నుతట్టగా చటుక్కున దిగమింగేసి తనూ నవ్వేడు గౌతమ్. కానైతే దేభ్యంలా.

"నా పేరు సుబ్బారావండీ. గౌతమ్ స్నేహితుణ్ణి" సుబ్బారావ్ అనూహ్యాకి తననితాను పరిచయం చేస్కున్నాడు- తనలా తలదూర్చి మాటల్ని డైవర్ట్ చేయకపోతే గౌతమ్ మళ్ళీ ఏదైనా వాగి ఆమె హృదయంలో ఓ స్క్రూలూజుగాడిలా ఎక్కడ ముద్ర వేయించేనుకుంటాడోనని.

"నమస్తే... నా పేరు అనూహ్యా. నిన్ననే టైపిస్ట్‌గా చేరానీ ఆఫీసులో- మీరు?" అంది అనూహ్యా.

చెప్పాడు సుబ్బారావ్ తానెక్కడ పనిచేస్తున్నదీ.

"అలాగా" అన్నట్టు తలాడించి ఊరుకుంది.

"వస్తానండీ... రారా అలా బైటికెళ్దాం"

ముఖంమీది దేభ్యం నవ్వుని ఇంకా చెరుపుకోకుండా అలాగే వున్న గౌతమ్‌ని జబ్బ పుచ్చుకుని బైటికి లాక్కెళ్లిపోయాడు సుబ్బారావ్.

"ఎలా వుంది 'నా' అనూహ్యా?" బైటికెళ్లగానే ఆత్రంగా అడిగాడు గౌతమ్.

"మరీ అంత ఆశలు పెంచేస్కోకు. అప్పుడే




నీదైపోయినట్టు నా ఏంటి 'నా'?''

''అంటే నీ ఉద్దేశం?''

''సదుద్దేశమే. ఆమె అంతర్యం ఏమిటో తెలుసుకోకుండా కేవలం ఒకటింబావురోజుల పరిచయంలో అంత స్ట్రాంగ్‌గా ఆశలు పెంచుకో వడం మంచిది కాదంటున్నాను''

''సంతోషించాంలే నీబోడి సలహాకి! ఇంతకీ ఎలావుందో చెప్పు ముందు''

''బానేవుంది'' పొడిగా అన్నాడు సుబ్బారావ్.

గౌతమ్ హృదయం పెట్రోలు ధరమీద పెట్రోలుపోసి నిప్పెట్టినట్టు భగ్గున మండింది. ''బానేనా? ఏం చూపుగాని మందగించిందా? మెదడుగాని మొద్దుబారిపోయిందా? హుఁ... అంత అందగత్తెని పట్టుకుని సింపుల్‌గా బానే వుందని తేల్చిపారేస్తావా? అసల్నువ్ మనిషివేనా?'' అన్నాడు ఆవేశంగా.

''కాదు...దున్నపోతుని. లేకపోతే ఏంట్రా నీ ఇది? నన్ను కూడా నీలా ఆమె అందాన్ని పొగుడ్తూ కూర్చోమంటావా? అయితే గియితే ఆమె నీ కాబోయే భార్య! మిత్రుడి కాబోయే భార్య అందాన్ని బుద్ధున్నవాడెవడైనా పొగుడ్తూ కూర్చుంటాడా?''

'నిజమే స్మా' అనిపించడంతో గౌతమ్‌లోని తాత్కాలికావేశం సద్దుమణిగిపోయింది. అంతే కాకుండా మిత్రుడి మంచి మనసుకి సంతోషం కూడా వేసింది. ''నేనంత దూరం ఆలోచించలే దురా'' అన్నవ్వేసి- ''సర్లే... ఇప్పుడు చెప్పు. నేనామెని ప్రేమించటం సబబా, సబబు కాదా?'' అనడిగేడు సుబ్బారావ్‌ని భుజాలు పట్టుక్కుదిపేస్తూ.

''ఏంట్రా ఈ కుదపటం? కంట్రోల్ యువర్ సెల్ఫ్'' అని కోప్పడి తర్వాత నెమ్మదిగా అన్నాడు సుబ్బారావ్-

''నీ సెలక్షన్ బానేవుంది. కాదన్ను. కానీ...''

''కానీ లేదు. అర్ధణాలేదు. ఈ విషయంలో నువ్ నన్నింకేమీ డిస్కరేజ్ చెయ్యకు. అవసర మైతే అష్టకష్టాలూ పడైనాసరే ఆమె మనసును తెల్సుకోగలనన్న ధీమా నాకుంది. సరే టైమ య్యిందిగా, నువ్వింక బయల్దేరు'' అన్నాడు గౌతమ్.

''బయల్దేరక ఇక్కడే తిష్టేసుక్కూర్చుంటానా? హుఁ... రమ్మనటం నీ వంతే పొమ్మంటం నీ వంతే. సరే పోతున్నానయితే'' ఉత్తుత్తినే నిష్ఠూరమాడ్తూ అక్కణ్ణించి ముందుకు సాగిపోయాడు సుబ్బారావ్.

ఇజ్జరిగిన ఓ రెండున్నరగంటల తర్వాత- అంటే ఆఫీసైపోయాక అన్నమాట.

ప్రపంచంలో వున్న విషాదాన్నంతట్నీ ముఖంలో నింపుకొని బస్టాప్‌లో సుబ్బారావ్‌కి పునర్దర్శనమిచ్చాడు గౌతమ్.

''అలా ఉన్నావేం?'' గాభరాగా అడిగాడు సుబ్బారావ్.

''ఆ చెక్కమొహంగాడు నా కొంపముంచేడ్రా...'' నుదురు బాదుకుంటూ ఆవేదనగా అన్నాడు గౌతమ్.

''ఏ చెక్కమొహంగాడు?''

''చెక్కమొహంగాడు తెలియదా? ఇంకెవడూ, నా పక్కసీట్లో వుంటాడే రాంబాబుగాడు... వాడు''

''అలా అన్నావ్ బాగుంది. అంతేగాని మీ ఆఫీసులోని ప్రతివాడికీ నువ్ పెట్టిన నిక్‌నేమ్స్ అన్నీ నాకేం తెలుస్తాయి? సర్లే సర్లే... ఇంతకీ ఏం చేశాడా రాంబాబు?''

''నా కొంపని నిలువునా ముంచేశాడు...''

''ఆ సంగతి ఇందాకే చెప్పేడిశావ్. అసలేం చేశాడో అచ్చెప్పేడువ్...''

గౌతమ్ చుట్టూ చూశాడు. చాలామంది వున్నారు బస్టాప్‌లో. ఒకరిద్దరు వీళ్ల సంభాషణను ఆలకిస్తున్నారు కూడా.

అక్కడ చెప్పడానికి మనస్కరించక ''అలా పక్కకెళ్లి మాట్లాడుకుందాం రా'' అంటూ సుబ్బారావ్‌ని ఒకింత ఎడంగా లాక్కెళ్ళాడు గౌతమ్.

''ఊఁ... చెప్పు''

''లంచవర్లో నువ్ నాతో మాట్లాడి వెళ్లిపోయాక ఆ చెక్కమొహంగాడితో ఏదో నోరూర్కోక 'అనూహ్యగారు అచ్చం అప్సరసలా వున్నారుకదూ?' అన్నానా. అంతే... ఆ ముదనష్టపు ముండాకొడుకు దాన్ని పట్టుకుని ఆఫీసంతా టాంటాం చేసేశాడు. పోనీ ఉన్నదున్నట్టు చె

# ఏరిన ముత్యాలు

★ ఒక వ్యక్తి తాను అనుభవించిన ఆనందాన్ని ఇంకొకరిలో కలిగించడానికి చేసే ప్రయత్నమే కళ.

--టాల్‌స్టాయ్

★ కళ ప్రజలకు చెందిన ఆస్తి. అది ప్రజాహృదయాల్లో నాటుకుపోయి వారి అభ్యుదయానికి మార్గదర్శకం కావాలి.

--లెనిన్

★ కన్యలు మంచి భర్తల్ని తప్ప ఇంకేమీ కోరరు. ఆ భర్త దొరికాక అంతులేకుండా అన్ని కోరికలూ కోరుతూనే ఉంటారు.

★ వైవాహిక జీవితం ఒక అద్దాల భవనంలాంటిది. కొత్తవాళ్లు అందులోకి రావాలని కోరుకుంటే, లోపలివారు బయటికి పారిపోవాలని కోరుకుంటారు.

— మాంటేగ్

★ హాయిగా పెళ్లిచేసుకో. పెళ్లాం అనుకూలవతి అయితే సుఖపడలేవు. కాకుంటే వేదాంతివి అవలేవు.

— సోక్రటీస్

★ గతాన్ని తవ్వి నీ శక్తిని వృధా చెయ్యకు. వివేకవంతుడెప్పుడూ వర్తమానంలోనే బతుకుతాడు.

— వివేకానంద

★ లార్డ్‌మెకాలే ఒక వాక్యం రాయడానికి ఇరవై పుస్తకాలు చదివేవాడు. ఒక వర్ణన చెయ్యడానికి వందమైళ్లు ప్రయాణం చేసేవాడు.

— థాకరే

★ చక్కగా రాయడం అంటే బాగా ఆలోచించడం. అనుభూతి చెందడం... ఆ తరువాత మేధస్సు, ఆత్మ, అభిరుచి ఒక రూపు దాల్చడం.

— బఫ్ఫన్

★ ఇతరుల రహస్యాలు చెప్పేవాడికి ఎప్పుడూ నీ రహస్యాలు చెప్పబోకు. ఎందుకంటే నీ రహస్యాలు కూడా ఇతరులకు చెబుతాడు.

— హజరత్‌అలీ

★ భగవంతుని మీద నిజమైన భక్తి ఉన్నవ్యక్తి భగవంతుని పేరు గురించిగాని, మోక్షాన్ని గురించిగాని ఆలోచించడు.

—సర్వేపల్లి రాధాకృష్ణన్

★ భగవంతునికి పెద్ద పెద్ద సామ్రాజ్యాలంటే ఇష్టం లేకపోవచ్చుగాని చిన్న చిన్న పూలతో ఎప్పుడూ అసంతృప్తిచెందడు.

– ఠాగూర్

★ శత్రువుల మీది మన ద్వేషం మన సుఖానికి చేసేటంత హాని వారి సుఖానికి కలిగించలేదు.

– జె. పెటిట్‌సెన్

★ పరులను ద్వేషించడం – ఎలుకలను చంపడం కోసం సొంత ఇంటికి నిప్పటించుకోవడమే.

– హెచ్.ఇ. ఫాస్‌డిక్

సేకరణ: నల్లబెల్లి శ్రీమన్నారాయణ

ప్పాడా అంటే అది కాదు. ''గౌతమ్ మన ఆఫీసుకి కొత్తగా వచ్చిన క్యాండిడేట్‌కి కూడా నిక్‌నేమ్ పెట్టేశాడోచ్'' అని ఆమె వినేలా దుష్ప్రచారం చేశాడు. ఎక్కడైనా 'అప్సరస' అనేది కాంప్లిమెంట్ అవుతుందేగాని నిక్‌నేమ్ అనిపించుకుంటుందా?''

లేదన్నట్టు అడ్డంగా తలాడించి అన్నాడు సుబ్బారావ్- ''అసలు నీకెందుకంత నోటిదురద? ఆమె అందాన్ని మనసులో పొగుడుకుంటూ కూర్చోక ఆ రాంబాబుతో అలా వాగమన్నదెవడు? సరే...ఇంతకీ అనూహ్యాలా రియాక్టయ్యింది?''

''ఆ ఆఫీసుకి కొత్తగా వచ్చింది తనే గనక ఆ చెక్కమొహంగాడలా అంటుంటే తనకి అర్థమవ్వదేంటి? నిజంగా నేను తనకేదో నిక్‌నేమ్ పెట్టాననుకుని నావైపు చాలా అనుమానంగానూ, అసహ్యంగానూ చూసింది. నా గుండెకాయని ఎవరో క్రషర్‌లోవేసి నలిపేస్తున్నట్టు నాకెంత బాధేసిందో తెలుసా? పోనీ ఆ చెక్కమొహంగాడు అంతటితో సరిపెట్టేడా అంటే లేదు. ''నీకేవేం చండాలపు బుద్ధులోయ్ అందరికీ నిక్‌నేమ్స్ పెట్టడాలూ, అందర్నీ ఏడిపించుకుతినడాలూ?'' అని ఆమె వింటూండగానే అడిగాడు నన్ను. నామీద ఆమెలో బాడ్ ఒపీనియన్ క్రియేట్ చేయడానిక్కాకపోతే ఎందుకు అడుగుతాడు?'' బాధ రెపరెపలాడింది గౌతమ్ కంఠంలో.

''చేసుకున్నవాడికి చేసుకున్నంత అని వూరికే అన్నారా? నీ బుద్ధి అలాంటిది కాబట్టే అతనలా అనగలిగాడు. ఇప్పటికైనా తెలుసుకుని నీ ప్రవర్తన మార్చుకో...'' సందు దొరికిందే చాలని హితోపదేశం చెయ్యబోయాడు సుబ్బారావ్.

అత్యంత సహజంగానే ఒళ్ళు మండిపోయింది గౌతమ్‌కి.

''నోర్మూయ్ రాస్కెల్. అసలే నా హృదయం వ్యథతో ఇదైపోతుంటే మధ్యలో నీ నసేంటి? నీతులు చెప్పడానికి ఇదా సమయం? అసలే నా అనూముందు నా గాలిని తీసేయ్యడమే కాకుండా ఆ దుష్టుడు ఆమెకి నేనేదో ఛండాలపు పేరు పెట్టానేమోనన్న అనుమానాన్ని ఆమెలో కలిగించాడని నేను బాధ పడ్తూంటే... ఓదార్చాల్సిందిపోయి నీతులు చెప్తావా నీతులు?'' తామున్నది నడిరోడ్డులో అన్న సంగతి మర్చిపోయి గొంతు చించుకుంటూ అరిచేశాడు.

''తప్పయిపోయిందిలేరా'' అని చెంపలేసుకున్నాడు సుబ్బారావ్.

''సరే... మరైతే ఇప్పుడేం చేయాలనుకుంటున్నావ్?''

''ఎలాగోలా ఆ చెక్కమొహంగాడు ఆమెలో నాటిన ఆ విషబీజాన్ని తొలగించాలి''

''మరైతే తొలగించేసెయ్...''

''ఏడ్చినట్టే వుంది. ఆ తొలగించడం ఎలా అన్నది అర్థంగాకనేకదా నా ఏడుపంతా''

''అయితే అర్జంటుగా ఏదన్నా ఉపాయం ఆలోచించమంటావ్- అంతేనా?''

గౌతమ్ 'అంతే'అన్నట్టు నిలువుగా తలాడించాడు.

''ఇంటికెళ్ళాక ఆలోచిద్దాంలే నడువ్'' అంటూ సుబ్బారావ్ అతన్ని మళ్ళీ బస్టాప్‌వైపు లాక్కెళ్ళాడు.



బస్‌లో ఉన్నంతసేపూ ఎలా ఉగ్గబట్టుకున్నాడో ఏమోగాని ఇంట్లో కాలుపెట్టిన మరుక్షణమే ప్రారంభించేశాడు గౌతమ్-

''ఏరా ఆలోచించావా? ఏదన్నా ఉపాయం తోచిందా?''

''అబ్బ... ఆగరా. కనీసం డ్రెస్సన్నా ఛేంజ్ చేసుకోనిస్తావా లేదా?'' విసుక్కున్నాడు సుబ్బారావ్.

''నీకలా వుందన్నమాట. హుఁ... అవున్లే

ఎద్దుపుండు కాకికి ముద్దా?" నిష్ఠూరంగా అన్నాడు గౌతమ్.

"ఎందుకురా చిన్నదానికి అలా అపార్థం చేసేస్కుంటావ్? ఆలోచిస్తూనే వున్నా- తట్టొద్దూ? తట్టగానే చెప్పనా ఏంటి?" సముదాయించాడు సుబ్బారావ్.

"ఒక పనిచేస్తే ఎలా వుంటుంది?" అన్నాడు గౌతమ్.

"ఏంటది?"

"ఏంలేదు... ఆ చెక్కమొహంగాడివన్నీ అబద్ధాలే మీరు నమ్మకండి. నేను మీకేం నిక్‌నేమ్ పెట్టలేదు. అప్సరస అంటూ మీ అందాన్ని పొగిడానంతే" అని అనూహ్యకి ఓ ఉత్తరం రాస్తే ఎలా వుంటుంది?"

"నో డౌట్ వీడికి మతిపోయింది" అనుకున్నాడు సుబ్బారావ్- "అవునుమరి... లేకపోతే ఎవరైనా చేస్తారా అలాంటి పిచ్చిపని?"

ఆ మాటే అన్నాడు- "మతిలేని ఆలోచనలు చెయ్యకు. అనలామెతో నీకెంత పరిచయముందని ఉత్తరం రాస్తావ్? రెండురోజుల పరిచయానికే నువ్ ఉత్తరం రాసేదాకా వెళ్తే ఆమె నిన్ను గ్యారంటీగా జులాయి వెధవకింద లెక్కగట్టేస్తుంది. అంతేకాదు, ఆ ఉత్తరాన్ని తిన్నగా తీస్కెళ్లి, మీ మేనేజర్ చేతిలో పెట్టేసిందనుకో- అప్పుడు నీ పరిస్థితేంటి?

గౌతమ్ కళ్ళ ముందు సడన్‌గా బండబూతులు తిడుతూన్న మేనేజర్ మెదిలాడు.

"ఆ.. ఆ... అంతేనంటావా?" అన్నాడు నీరసంగా.

"ముమ్మాటికీ అంతే! అసలు ప్రేమ విషయంలో ఎప్పుడూ ఉత్తరాల ద్వారా ప్రొసీడ్ అవ్వకూడదు. చాలా చాలా ప్రమాదం. మన క్లాస్‌మేట్ కిషోర్ గుర్తున్నాడుగా? మన కాలేజీ బ్యూటీ తులసికి లవ్ లెటరు రాసినందుకు అతని పరిస్థితిఏమయ్యింది?"

కిషోర్ తులసికి లౌ లెటర్ రాయడం, దాన్నామె తీస్కెళ్ళి ప్రిన్సిపాల్‌కివ్వడం, పర్యవసానంగా కిషోర్‌కి టీసీ ఇచ్చి కాలేజీ నుండి పంపించేయడం... అంతా గుర్తుకొచ్చింది గౌతమ్‌కి. "అవునవును.. పాపం చాలా ఘోరమైపోయింది వాడిబతుకు" అన్నాడు నాలుకతో పెదవులు తడుపుకుంటూ.

"అందుకే చెబుతున్నాను. ఉత్తరం గిత్తరం రాయడంలాంటి పిచ్చిపన్లేం చేయకు. అంతగా కావాలంటే ఆమె ఒంటరిగా దొరికినప్పుడు ఓరల్‌గా చెప్పు. నోటిమాటకి సాక్ష్యాధారాలేవీ వుండవ్ కాబట్టి మరేమీ ప్రమాదముండదు"

సుబ్బారావ్ అలా అనగానే గౌతమ్ ముఖంలో కాస్త కళొచ్చింది "ఓకే... ఓకే... రేపే చెప్పేస్తానయితే" అన్నాడు కంఠంలో చిరు సంతసాన్ని ధ్వనింపచేస్తూ.

"అదుగో ఆ తొందరపాటే పనికిరాదు. రేపంటే రేపే అనేముంది? ఏదనైనా సమయం సందర్భం కనిపెట్టి చెయ్యాలి. అప్పుడే అది సత్ఫలితాన్నిస్తుంది"

"అలాగే లేరా! రేపంటే నిజంగా రేపే అనికాదు నా ఉద్దేశ్యం కూడా" అన్నాడు గౌతమ్ నవ్వీనవ్వనట్టుగా.

"సో....నీ సమస్యకి ప్రస్తుతానికో సొల్యూషన్ దొరికినట్టేగా? కాబట్టి ఇక వర్రీకావడం మానేసి మామూలుగా వుండు" అన్నాడు సుబ్బారావ్.

గౌతమ్ 'అలాగే' అన్నట్టు బుద్ధిగా తలూపేడు.

సుబ్బారావ్ 'అమ్మయ్య' అనుకుంటూ షర్ట్ విప్పి హేంగర్‌కి తగిలించబోతూంటే-

"మా డాడీ రమ్మంటున్నారు మీ ఇద్దర్నీ" అంటూ వచ్చేడు డుంబూ.

"ఆ ఆనందరావ్ కూతుర్ని చేస్కోమని అడగటానికేనా? నేను చేస్కోను పొమ్మన్నానని చెప్పుపో" గుండెనిండా అనూహ్య రూపమే నిండిపోయివున్న గౌతమ్ అనాలోచితంగా అరిచేడు.

డుంబూ, వాడితోపాటు సుబ్బారావ్ కూడా ఆశ్చర్యపోయారు.

'అహో... ప్రేమకీ ఉన్మాదానికీ ఎంత నియరెస్ట్ సంబంధముందీ?!!' అని మనసులో అనుకొని- గౌతమ్ వెన్నుమీద చరుస్తూ అన్నాడు సుబ్బారావ్.

"ఛఛ... అదేంమాటరా? ఆ విషయంలో మన అసహాయతని మొన్నరాత్రే వ్యక్తం చేసేశాం కదా? మళ్లీ ఆ టాపిక్ ఎందుకొస్తుంది?

ఇంక దేనికో అయ్యింటుంది వెళ్దాం పద...''

గౌతమ్ బిడియంగా తల దించేసుకున్నాడు తన తొందరపాటుకి.

''మేంవస్తాం, నువ్ పద డుంబూ'' అన్నాడు సుబ్బారావ్.

డుంబూ వెళ్లబోతుంటే వాణ్ణి ఆపి మళ్లీ సుబ్బారావే అన్నాడు-

''గౌతమ్ అంకుల్‌కి ఒంట్లో బాగోలేదు. అందుకని ఇందాక అలా అరిచేడు. ఆ సంగతి మీ నాన్నగారితో చెప్పకేం?''

''సరే...''అన్నట్టు తలూపి వెళ్ళిపోయాడు డుంబూ.

అంకుల్ నాన్నగారితో చెప్పవద్దన్నాడేగానీ అమ్మతో చెప్పవద్దనలేదుగా? అనుకున్నాడో ఏమో మరి! వాడు నేరుగా తల్లి దగ్గరికెళ్లి చెప్పేశాడు. ''మరేమో... మరేమో.. డాడీ రమ్మంటున్నారని పిలవడానికెళ్తే ఆ గౌతమ్ అంకుల్ నామీద కోప్పడ్డాడమ్మా'' అని.

''ఏమని కోప్పడ్డాడు? ఏం మాయదారి రోగ మొచ్చిందట?'' అంది పావని.

''అదేమోగానీ మొత్తానికి ఒంట్లో బాగోలేదటమ్మా! అసలందుకే కోప్పడ్డాడట. సుబ్బారావంకుల్ నాన్నగారితో చెప్పొద్దని కూడా అన్నాడు....''

కొడుకు మాటలు పావని భృకుటిని ముడిపడేలా చేశాయి.

''ఏంటీ? నాన్నగారితో చెప్పొద్దని సుబ్బారావ్ అన్నాడా? అసలేం కూశాడ్రా ఆ గౌతమ్...?''

''కుయ్యాలేదమ్మా గట్టిగా అరిచేడంతే...'' అమాయకంగా అన్నాడు డుంబూ.

నిజానికి చాలా నవ్వు రావాల్సిన సందర్భమది. కానీ పావనికి మాత్రం నవ్వు రాలేదు. ''అదేలే, కుయ్యడమంటే అరవడమే! ఇంతకీ ఏమనరిచాడు?'' అనడిగింది ఆత్రంగా.

అవడానికి పసివాడే అయినా డుంబూకి జ్ఞాపకశక్తి మాత్రం అపారం... ''ఆ ఆనందరావ్ కూతుర్ని చేస్కోమని అడగటానికేనేమో నేను చేస్కోను పొమ్మన్నానని చెప్పుపో.. అని అరిచాడమ్మా!'' అని చెప్పేశాడు అక్షరం పొల్లుపోకుండా.

అంతే!

''విన్నారా విన్నారా...'' అంటూ పావని భర్త దగ్గరికి హాల్లోకి పరుగుతీసింది

అసలు నిజానికి మిత్రద్వయాన్ని రమ్మని కబురు పంపింది శ్రీరామమూర్తి కాదు. డుంబూకీ ఆ పని అప్పగించింది ఆయనే అయినప్పటికీ అలా చెప్పమని ఆయనకి పురమాయించింది మాత్రం పావనే! అందుక్కారణం మిత్రద్వయంతో ఇల్లు ఖాళీ చేయించేయాలి అన్న దుర్నిర్ణయబీజం ఆమెలో ఆ నరికే మొలకెత్తిపోవడం, ''ఎందుకిప్పుడు వాళ్లతో ఇల్లు ఖాళీ చేయించడం? వాళ్ళేం అల్లరిచిల్లరి వేషాలు వెయ్యటం లేదు కదా? బుద్ధిగానే వుంటున్నారు కదా?'' అని శ్రీరామ్మూర్తి వాదించపోయినప్పుడు ''మా ఆనందరావ్ మావయ్య కూతుళ్ళని చేస్కోవడానికి వాళ్ళొప్పుకోలేదు కాబట్టి వాళ్లు ఖాళీ చేసి తీరాల్సిందే'' అని ఖండితంగా చెప్పేసిందామె. ఆ దంపతుల్లో అన్ని విషయాల్లోనూ సర్వసాధారణంగా అవిడదే పైచేయవుతూంటుంది. శ్రీరామ్మూర్తిది భార్యమాట జవదాటలేని మనస్తత్వం. అందువల్ల ''సరేలే'' అనేశాడాయన. దాని పర్యవసానమే మిత్రద్వయాన్ని పిల్చుకురావడానికి డుంబూ వెళ్లడం, ఖర్మగాలి గౌతమ్ అలా అరవడం, ఆ విషయాన్నిపుడు వాడు తల్లితో చెప్పడం ఎట్సెట్రా.

డుంబూ నిప్పంటించేశాడని వాళ్లకేం తెలుసు? ఓ పది నిముషాల తర్వాత మిత్రద్వయం చిరునవ్వు ముఖాల్తో శ్రీరామమూర్తి ముందు ప్రత్యక్షమయ్యారు ''ఏంసార్... పిలిచారా?'' అంటూ.

శ్రీరామమూర్తి ముఖం అదోలా వుండటాన్నిగానీ, పావని తమవేపు నమిలిమింగేసేలా చూస్తూండటాన్నిగానీ వాళ్లు గమనించలేదు.

రండ్రండ్రి కూర్చోండి అని ఎప్పటిలా శ్రీరామమూర్తి వాళ్లని సాదరంగా ఆహ్వానించలేదు. నించున్నవాళ్ళని అలాగే నిలబెట్టి కరుగ్గా అడిగాడు-

''మా డుంబూతో ఏదో అన్నారట?''

''మేమా?... ఏమన్నాంసార్ మేము?!''

గుండె గుభిల్లుమన్నా పైకి తేలకుండా వీలయినంత అమాయకంగా అడిగాడు సుబ్బారావ్.

"మీరంటే నువ్వు కాదులే... మీ గౌతమ్. ఆ ఆనందరావ్ కూతుర్ని చేస్కోమని అడగడానికా నేను రానుపో అదీ ఇదీ అన్నాడటగా?... ఏమోయ్ అన్నావా?" ముగింపులో గౌతమ్‌వైపు చూశాడు శ్రీరామ్మూర్తి.

'దొంగముండాకొడుకు చెప్పొద్దంటే చెప్పేశాడు' అనుకున్నాడు సుబ్బారావ్ బాధగా.

"లే లే లేస్సార్... అ... ఆ... అవున్సార్..." బొంకితే ఏం ప్రమాదమో బొంకకపోతే ఏం ప్రమాదమో అర్థంగాక రెండూ చెప్పేశాడు గౌతమ్.

"రెండు నాలుకల పాము" కసిగా అనుకొంది పావని.

"ఎందుకా ననుగుడు? అన్నావా లేదా స్పష్టంగా చెప్పు" శ్రీరామ్మూర్తి కోపంగా అన్నాడు.

"అన్నాను సార్!" లేదన్నా ప్రయోజనముండదనిపించి ఒప్పేనుకున్నాడు గౌతమ్.

"అయితే అన్నావన్నమాట!" తల పంకించాడు శ్రీరామ్మూర్తి.

"అనకపోతే పసినాగన్న అబద్ధమాడ్తాడా? ఎందుకలా అనాల్సొచ్చిందో కనుక్కోండి. తామేదో పెద్ద మహారాజులం అనుకుంటున్నారు కాబోలు. అసలు మా ఆనందరావ్ మావయ్య కూతుళ్ళ కాళ్లగోళ్లకైనా సరిపోతారా వీళ్లు? కాకపోతే ఏదో రెండేళ్లనుంచి మనింట్లో కాస్త బుద్ధిగా పడుంటున్నారుకదా అని అభిమానంకొద్దీ బుద్ధితక్కువై వాళ్ళపక్కన వీళ్లని వూహించాను. అంతమాత్రానికే ఇంత ఫీలైపోవాలా? చేస్కోం అని ఒకసారి చెప్పేక మళ్ళీ మళ్ళీ దేవిరించడానికి వాళ్ళేవన్నా అవకరం పిల్లలనుకుంటున్నారా?..." ఉక్రోషాన్నీ కోపాన్నీ కలగలిపి గట్టిగట్టిగా మాట్లాడింది పావని.

"మా ఉద్దేశ్యం అది కాదండీ" అని ఇంకా ఏదో చెప్పబోయాడు సుబ్బారావ్.

అడ్డు తగుల్తూ అన్నాడు శ్రీరామ్మూర్తి "అది కానప్పుడు మా డుంబూ దగ్గర మళ్లీ ఆ ప్రస్తావన తేవడం దేనికీ? మొన్నటికి మొన్న కూడా అదే ధోరణిలో మాట్లాడేవ్ నువ్వు. నా కొద్దులేగాని వీడికంటగట్టండంటూ, ఏదో లెమ్మని ఆరోజు సద్దుకుని వూరుకున్నా! అసలేంటి మీ ఉద్దేశ్యం?"

ఏం చెప్పగలరు? నోరు పెగల్లేదు మిత్రద్వయంలో ఏ ఒక్కరికీ.

"ఏం...మాట్లాడరేం?"

"ఏం మాట్లాడతారూ ఫీలైపోతున్నారు పెద్దదొరబాబుల్లా" చురకంటించింది పావని.

ఆ గొడవంతటికీ పరోక్ష కారకుడైన డుంబూగాడు తల్లివెనక జేరి మిడుతూ మిడుతూ చూస్తున్నాడు అందరికేసీ.

"అది కాదండీ..." ఎలాగో గొంతు పెగుల్చుకున్నాడు సుబ్బారావ్. "అసలేం జరిగిందంటే మా వాడికివ్వాళ ఒంట్లో బాగోలేదు అందుకని అలా అనేశాడన్నమాట!" అంతకు ముందు డుంబూకి చెప్పినట్టే లాజిక్‌కి నిలబడని సంజాయిషీ ఇచ్చాడు ఆ కంగారులో అంతకన్నా ఏమీ తోచలేదుమరి!

"ఒంట్లో బాగోలేకపోతే కారుకూతలొస్తాయా?" నిగ్గదీసింది పావని.

"మామూలుగా అయితే రావనుకోండి. కానీ ఈ వెధవది ప్రేమజబ్బుకదా! రెండ్రోజుల్నుండి మతిచెడి ఏడుస్తున్నాడు కదా?" నోరు జారేడు సుబ్బారావ్. దీనికీ కంగారేకారణం.

"ప్రేమ జబ్బా?" శ్రీరామ్మూర్తి అనుమానంగా చూస్తూ అడిగాడు.

ఎలాగూ నోరు జారేశాను కదాని నిజం చెప్పేశాడు సుబ్బారావ్.

"అవునండీ... ఈ వెధవ రెండ్రోజుల్నుండి ఓ అమ్మాయిని ప్రేమిస్తున్నాడు. ప్రేమ మనిషిని ఉన్మత్తుణ్ణి చేస్తుంది కదండీ, అందుకని ఇందాక అలా అరిచాడన్నమాట!"

పావనికి దొరికేసింది వంక.

"ఏంటీ ప్రేమలోపడ్డావా! ఇన్నాళ్లూ ఏదో బుద్ధిమంతులుకదాని బ్రహ్మచారులైనా మా ఇంటిలో వుండనిచ్చాం. ప్రేమాదోమా అని వెధవ్వేషాలు వేసేవాళ్ళకి మా ఇంట్లో స్థానంలేదు. మీరు వెంటనే ఇల్లు ఖాళీ చేసేయాలి. ఆఁ..." హుంకరిస్తున్నట్టే అంది.

మిత్రద్వయానికి పైప్రాణాలు పైనే పోయాయ్.

నడన్‌గా ఇల్లు ఖాళీ చేయడమంటే

మాటలా? అసలే బ్రహ్మచారుల్ని అంటరాని వాళ్లుగా ఎంచే పాపిష్ఠి హవుసొనర్లున్న పాడు సమాజమిది! అలాంటిది ఉన్నట్టుండి ఇంత తక్కువ అద్దెలో (పోనీ ఎక్కువ అద్దెలో నైనా) మరో ఇల్లు దొరకడం సాధ్యమా?. ఉరిశిక్ష వేసినట్టు మరీ ఇంత చిన్ని తప్పిదానికి అంత కఠినమైన శిక్ష విధించటం భావ్యమా? మిత్ర ద్వయం హృదయాలు బాధతో ఆక్రోశించాయి.

ముందుగా తేరుకున్న సుబ్బారావ్ బొంగు రుపోయిన గొంతుకతో ప్రార్థిస్తున్న ధోరణిలో అన్నాడు-

"అలా అంటే ఎలా చెప్పండీ? మేం పొరపాటుగా ప్రవర్తించటం ఇదే కదా మొదటిసారి? ఇకనుంచి జాగ్రత్తగా వుంటామని హామీ ఇస్తున్నాను- దయచేసి ఇల్లు ఖాళీ చేయమనొద్దు"

"అదేం కుదరదయ్యా! నువ్ హామీ ఇచ్చినంతమాత్రాన్న అతనా అమ్మాయెవర్నో ప్రేమించటం మానేస్తాడా ఏంటి? అయినా కాకపోయినా మీరు మాత్రం ఇల్లు ఖాళీ చేసి తీరాల్సిందే! బ్రహ్మచారులకి ఇల్లు అద్దెకివ్వడమేంటని మమ్మల్ని నలుగురూ నానా మాటలూ అంటున్నారు" నిర్ద్వందంగా అనేసింది పావని.

సుబ్బారావ్ మరికాస్సేపు ప్రాధేయపడి చూశాడుగాని ప్రయోజనం లేకపోయింది. కాకపోతే వెంటనే అనేపదాన్ని ఉపసంహరించుకుని ఆ స్థానాన్ని 'ఓ నెల్రోజుల్లోగా' అనే పదంతో భర్తీ చేసింది పావని.

పోనీలే అదే పదివేలనుకోవడం మినహా చేయగలిగిందేమీ లేకపోయింది మిత్రద్వయానికి.

వాళ్ళు ముఖాలు వేళ్లాడేసుకుని వాళ్ల పోర్షన్ వేపు వెళ్లిపోతుంటే వెనకనుండి శ్రీరామ్మూర్తొచ్చి "అన్నట్టిదిగోనోయ్ నీకేదో ఉత్తరమొచ్చింది" అంటూ సుబ్బారావ్ చేతికో కవరందించి వెళ్లిపోయాడు.

పొద్దున్నెప్పుడో వచ్చుంటుందది. పోస్ట్‌మేన్ వచ్చేసమయానికి మిత్రద్వయం ఇంట్లో వుండరు కదా?

అడ్రస్ చూడగానే పోల్చేసుకున్నాడు సుబ్బారావ్ అది ఊర్మిళ నుండి అని.

ఊర్మిళ నుండి ఉత్తరాలు రావడం సుబ్బారావుకి కొత్తేమీకాదు. అయినా సరే అతని హృదయం పులకించింది. భావి సతీమణి దగ్గర్నుండి ఉత్తరమొస్తే ఏ యువకుడి హృదయం మాత్రం పులకించకుండా వుంటుంది?

అయితే ఇంట్లోకెళ్లగానే సుబ్బారావ్ ఆ ఉత్తరాన్ని గభాల్న చింపేసి ఆత్రంగా చదివేసుకోలేదు.

ఊర్మిళనుండి వచ్చే ఉత్తరాన్ని ఎడాపెడా ఏ స్థితిలో పడితే ఆ స్థితిలో చదివేసుకోవడం అతనికి సుతరామూ ఇష్టముండదు. మనసులోని ఆత్రాన్ని అణచుకుంటూ అన్ని పనులూ అయ్యాక తీరుబాటుగా మంచమెక్కి ప్రశాంతంగా కూర్చుని అప్పుడు చదువుకోవడంలో అదోరకమైన అద్వితీయానందం కలుగుతూంటుందతనికి. అందుకే ఆ ఉత్తరాన్ని మడిచి జేబులోపెట్టేసుకున్నాడు.

తర్వాత గౌతమ్ వైపు కోపంగా చూస్తూ అన్నాడు-

"చూశావా నీ ప్రేమమైకం ఎంత అనర్థానికి దారితీసిందో? లక్షణమైన ఇల్లు. నీవల్ల ఖాళీ చేసేయాల్సొస్తోంది..."

గౌతమ్ తప్పుచేసినవాడిలా తల దించుకున్నాడే తప్ప, ఎదిరించి ఏమీ మాట్లాడలేదు. దాంతో సుబ్బారావుకి జాలేసింది.

"సర్లే...ఏంచేస్తాం, ఎలా జరగాలనుంటే అలాగే జరుగుతుంది. కానియ్..." అని సముదాయింపుగా అనేసి వంటపనికి ఉపక్రమించాడు.

భోజనాలయ్యాక గిన్నెలూ గట్రా సర్దేసి తీరుబాటుగా మంచమెక్కి ప్రశాంతంగా ఊర్మిళ ఉత్తరాన్ని ఓపెన్ చేసిన సుబ్బారావ్, కళ్ళు అక్షరాల వెంబడి పరుగులు తీయటం ప్రారంభించిన కాసేపటి తర్వాత 'ఇదెక్కడి గోలరా బాబూ... సరిగ్గా ఈ వెధవ ప్రేమలో పడ్డప్పుడే జరగాలా ఇలా?' అనుకున్నాడు జాలిగా గౌతమ్‌నుద్దేశించి.

దానిక్కారణమేవిటంటే, కాబోయే భార్యాభర్తలు చెప్పుకోవాల్సిన కబుర్లన్నీ అయిపోయాక ముగింపులో ఊర్మిళ ఓ విషయం రాసింది. శివరామకృష్ణయ్యగారి కూతురూ తన క్లాస్‌మే

టూ అయిన నీరజని గౌతమ్‌కి చెయ్యాలన్న ఉద్దేశ్యంతో గౌతమ్ తల్లిదండ్రులున్నట్టూ ఆ మేరకి సంప్రదింపులు జరిగినట్టు బహుశా త్వరలోనే పెళ్ళిచూపులు కూడా ఏర్పాటు కావచ్చున్నట్టూ రాసింది ఊర్మిళ.

చదవడం ముగించి ఉత్తరాన్ని దిండు కింద పెట్టేసి గౌతమ్ మంచం దగ్గరికెళ్లి అతనితో ఆ విషయం చెప్పాడు సుబ్బారావ్.

"ఇదెక్కడి గోలరా?" అన్నాడు గౌతమ్.

"నేను కూడా సరిగ్గా ఇలాగే అనుకున్నాను ఇందాక! కానీ ఒకమాట. ఆ నీరజ అనే అమ్మాయి అప్పుడప్పుడూ ఊర్మిళ వాళ్ళ ఇంటికొస్తూంటుంది. ఊర్మిళతో ఉన్నప్పుడు ఒకట్రెండుసార్లు చూశాన్నేను. నిజం చెప్పాలంటే ఊర్మిళ కంటే కూడా బావుంటుంది. నువ్ ఎగిరి గంతేసి మరీ చేసుకోవచ్చు..." మిత్రుడి ఆంతర్యం తెలిసుండి కూడా అతని రియాక్షన్ ఎలావుంటుందో కనిపెడదామని అన్నాడు సుబ్బారావ్.

ఊహించినదానికంటే ఎక్కువగానే విరుచుకుపడ్డాడు గౌతమ్.

"ఒరేయ్ అప్రాచ్యుడా! ఏంటిరా నీ ఉద్దేశ్యం? నాదంత చపలచిత్తం అనుకుంటున్నావా? ఇవ్వాళ అనూహ్యకి, రేపు నీరజకి ఎల్లుండి మరో వెంకమ్మకీ హృదయంలో చోటివ్వడానికి? అసలు ప్రేమ అనే పదానికి అర్థం తెలుసా నీకు? తెలిస్తే అనవ్. ఏ ఎండకా గొడుగు పట్టినట్టు వీలునుబట్టి మనసు మార్చేసుకోవడం కాదురా ప్రేమంటే! ఒకసారి ఒక వ్యక్తిపట్ల మనసులో ప్రేమంటూ జనించాక ఆ వ్యక్తిని జీవితభాగస్వామిని చేసుకోవటం కోసం అవసరమైతే ఎన్ని కష్టాలైనా పడగలగాలి. ఎన్ని త్యాగాలైనా చెయ్యగలిగుండాలి. అదీ అసలైన ప్రేమంటే. ఇప్పటికిప్పుడు మనసు మార్చేసుకోవడానికి నాదేం ఉత్తుత్తి ప్రేమ కాదు. నిజమైన ప్రేమ. నిఖార్సైన ప్రేమ! ఇదే మొదటిసారీ ఇదే ఆఖరుసారిగా కూడా చెబుతున్నా నా మనసులో అనూహ్య తప్ప మరెవరు ప్రవేశించడమనేది ఇంపాసిబుల్! ఒకవేళ ఏ కారణంవల్లయినా ఆమె నాది కాకుండా పోయినా నాడు జీవితాంతం ఇలా బ్రహ్మచారిగా వుండిపోతానే తప్ప, మనసు చంపుకొని మరో అమ్మాయి మెళ్ళో తాళి కట్టడం మాత్రం జరగదు... ఆఁ అంతే!" అన్నాడు ఆయాస పడిపోతూ.

సుబ్బారావుకి నవ్వాలో ఏడ్వాలో అర్థంకాలేదు. ప్రేమ గురించి మిత్రుడు చెప్పిన దాన్లో ఏదో పొరపాటుందనికాదు, కానీ ఆ ఆవేశం అదీ... అందునా రెండంటే రెండేరోజులక్రితం పరిచయమైన అమ్మాయి కోసం...

'ప్చ్! ఏమిటో వీడి పిచ్చి!' అని జాలికూడా కలిగింది సుబ్బారావ్‌కి.

"అహహ... నీ ప్రేమని తక్కువచేసి మాట్లాడటం నా ఉద్దేశం కాదురా! నీ ప్రేమ నిఖార్సైందే, కాదన్ను. కానీ ఆ అనూహ్య"

సుబ్బారావ్ పూర్తిగా చెప్పకముందే మరోమారు విరుచుకుపడ్డాడు గౌతమ్.

"అలాంటి డిస్కరేజింగ్ మాటలే వద్దంటున్నాను. తలక్రిందులుగా తపస్సు చేసయినా సరే ఆమె మనసు నా వైపు తిప్పుకోగలను, నా సత్తా ఏమిటో నాకు తెలుసు. కాబట్టి వద్దాక ఇలాంటి చచ్చు పుచ్చు మాటలు చెప్పబోకు. ఇదే నీకు లాస్ట్ అండ్ ఫైనల్ వార్నింగ్! ఇంకోసారి గనక ఇలా మాట్లాడేవంటే నిన్నేంచేస్తానో నాకే తెలియదు. ఆఁ..." అన్నాడు మునుపటిలాగే ఆయాసపడిపోతూ.

'సరే... ఖర్మ అఘోరించు' అని మనసులో అనుకుని... "అచ్చా... గుడ్‌నైట్" అనేసి చకచకా వెళ్ళి తన మంచమెక్కేశాడు సుబ్బారావ్.

ఎక్కడో ఓ గుడ్లగూబ. అరిచింది.

★ ★ ★

మర్నాడు ఆఫీసులో కాలుపెట్టగానే అప్పటికే తన సీట్‌లో కూర్చుని వున్న అనూహ్యని చూసి పలకరింపుగా నవ్వబోయాడు గౌతమ్.

ఆమె చూసీచూడనట్టుగా ముఖం తిప్పేసుకుంది.

కలుక్కుమంది గౌతమ్ హృదయం!

"చెక్కమొహంగా ఒరేయ్, ఎంత పనిచేశావురా గాడిదకొడకా!" అని లోలోన తిట్టుకున్నాడు రాంబాబుని. "నా అనూ హృదయాన్ని విరిచేసిన పాపాత్ముడా! పుట్టగతుల్లేకుండా పోతావొరేయ్" అని శపించేడు రాంబాబుని. అది కూడా మనసులోనే.

దగ్గరికెళ్ళి ఆమెతో మాట కలిపి అసలు విషయం చెప్పి అప్పటికప్పుడే తన నిర్దోషిత్వా న్ని నిరూపించేసుకోవాలనిపించింది గౌతమ్‌కి.

కానీ సెక్షన్‌లో వాళ్ళిద్దరేకాకుండా ఇంకా కొంతమంది వున్నందువల్ల అది తగిన సమయం కాదనిపించి మనసునదుపులో పె ట్టుకున్నాడు.

ఆమెతో ఏకాంతంగా మాట్లాడే అవకాశం చిక్కేవరకూ క్షణమొక యుగంగా గడిచింది గౌతమ్‌కి. అతను ఆశించి ఎదురు చూసినట్టు గానే లంచవర్లో ఒక్క అనుహ్యా తప్ప మిగతా అందరూ సెక్షన్ నుండి బైటికెళ్ళిపోయారు. అందరూ వెళ్తూంటే ఆమెతోపాటు తానొక్కడే వుండిపోవటం బావుండదు కాబట్టి గౌతమ్ కూడా వాళ్ళతోపాటు బైటికి దారితీశాడుగానీ, ఎలాగోలా అందరి కళ్ళూ కప్పీ ఓ అయిదు నిముషాల్లో మళ్ళీ సెక్షన్‌లోకొచ్చేశాడు.

అనూహ్యా తల దించుక్కూర్చుని ఎవరికో గాని ఓ ఇన్‌లాండ్ లెటర్ రాస్తోంది.

నెమ్మదిగా ఆమెని సమీపించి...

"ఎక్స్‌క్యూజ్‌మీ..." అన్నాడు గౌతమ్.

అనూహ్యా తల పైకిలేపి ఏమిటన్నట్టు చూ సిందతనివేపు. ఆ చూపులో ఏదో తిరస్కార భావం.

"నేను ...నేను... మీతో రెండు ముక్కలు మాట్లాడొచ్చా?" గుటకలు మింగుతూ అన్నా డు. ఎందుకోగాని ధైర్యంగా మాట్లాడ్డానికి ధై ర్యం చాల్లేదతనికి.

ఏమనుకుందో మరి, "చెప్పండి" అంది అనూహ్యా ముఖంలో ఏ భావమూ వ్యక్తంచేయ కుండా.

"నిన్న ఆ చెక్కమొహంగాడు నా గురించి వాగిందంతా అబద్ధమండీ! ఉత్తిదే, నేను మీకు ఏ నిక్‌నేమూ పెట్టలేదు" మెలికలు తిరిగిపో తూ అన్నాడు గౌతమ్. అంతలోనే ప్రేమించిన ఆడదాని ముందు స్ట్రెయిట్‌గా నిలబడాలే తప్ప మెలికలు తిరిగి పోకూడదని ఎక్కడో చదివినట్టు గుర్తుకొచ్చి స్ట్రెయిట్‌గా నిలబడ్డా డు.

అనూహ్యా కళ్ళు చికిలిస్తూ అదోలా చూ సింది.

"చెక్కమొహంగాడా?... అంటే?"

"అదేనండీ... నిన్న నా గురించి అవాకులూ చవాకులూ పేలేడే... ఆ రాంబాబుగాడు" నమ్రతగా చెప్పాడు గౌతమ్.

"అయ్ సీ ఆయనా? ఆయన మీరు నాకు నిక్‌నేమ్ పెట్టినట్టు నాతో ఏంచెప్పలేదే?"

"మీతో చెప్పకపోయినా మీరు అలా అనుకు నేలా సెక్షన్‌లో అందరికీ వినిపించేలా చెప్పేడు కదండీ?"

"అలాగా...మీరు చెప్పేదాకా నాకా విష యమే తెలియదు. ఏదో నా ధ్యానలో నే నుంటానే తప్ప నేను వేరే వాళ్ల మాటల్ని వినిపించుకోను"

"నిజంగానండీ?" సంతోషంతో కంఠం వణి కిపోతూండగా అడిగాడు- "నిజంగా మీరు చెక్కమొహంగాడు కూసిన కారు కూతలేవీ వినలేదా?!"

లేదన్నట్టు అడ్డంగా తలాడించింది అనూ హ్యా.

అంతే! ఆ మరుక్షణం గౌతమ్ గుండెల్లో ఆనందం మయూరమై పురివిప్పేసింది!

"థాంక్‌గాడ్" అనుకోబోయి ఆ మాట పైకే అనేశాడు పొరపాట్న.

అనూహ్యా తెలివితక్కువదేంకాదు. చాలా చాలా అనుమానాస్పదంగా వున్న అతని ప్రవ ర్తన వెనుకా మాట తీరు వెనుకా 'ఏదో' వుందని ఇట్టే గ్రహించేసింది.

"అయితే నిజంగా మీరెవ్వరికీ నిక్‌నేమ్స్ పెట్టరా?" వేసిందొక డొంకతిరుగుడు బాణం.

అది డొంకతిరుగుడు బాణమని గౌతమ్‌కేం తెలుసు? "ఛఛ... నేనలాంటివాణ్ణి కాదండీ! నిక్‌నేమ్స్ గట్రా పెట్టి ఎదుటి వ్యక్తుల్ని బాధపెట్టే మనస్తత్వం కాదు నాది. కాకపోతే ఆ చెక్కమొహంగాడికి నేనంటే ఇష్టం లేదు కాబ ట్టి మీలో బాడ్ ఒపీనియన్ క్రియేట్ చేయడాని కి అలా వాగేడంతే!" అన్నాడు లోలోన చంక లు గుద్దుకుంటూ. అనూహ్యా ముఖం అతని మాటల్ని నమ్ముతున్నట్టుగానే వుండటంవల్ల అతనలా లోలోన చంకలు గుద్దుకున్నాడు. అనూహ్యా అవులిస్తే పేగులు లెక్కపెట్టగలిగే రకం అని తెలీదు పాపం.



"ఇప్పటికిది మూడోసారో నాలుగోసారో మీరా యన్ని చెక్కమొహంగాడనటం. భలే ఫన్నీగా వుందా పేరు. ఆ నిక్‌నేమ్ మీరే పెట్టేరా ఆయనకి? నా మట్టుకు నాకూ అలాగే అని పించింది సుమండీ ఆయన్ని చూడగానే... ఇదేంటీయన ఇలా ఉన్నాడు చెక్కమొహం వేస్కుని అనుకున్నాను. సరిగ్గా అదేమాట ఇప్పుడు మీ నోటిగుండా కూడా వింటున్నాను. మొత్తానికి భలే తమాషాగా వుంది కదూ?" అనడిగింది అనూహ్యా మెత్తగా నవ్వుతూ.

మెత్తని ఆ నవ్వుకి చిత్తైపోయిన గౌతమ్ మెదడు మత్తెక్కిపోయింది.

'సో... నావీ, నా డాళింగ్‌వీ ఒకటే భావాలన్న మాట' అనుకున్నాడే తప్ప- ఆమె తనని ట్రాప్ చేస్తోందని ఊహించలేకపోయాడు. "అవు నండీ నేనే పెట్టేను ఆ వెధవకి ఆ నిక్‌నేము. అది మీక్కూడా నచ్చడం నిజంగా నా అదృష్టం!" అంటూ గర్వంగా నవ్వేడు.

"షటప్... ఇందాకేగా అన్నారు మీరు నిక్‌నే మ్స్ పెట్టే అలవాటే లేదని. మళ్ళీ ఇంతలోనే ప్లేటు మారుస్తున్నారే? దీన్నిబట్టి మీరెంత అబద్ధాలకోరో అర్థమవుతోంది. అంటే ఆ రాంబాబుగారు చెప్పింది కరెక్టే అయ్యుంటుంది. మీరు నాకేదో నిక్‌నేమ్ పెట్టే వుంటారు. మర్యాదగా చెప్పేయండి నాకేం నిక్‌నేమ్ పెట్టేరో" అనూహ్యా కోపంగా చూస్తూ అరిచినట్టుగా అడిగింది.

మత్తెక్కిపోయిన గౌతమ్ మెదడు దిమ్మతిరి గిపోయిందీసారి. నెత్తిమీద ఎవరో ఇనుప స మ్మెటతో బాదినట్టుగా...కళ్ళు బైర్లు కమ్ముతున్న ట్టుగా గుండెకాయని కొండచిలువ మింగుతు న్నట్టుగా ఏమిటోగా ఏమిటేమిటోగా అనిపించే సింది.

"ఏంటలా బిగిసిపోయారు?" ఉరిమి చూ స్తూ అడిగింది- "మీరిహ బుకాయించినా లాభం లేదులేగాని నాకేం పేరు పెట్టేరో చెప్పే సేయండి!"

"ఒట్టండీ... నేను మిమ్మల్నేవీ అనలేదు. మీకే పేరూ పెట్టలేదు"

"నాన్సెన్స్... మీరేమీ అనుండకపోతే ఆ రాంబాబుగారెందుకలా అంటారు? చాటుమా టుగా పేర్లుపెట్టి కులకడం కాదు. మీకు ధైర్యముంటే అదేదో నా ఎదురుగా అనండీ!" అనూహ్యా విసురుగా లేచి నిలబడింది.

ఆ ఫోర్సూ అదీ చూస్తుంటే బ్రైప్‌మిషన్ని లేపి తన నెత్తికేసి కొడ్తుందేమోననిపించింది గౌతమ్‌కి.

భయం భయంగా రెండడుగులు వెనక్కి వేసి- "సారీ అనూహ్యాగారూ... మీరు నన్ను అపార్థంచేస్కుంటున్నారే తప్ప నేను మిమ్మల్నే మీ అనలేదు" అన్నాడు నమ్మకంగా పలుకు తూ.

"లేదులేదు... మీరేదో అన్నారు" ప్రెస్ చేస్తూ అంది అనూహ్యా.

"అన్నమాట నిజమేగాని అది నిక్‌నేమ్ మాత్రం కాదనూహ్యాగారూ!" ఏమైనా కానీ నిజమే చెప్పేద్దాం అనుకున్న గౌతమ్ అసలు విషయం కక్కేశాడు. "ఆ రాంబాబుతో మీర చ్చం అప్సరసలావున్నారని అన్నాను. అది మీ అందానికి కాంప్లిమెంటే తప్ప నిక్‌నేమ్ కాదు"

అంతే... అనూహ్యా తోక తొక్కిన తాచుపామై పోయింది.

ఆమె కళ్ళ వెంబడి అగ్నిబాణాలు కురి శాయ్!

"నేను అప్సరసలా వుంటే మీకెందుకూ ఆసిరమ్మలా వుంటే మీకెందుకు? అది నిక్ నేమా కాంప్లిమెంటా అన్నది నాకనవసరం. నేను లేనప్పుడు నా గురించి మాట్లాడాల్సిన అవసరం మీకేమొచ్చిందనలు?" అని ప్రా రంభించి కడిగేసిందతన్ని.

కుడితిలోపడ్డ ఎలుకలా గిజగిజా కొట్టుకో వడం తప్ప ఏమీ చేయలేని పరిస్థితి. తన స్థితికి తానే జాలిపడుతూ అష్టాంకర్లూ తిరుగు తూ నానా అవస్థలూ పడ్డాడే తప్ప నోరు మెదపలేకపోయాడు గౌతమ్.

"అయిపోయిందిరా గౌతమ్ అయిపో యింది అంతా అయిపోయింది. అమృత భాండంలాంటి నీ అనూహ్యా హృదయంలో విషబిందువు పడిపోయింది. నువ్వింక ఆమె ప్రేమని పొందగలగటం అసాధ్యం- దు ర్లభం..." మనసు మూలుగుతుంటే అతనిలోని దమనులూ సిరలూ రక్తానికి బదులుగా ఆవేద నని తమలో ప్రవహింపజేసుకోసాగాయ్!

తిట్టిన తిట్టు తిట్టకుండా ఓ అయిదు నిముషాలపాటు ఏకబిగిన తిట్టిపోసి "వెళ్ళండిక్కణ్ణించి. ఇంకోసారి గనక నాతో మాట్లాడ్డానికి ప్రయత్నించినా నా జోలికొచ్చినా మర్యాదగా వుండదు అం..." అని సిన్సియర్‌గా వార్నింగిచ్చి ఛివాల్న సీట్లోంచి పైకి లేచి చరచరా బైటికెళ్ళిపోయింది అనూహ్య.

గౌతమ్‌కి దేవదాసులోని "అంతా భ్రాంతియేనా?" అనే పాట గుర్తుకొచ్చింది.

"పూర్‌ఫెలో..." అతని మనసే అతన్ని యెద్దేవా చేసింది. తల వేళ్ళాడేస్కుని కదుల్తూన్న శవంలా నడిచివెళ్ళి తన సీట్లో కూర్చున్నాడు.

ఆ కుర్చీలో పల్లేరుకాయలేం లేకపోయినప్పటికీ అతనికి మాత్రం వున్నట్టే అనిపించింది.

మనసు నిప్పుల కుంపటైపోయినప్పుడు అలా అనిపించడంలో వింతేముందీ?

★ ★ ★

"నే చెప్పేనా? తొందర పడొద్దురా సమయం కనిపెట్టి చెప్పరా అని! నా మాట పెడచెవిన పెట్టినందుకు నీకలాంటి శాస్తి జరగాల్సిందేలే!" అన్నాడు సుబ్బారావ్ ఆ సాయంత్రం గౌతమ్ విషయం చెప్పి బావురుమని ఏడుస్తూంటే.

అన్నాడంటే అనడామరి? హితోపదేశాన్ని లెక్కచేయని వారి మీద ఎవరికైనా సరే కోపం రావటం సహజం!

అసలే బాధలో వున్నవాణ్ణి అలాంటి మాటలతో రెచ్చగొడితే బాధలో వున్నవాడు ఇరిటేట్ అయిపోవటం కూడా సహజమే! గౌతమ్ కూడా ఇరిటేట్ అయిపోయాడు.

"నోర్ముయ్...దయారహిత కఠిన పాపాత్ముడా! నా అనూ దృష్టిలో నేనొక అకతాయినీ, పరమనికృష్టుణ్ణీ, నీచుణ్ణీ అయిపోయానని నేను బాధ పడ్తుంటే అలాంటి శాస్తి జరగాల్సిందే అంటావా? స్నేహం అనే పదానికే అపవిత్రత తెచ్చిపెడుతున్న అప్రాచ్యపు నన్నాసీ!"

ఎడంకాల్తో నేలను తన్నుతూ కుడిచేతిని గాల్లో క్రిందికీ మీదికీ తిప్పేస్తూ గౌతమ్ ఉద్రేకంతో వూగిపోతుంటే సుబ్బారావ్ హృదయం జాలితో నిండిపోయింది.

దానిక్కారణం, మిత్రుని గుండెలో ఎన్ని అగ్నిపర్వతాలు బ్రద్దలవుతూన్నాయో అతను గ్రహించగలగటం!

"సారీరా... అయామ్ వెరీ వెరీ సారీ!" అన్నాడు నిండు మనసుతో.

"సారీ ఏంటి సారీ? గుండెలో స్క్రూ డ్రైవర్ గుచ్చి మెలితిప్పినట్టు అంత మాట అనేసి ఇప్పుడు సారీ అనేస్తే సరిపోతుందా?" మూతి బిగించి అప్రసన్నంగా చూశాడు గౌతమ్. "వీలైతే నన్ను ఓదార్చు లేకపోతే నా ఖర్మకి నన్నిలా ఏడవనీ"

మనసు ఎంతగా వికలమైపోకపోతే ఈ వెధవ ఇంత పిచ్చిగా వాగుతాడు? అనిపించి సుబ్బారావ్ హృదయం మరోసారి జాలితో నిండిపోయింది.

దాంతో అతను గౌతమ్ భుజంమీద ఆప్యాయంగా చేయివేసి లాలనగా అన్నాడు-

"నీ ఖర్మానికి నిన్నొదిలేసేటంత కర్కోటకం వెధవన్రా నేను? బాధపడకు! ఏ మనిషికి ఏ కష్టాలూ కలతలూ శాశ్వతం కావు. అపార్థాలు తొలిగిపోయి అనూహ్య నిన్నర్థం చేసుకునేరోజు త్వరలోనే వస్తుంది"

"దీన్నే అంటారు ఖర్మానికి ఒదిలేయటం అని. లేకపోతే ఏంటి? ఇంత జరిగేక అపార్థాలు వాటంతటవే తొలిగిపోతాయా? మన సైడు నుంచి మనమేదో ఒక ప్రయత్నం చేయకపోతే ఎలా?"

"అవునవును... చెయ్యాలి"

"దటీజ్ వాట్ అయ్ వాంట్ ఫ్రమ్‌యు. చెప్పు... వక్రించిన నా పరిస్థితి తిరిగి చక్కబడాలీ అంటే నేనేం చేయాలి? నన్నేం చేయమంటావ్?" గౌతమ్ ఊర్కోలేక సుబ్బారావ్‌ని భుజాలు పట్టుక్కుదిపేశాడు.

"అదుగో ఆ తొందరపాటే పనికిరాదు" మందలింపుగా అన్నాడు సుబ్బారావ్- "బీ క్వయిట్ ఏదో ఒకటి ఆలోచిద్దాంలే!"

పైకలా అన్నాడన్నమాటేగాని మనసులో మాత్రం అతనికి కొంచెం కూడా నమ్మకం ఏర్పడలేదు పరిస్థితి చక్కబడుతుందని.

'ఇంత జరిగాక ఈ తింగరాయి వెధవని ఇంకా ఆమె ప్రేమించడవేమిటి నాబొంద?' అని చాలా ఖచ్చితంగా అనిపించింది. కానైతే మిత్రుణ్ణి నొప్పించటం దేనికని పైకి తేలలేదు.

★ ★ ★

ప్రతి ప్రేమకథలోనూ ఓ విలనువుండి తీరాలని రూలేం లేకపోయినప్పటికీ, అనలామాట కొస్తే గౌతమ్ ప్రేమ- ఒన్‌సైడ్ ప్రేమ- ఇంకా స్టార్టింగ్ పాయింట్‌లోనే వున్నప్పటికీ ఏదో కొంప లంటుకుపోయినట్టు ఆ మర్నాడే రంగ ప్రవేశం చేసేసేడొక విలన్.

ఆ విధంబెట్టిదనిన...

ఉదయం పదకొండు గంటల వేళప్పుడు... ఆ ఆఫీసులో అందరూ ఎవరి పనుల్లో వాళ్ళు తలమునకలై వున్నప్పుడు గౌతమ్ మాత్రం తను కూడా అందరిలాగే పనిలో తలమునకలై వున్నట్టు నటిస్తూ వేదనాభరిత హృదయంతో అల్లమటిస్తూ వున్నప్పుడు...

కరుగుతున్న తారు డబ్బాలో ముంచి లేపిన వెదురుబద్దలా వున్న ఆ వ్యక్తి ఆ ఆఫీసులో కాలుపెట్టాడు. అంటే అతను అంత నల్లగానూ అంత సన్నగానూ వుంటాడని అర్థం అన్నమాట!

"గుడ్‌మార్నింగ్ ఎవ్విరీబడీ!" నిత్య తాంబూల సేవనంవల్ల గారపట్టిన పారపళ్ళను బైటేస్తూ అందర్నీ వుద్దేశించి విష్ చేసిన అతను అనూహ్యని చూసి అదిరిపోయాడు.

అదిరిపోయేడంటే ఇక్కడ బెదిరిపోయాడని కాదర్థం.

అయ్యబాబోయ్ ఎంతందం ఎంతందం?! అని ఆమె అందానికి అదిరిపోయాడన్న మాట!

అనూహ్యని తొలిసారిగా చూసిన ఏ మగవాడైనా ఆమె వైపు నుంచి చూపు తిప్పుకోలేకపోవటం చాలా చాలా సహజం! ఒకవేళ ఎవడైనా అలా తిప్పుకో గలిగేడూ అంటే వాడు వెండిపూ తగల మాత్రలు మింగితీరాల్సిన దుస్థితిలో వున్నట్టే లెక్క.

అంచేత ఏ క్షణాన్నైతే అనూహ్యని చూసేడో ఆ క్షణాన్నే అతను మతిపోగొట్టుకున్నవాడై ఆమెకేసి అలాగే గుడ్లప్పగించి చూస్తూవుండిపోయాడు.

పలకరింపుగా నవ్విన రాంబాబుని గానీ, 'హలో' అన్న పావనమూర్తినిగానీ, 'బాగున్నారా?' అని పలకరించిన ముసలి అకౌంటెంట్ నిత్యానందాన్నిగానీ అసలే మాత్రం పట్టించుకోకుండా ఆశగా ఆబగా అతనామెకేసి అలా చూస్తూవుండి పోవడం గౌతమ్ హృదయాన్ని గిజగిజలాడిపోయేలా చేసింది.

అవునుమరి. తను ప్రేమించిన యువతి కేసి మరో మగాడలా చూస్తూంటే ఎవరు మాత్రం ఓర్చుకోగలరు?

కానీ ఓర్చుకోక తప్పని పరిస్థితి...

'ఎందుకురా నా రాణి కేసి అలా చూస్తావ్?' అంటూ ఎగిరి దూకి, 'డిష్యూం డిష్యూం' అని ఫైట్ చేయడానికి అవతలి వ్యక్తేం అల్లాటప్పా గోంగూరగాడుకాదు. అతను సాక్షాత్తూ గౌతమ్ వాళ్ళ మేనేజర్కి బామ్మర్ది. అంటే భార్యతమ్ముడు.

అతని పేరు త్రిలోక్ అనిన్నూ అతని స్వభావం అంతమంచిది కాదనిన్నూ ఆ ఆఫీసుకి పాతవాడే అయిన అతన్ని గురించి అక్కడున్న అందరికీ తెలుసు, ఒక్క అనూహ్యకి తప్ప.

"ఏంటి త్రిలోక్ గారూ ఇలా వచ్చారు? ఏంటలా నించుండిపోయారు. సార్ ఛాంబర్ లోనేవున్నారు వెళ్లండి" తన సీట్లోంచి లేచి అతణ్ణి సమీపించి చెప్పాడు పావనమూర్తి.

కళ్ళతో అనూహ్య అందాన్ని జుర్రేస్తూ నిలబడ్డ అతను- అనగా త్రిలోక్- ఆ మాటలతో ఈ లోకంలోకొస్తూ 'అలాగే అలాగే' అన్నట్టు తల పంకించి వడివడిగా మేనేజర్ ఛాంబర్‌లోకి సాగిపోయాడు.

ఇంటి దగ్గర్నుండి మేనేజర్‌గారి భార్య ఏదైనా వర్తమానం పంపినపుడల్లా అతనిలా ఆఫీసుకి వచ్చి పోతూండటం తరుచుగా జరుగుతూనే వుంటుంది. కాబట్టందులో ప్రత్యేకతేమీ లేదు. ఎటొచ్చీ అతని దృష్టి అనూహ్యమీద పడటం ఒక్కటే ఇక్కడ నోటబుల్ పాయింటు.

'చూసేడంతేగా' అని తేలిగ్గా కొట్టి పారేయడానికి వీల్లేని సంగతది. ఎందుకయ్యా అంటే అతనేం సాదా సీదా దుర్మార్గుడుకాదు. ముఖ్యంగా ఆడవాళ్ల విషయంలో.





అతని స్త్రీలోలత్వంగురించి ప్రచారంలోవున్న అనేకానేక కథల ప్రకారం సింపుల్‌గా అతనొక కీచకుడు, దట్సాల్!

అందుకే అతని ప్రస్తుతపు రాకని 'విలన్ రంగప్రవేశం'గా పేర్కొవడం జరిగింది.

కన్నుపడ్డ ఆడదాన్ని ఒక పట్టాన్న ఒదిలే రకం కాదు కాబట్టి ముందుముందు అతను విలనై కూర్చుంటాడన్నది సందేహానికి అతీత మైన నిజం.



"ఆ నీచుడి గురించి చాలా చాలా చెడ్డగా చెప్పుకుంటార్రా అంతా! పోయిపోయి ఆ దుర్మార్గుడి కళ్ళలో పడింది నా అనూహ్య. నా కెందుకో భయంగావుంది..." అలవాటు ప్రకారం మిత్రుడితో విషయం చెప్పి వాపోయాడు గౌతమ్.

"వాడి మొహం" తేలిగ్గా అనేశాడు సుబ్బారావ్.

"అదిగో పులంటే ఇదిగో తోకనడం మనుమలందరికీ బాగా అలవాటు. వాడి ప్రవర్తన మంచిది కాకపోవడం నిజమైతే కావచ్చుగాని కంటికి నచ్చిన ఆడదాన్నల్లా చెరపట్టగలగడానికి వాడేమైనా రాక్షసుడా? ఇదేమైనా పురాణకాలమా?"

"వాడి సంగతి నీకు తెలియదురా! రెండు మూడు రేపులు కూడా చేసేట్ట?" గౌతమ్ గుండె మీద చెయ్యేసుకుంటూ భయంగా అన్నాడు.

"ఎవరు చూసేర్ట?" సుబ్బారావ్ వ్యంగ్యంగా అడిగాడు.

"రేపులు చూసేలా చేస్తారేంటి ఎవరైనా? నిప్పులేందే పొగరాదు కదా?"

"ఒకవేళ చేసేడే అనుకుందాం. అయితే ఇపుడేంటంటావ్? వాడు నీ అనూహ్య కేదయినా అపకారం తల పెడ్తాడేమోనని నీ భయం? అంతేనా?"

గౌతమ్ నిలువుగా తలాడించాడు అంతే అన్నట్టు.

"ఛీ నోర్ముయ్!" గసిరిపారేశాడు సుబ్బారావ్. "గాలివేస్తే ఎగిరిపోయేటంత సన్నగా వుంటాడని ఒక పక్క నువ్వే చెబుతున్నావ్, మళ్లీ వాడంటే భయపడి చస్తున్నావ్. సిగ్గులేదూ అలాంటి అర్భకం వెధవని తల్చుకుని భయపడ్డానికి? నిజంగా వాడే గనక అనూహ్య జోలికి వెళ్లటం జరిగితే నిజానికది నీకే మంచిది..."

"అంటే?" అన్నట్టుగా కళ్లెగరేసాడు గౌతమ్.

"వాడనూహ్య విషయంలో ఏమైనా అసభ్యంగా ప్రవర్తించాడని తెలిసిన్నాడు నువ్ హీరోలా చెలరేగిపోయి మెత్తగా వాణ్ణి తన్నొదిలిపెట్టు. ఆ దెబ్బతో ఆమెకి నువ్వంటే వున్న దురభిప్రాయం తొలగిపోయి నిన్ను గాఢంగా ప్రేమించేస్తుంది." చెప్పాడు సుబ్బారావ్.

ఇదేదో బాగానే వున్నట్టుందే అనిపించింది గాని మళ్ళీ అంతలోనే బాగోలేనట్టు కూడా అనిపించింది గౌతమ్‌కి.

"ఎలా వుంది నా అయిడియా?"

"నా మొహంలావుంది" అనేశాడు క్లుప్తంగా.

ఇద్దరిగిన కాసేపటికి డుంబూ వచ్చాడక్కడికి.

అంటే మిత్రద్వయం మధ్య పై సంభాషణంతా వాళ్ళింట్లోనే జరిగిందన్నమాట.

"ఏంటి డుంబూ?" సుబ్బారావ్ కాస్త భయంగా అడిగాడు.

"మా అమ్మ మీతో చెప్పమంది..."

"ఏమని?"

"మిమ్మల్ని తొందరగా వేరే ఇల్లు చూస్కోమని"

"చూస్కుంటాం లేవోయ్..." ఒళ్ళుమండిన



సుబ్బారావ్ ఎర్రగా చూస్తూ అన్నాడు. "రోజు రోజుకీ వచ్చి గుర్తు చేయాల్సిన అవసరం లేదని చెప్పు మీ అమ్మతో. మేమేవంత సిగ్గులేని వాళ్ళం కాదు- పొమ్మని ఒకసారి చెప్పేక్కూడా ఇంకా ఇక్కడే తిష్ఠేసుకూర్చోవడానికి. వేరే ఇల్లు దొరగ్గానే ఖాళీ చేసేస్తాం అని చెప్పు..."

"నా మీద అరుస్తారేం? ఆ అరిచేదేదో మా అమ్మ దగ్గిర అరవండి" అనేసి బైటికి దౌడు తీశాడు డుంబూ.

"ఎప్పుడూ శాంతంగా వుండేవాడివి నీకేమొచ్చిందిరా ఇవ్వాళ? ఆ వెధవ వెళ్లి మళ్లీ ఏదైనా అంటిస్తాడో ఏంపాడో! కాస్త మెల్లిగా చెప్పుండాల్సింది" గౌతమ్ రవంత ఆందోళనగా అన్నాడు.

"గాడిద గుడ్డులే" అనేశాడు సుబ్బారావ్.

కానీ అదంత తేలిగ్గా ఏం పోలేదు. ఓ వది నిముషాల తర్వాత పావని తనే అక్కడికొచ్చే యటం, మిత్రద్వయాన్ని నానా మాటలూ అని పోవటం జరిగిపోయింది.

అందంటే అనదా మరి?

కుర్రాడితో ఏదో కబురు వంపిస్తే మరీ అంత పొగరు మోత్తనంగానా సమాధానం చెప్పటం?



అయితే దానికి సుబ్బారావ్‌గానీ గౌతమ్ గానీ పెద్దగా ఏం బాధ పడలేదు. ఇవ్వాళ కాకపోతే రేపయినా ఎలాగూ ఖాళీ చేసేయాలి తప్పదు. అలాంటప్పుడు ఆవిడతో ఇంకా మంచిగా వుండాల్సిన పనేమిటి? నిండా ముని గిన వాడికి చలేమిటి? అన్న ఉదాశీనత బహు శా దానిక్కారణం కావచ్చు.

★ ★ ★

ఓ వారం రోజులు గడిచేయి.

ఈ ఏడు రోజుల్లో గౌతమ్ అనూహ్యని తన వైపు తిప్పుకోవడానికి, అంటే ఆమెలో తన పట్ల ఏర్పడిన చెడు అభిప్రాయాన్ని చెరిపేయడాని కి మళ్ళీ ఏ ప్రయత్నమూ చేయలేదు. అలా గని అతనిలో ఆమె మీద ఇంట్రస్ట్ తగ్గిపో యిందని కాదు. ఈసారి చేసే ప్రయత్నం బెడిసికొట్టనిదై వుండాలన్న పట్టుదలతో గట్టి ఉపాయాలు ఆలోచిస్తూ కూర్చున్నాడన్నమాట!

ఉపాయాలైతే తట్టడం లేదుగాని అనూహ్యా మీద ప్రేమ మాత్రం పెరిగిపోతూనేవుంది భూ లోకంలో పాపంలా. పాపం ఆ సంగతి అనూహ్యా కేం తెలుసు? అందుకే పాపం అతనికేసి కాస్త ప్రసన్నంగా చూసిన పాపాన్నయినా పోలేదామె ఈ వారం రోజుల్లో.

గౌతమ్ సుబ్బారావ్ దగ్గర బాధపడి పోవడం, సుబ్బారావ్ ఆమాటా ఈ మాటా చెప్పి అతన్ని ఓదార్చటం మామూలుగా జరిగి పోతూనే వుంది.

ఎనిమిదో నాడు గౌతమ్ అదృష్టం పండి ఆ సంఘటన జరిగింది.

అనూహ్యా మీద కన్నువేసిన త్రిలోక్ ఏదో అర్జంటు పని మీద వేరే వూరికి వెళ్లటం వల్ల ఆ వారం రోజులూ ఎలాగోలా ఓపిక పట్టేడు గాని, తిరిగి ఆ వూళ్ళో కాలు పెట్టేక మాత్రం ఒక్క క్షణం కూడా ఓర్చుకో లేకపోయాడు.

అక్కగారి నుండి బావగారికి ఏ వర్తమాన మూ లేకపోయినప్పటికీ కేవలం అనూహ్యని చూడ్డానికి మాత్రమే ఆరోజు ఆఫీసులో కాలుపె ట్టిన త్రిలోక్- ముందుగానే సిద్ధంచేసి జేబులో వుంచుకున్న ఓ ప్రేమలేఖని నేరుగా వెళ్ళి అనూహ్యా చేతిలో పెట్టేశాడు- "కాస్త ఈ అప్లికే షన్ ఫార్మ్‌ని టైప్ చేసి ఇస్తారా?" అంటూ.

అందరూ నిజమే గావల్నూ ఏదో అప్లికేషన్ ఫారమ్ గావల్నూ అనుకున్నారు.

ఎవరెక్స్‌పెక్ట్ చేస్తారు, అంతమంది చూ స్తూండగా ఆ భ్రష్టుడామెకి ప్రేమలేఖ అందించగలుగుతాడని?

అనూహ్యా మట్టుకు... అనూహ్యా కూడా నిజమే గావల్ననుకుంటూ ఆ కాగితాన్ని మడ తలు విప్పింది.

"డియర్ అనూహ్యా గారూ!

వారంరోజుల క్రితం తొలిసారిగా మిమ్మల్ని ఆఫీసులో చూసిన నాడే నా హృదయాన్ని మీకర్పించేశాను. కానీ చాలా అత్యవసరం పని మీద వేరే వూరికి వెళ్లటం వల్ల ఇన్నాళ్లూ ఆగాను. లేకుంటే ఈ అప్లికేషన్ ఫార్మ్‌ని మీకే నాడో సమర్పించుకుని వుండేవాణ్ణి!

అనూహ్యా... నేను మిమ్మల్ని ప్రాణంకన్నా మిన్నగా ప్రేమిస్తున్నాను. దయచేసి నాకు ప్రేమ భిక్ష ప్రసాదించరూ?

అన్నట్టు నేనెవర్నో తెలుసుకదా? మీ మేనే జర్‌గారి బామ్మర్దిని. దీన్ని చదివి మీరుగనక ఏమన్నా రాద్ధాంతంచేస్తే పర్యవసానం చాలా తీవ్రంగా వుంటుంది. అసలే పాపం మీరు కొత్తగా ఈ ఉద్యోగంలో చేరేరు. మా బావతో చెప్పి మీ ఉద్యోగం పీకించేసే ననుకోండి. పాపం అప్పుడు మీరు చాలా అవస్థ పడతారు.

కాబట్టి... నా ప్రేమని అంగీకరించండి. అంగీకరిస్తారు కదూ?

మీ గ్రీన్‌సిగ్నల్ కోసం ఎదురుచూసే...

మీ

త్రిలోక్

కళ్ళు అక్షరాల వెంబడి పరుగులేస్తుండ గానే అనూహ్యా ముఖం కందగడ్డలా అయిపో యింది.

కళ్ళలో రక్తపు జీరలు... కోపంతో అదురుతో న్న ముక్కూ, పెదవులూ... ఉద్రేకంతో బిగుసు కుపోయిన ఎడమచేతి పిడికిలి... ఆమెలో ఆగ్రహం నుదులు తిరుగుతోందని చాలా స్ప ష్టంగానే గ్రహించగలిగాడు త్రిలోక్.

అయినా అతనేం బెదిరిపోలేదు. 'ఎంత యినా వాళ్ల బాస్ బామ్మర్దిని కదా, నన్నేంచేస్తుం దిలే? అందునా లెటర్‌లో స్పష్టంగా రాశాను





కదా దాని పర్యవసానం ఎలా వుంటుందో!' అన్న ధీమాయే దానిక్కారణం.

అయితే అనూహ్యా అతనూహించినంత బెదురుగొడ్డేం కాదు. టెన్త్ క్లాస్‌లో కాలుపెట్టింది లగాయితు ఇప్పటివరకూ అలాంటి రోమియో వెధవల్ని ఆమె ముఖం మీద జీరాడుతోన్న జుట్టు పాయలో ఎన్ని వెంట్రుకలున్నాయో అంత మందిని చూసిందామె. అట్టి దుర్మ దాంధులందరూ ఆమె చేత ఏదో ఒక రకంగా గుణపాఠం చెప్పించుకున్నవారే!

అనూహ్యా చేతిలోని కాగితాన్ని నేల మీదకు జారవిడిచి దానికోసం అన్నట్టుగా క్రిందికి వంగింది.

నేలమీద పడ్డ ఉత్తరాన్ని పదిలంగా ఏరు కొంటోంది అంటే ఫర్వాలేదు పిట్ట మెత్తబడ్డట్టే అనుకున్నాడు త్రిలోక్ ఆశగా.

కానీ క్రిందకొంగిన అనూహ్యా చేతిలోకి తీసు కున్నది నేలమీదున్న ఆ కాగితాన్ని కాదు, తన ఎడమ కాలికున్న చెప్పుని.

అంతే...

రెండంటే రెండే క్షణాల తర్వాత త్రిలోక్ కుడి చెంప మైనూర్ బజ్జీలా పొంగిపోయింది అనూహ్యా కొట్టిన చెప్పుదెబ్బకి.

ఆమె అంతపని చేస్తుందని వూహించని త్రిలోక్ ఖిన్నుడయ్యాడు.

ఆ సంఘటనకి అక్కడున్న అందరూ దిగ్భ్రాంతులయ్యారు. అవును మరి! అనుకోని సంఘటనాయె!

అందరికన్నా ముందుగా తేరుకున్న గౌతమ్ పడుతూలేస్తూ పరుగుతీశాడు అనూహ్యా దగ్గర కి.

"ఏమైందండీ?... ఏమైందండీ?" అడిగేడు కంగారుపడ్తూ.

"ఈ స్కౌండ్రల్... ఈ డర్టీరోగ్..." తెర్లుకొస్తూ న్న ఆగ్రహం అడ్డంరాగా మాట పూర్తి చేయలేక పోయింది అనూహ్యా.

"ఏరా ఏం చేసేవ్ అనూహ్యాగార్ని?" ఆవే శంగా త్రిలోక్ కాలర్ పట్టుకున్నాడు గౌతమ్. అవకాశాన్ని సద్వినియోగం చేసుకోవాలన్న దూ రాలోచనతోకాదు. అవతలివ్యక్తి అనూహ్యాకి బాధ కలిగించాడన్న విషయం స్పష్టమైపో తూండడంవల్ల అతనిలో ఆవేశం ఆటోమాటి గ్గా దానంతటదే వచ్చేసింది.

"ఈ ఎబ్రాసి వెధవ... నాకు... నాకు... లౌ లెటర్ రాశాడు" ఖాండ్రించి ఊస్తూ చెప్పింది అనూహ్యా.

గౌతమ్‌కి గొంతులో కరుగుతున్న సీసం పోసినట్టనిపించింది. అన్పించదూ మరి? అత నామెను కాస్తా కూస్తా ప్రేమిస్తున్నాడా ఏంటి?

"ఏరా నల్లరూళ్ల కర్ర వెధవా? నిజమేనా?" పిడికిటవున్న త్రిలోక్ కాలర్ని బిగించి లాగుతూ పెంకులెగిరిపోయేలా అరిచాడు గౌతమ్. లోప ల్నుంచి ఆగ్రహావేశాలు ఎగదన్నుకొచ్చేస్తున్నా యన్న దానికి సూచనగా అతను నిలువెల్లా వూగిపోసాగాడు.

అంతలో ఏమయ్యిందేమయ్యిందంటూ గు మిగూడిపోయారు తతిమా వాళ్ళు.

"ఏమైందా? ఈ కర్రిరాస్కెల్‌గాడ్కి అనూ హ్యాగారి ప్రేమ కావాల్సొచ్చిందట!" అంటూనే ఆవేశంలో తన్నుతాను మర్చిపోయి త్రిలోక్ రెండో చెంప మీద ఫెడీల్మని కొట్టి "టేక్కేర్! ఇంకోసారి గనక అనూహ్యాగారి జోలికొచ్చేవంటే ప్రాణాలుదక్కవు జాగ్రత్త అఁ..." అన్నాడు గౌతమ్.

"అవునండీ! ఇదుగో నాకీ లౌలెటర్ రాశా డు" నేల మీద రెపరెప లాడ్తూన్న కాగితాన్ని అందరికీ చూపుతూ బిడియంగా చెప్పింది అనూహ్యా.

పావనమూర్తి గౌతమ్ చేతుల్లోంచి త్రిలోక్‌ని తప్పిస్తూ అన్నాడు- "అయితే మాత్రం? ఎంత యినా మన సార్ గారి బామ్మర్దికదా? మంచీ చెడ్డా లేకుండా నువ్వెందుకోయ్ గౌతమ్ చెయ్యి చేస్కోవడం?"

"సార్‌గారి బామ్మర్దయినంత మాత్రాన్న వీడే వన్నా మొనగాడా?" మీదకు దూకి త్రిలోక్ జుట్టందుక్కుదిపేస్తూ అన్నాడు గౌతమ్... "అ నూహ్యాగారంటే మజాకా అనుకుంటున్నాడా- ఎవణ్ణిపడ్తే వాణ్ణి ప్రేమించేయడానికి? అమ్మె కాళ్ళ మీద పడి క్షమాపణ చెప్పేదాకా వీణ్ణి నేను వదల్ను?"

త్రిలోక్ గింజుకుంటూ అరిచాడు.

"నువ్వెవడివి బే? వొదులు... వొదులు..."

''అవునేయ్ ఇది పద్ధతిగా లేదు. వొదులు'' త్రిలోక్‌ని సపోర్ట్ చేస్తూ అన్నాడు పావనమూర్తి.

''నేవెవణ్ణా? హుఁ... ఒక ఆడపిల్ల విషయంలో అసభ్యంగా ప్రవర్తించిన ఇలాంటి బద్మాష్‌కి బుద్ధి చెప్పడానికి ఎవరైతేనేం? అనూహ్యగారు మన కొలీగ్! ఆమెను అవమానపర్చిన ఈ ఇడియట్‌ని మందలించే హక్కు మనలో ప్రతి ఒక్కరికీ వుంది! రేయ్ చూస్తావేం గుడ్లగూబలాగ? పడు ఆమె కాళ్ల మీద పడి క్షమాపణ వేడుకో...'' గౌతమ్ ఆవేశంగా అరుస్తూ త్రిలోక్‌ని అనూహ్య కాళ్ల మీదకి నెట్టేడు.

''రేయ్ నా మీదే చెయ్యిచేసుకుంటావా లంగావెధవా! చూడు నిన్నేం చేస్తానో...'' క్రింద పడ్డ త్రిలోక్ ఉగ్రనరసింహావతారంలా ఊగిపోతూ దిగ్గున లేచి రైఫిల్‌లోంచి బయల్పడిన గుండులా మేనేజర్ ఛాంబర్‌లోకి దూసుకుపోయాడు.

అందరూ ప్రాణాలరచేతుల్లో పట్టుకుని శిలా ప్రతిమల్లా నించుండిపోయారు.

అనూహ్య గౌతమ్ కేసి ప్రశంసాపూర్వకంగా చూసింది- శభాష్ మగాడంటే ఇలా వుండాలి! ఈ అందర్లో నువ్వొక్కడివే మగాడివి అన్నట్టుగా.

గౌతమ్ అది గమనించాడు గాని అందుగ్గాను అతని హృదయానికి పులకించేటంత వ్యవధిలేకపోయింది.

కారణం... మేనేజర్ ఛాంబర్‌లోకి వెళ్లిన త్రిలోక్ మేనేజర్ని వెంటబెట్టుకుని అక్కడికి రావడం.

తర్వాత అక్కడ చాలా పెద్ద రభసే జరిగింది.

త్రిలోక్ చేసింది తప్పేనని ఒప్పుకుంటూ- ''అయితేమాత్రం నువ్వు చెయ్యి చేస్కోవడం ఏంటి? పెద్దవాణ్ణి నేనిక్కడున్నానుకదా? అనూహ్య నాకు కంప్లయింట్ చేస్తే నేనతన్ని మందలించుండేవాణ్ణికదా?'' అంటూ గౌతమ్‌ని తిట్టేడు మేనేజరు.

''నా కొలిగ్‌కి అవమానం జరిగితే నాకు జరిగినట్టు కాదా? అందుకే నేను సహించలేకపోయా'' అని గౌతమ్ తననితాను డిఫెండ్ చేస్కోబోయాడుగాని మేనేజరతని మాటల్ని సాగనివ్వలేదు.

''ఇది ఆఫీసా, నడిబజారా నీ ఇష్టం వచ్చినట్టు నువ్వు ప్రవర్తించడానికి? ఇంతమంది ఊరుకోగాలేన్ది నీ ఒక్కడికే ఎందుకు రోషం ముంచుకురావాలి? నువ్వేమయినా హీరోననుకుంటున్నావా?'' అంటూ ప్రారంభించి గౌతమ్‌ని చడామడా దులిపేశాడు మేనేజరు.

దుర్వాసుడిలాంటి నీకు శాంతకుమార్ అనే పేరు తగదుగాక తగదని మనసులో పళ్లు నూరుకోవటం తప్ప, సాహసించి మేనేజర్‌తో తగవుకు మాత్రం దిగలేకపోయాడు గౌతమ్.

ఎంతయినా బాస్ బాసే, సబార్డినేట్ సబార్డినేటే.

''సరేనమ్మాయ్... జరిగిందానికి నేను చాలా బాధపడ్తున్నాను. అతనివల్ల ఇంకెప్పుడూ ఇలాంటి పొరపాటు జరగబోదని హామీ ఇస్తున్నాను- సరేనా?'' అంటూ అనూహ్యని కన్విన్స్ చేసి, శాంతింపజేసి, అందరూ వింటూండగానే త్రిలోక్‌ని కూడా నాలుగు తిట్లు తిట్టి పంపించేసి అప్పటికా గొడవని సద్దుమణిగిపోయేలా చేశాడు మేనేజరు.

'సుబ్బారావ్ చెప్పింది నిజమే. ఇప్పుడీ సంఘటన జరగబట్టేగా నేనంటే అనూహ్యకి సదభిప్రాయం ఏర్పడింది?' అనుకున్నాడు గౌతమ్ ఆనందంగా.

అనూహ్యలో తనపట్ల ఏర్పడిన సదభిప్రాయం తాత్కాలికమేనని ఆ క్షణాన్ని అతనూహించలేకపోయాడు.

★ ★ ★

''ఇంతకీ అనూహ్య ఏమంది?'' అడిగేడు సుబ్బారావ్.

''ప్రత్యేకించి ఏమీ అనలేదులేగాని నావైపు మాత్రం చాలా ఇదిగా చూసింది...'' సంబరంగా చెప్పాడు గౌతమ్.

''ఇదిగా అంటే?''

''ఇదివరకటిలా అసహ్యంగా కాకుండా ఇదిగా అన్నమాట''

''నీ మొహంమండా... అదేరా నేనడుగుతూంట. 'ఇది'గా అంటే ఎలా? అచ్చెప్పు ముందు...'' కసిరేడు సుబ్బారావ్.

ఏంచెప్పాలో తోచక బుర్ర గీరుకున్నాడు




గౌతమ్.

"అడ్మైయిరింగ్‌గానా?" సుబ్బారావే అడిగాడు.

"ఆc... ఆc... ఇంచుమించు అంతే"

"అయితే నీకింకేం ఫర్వాలేదన్నమాట. ఎందుకయినా మంచిది. సందు దొరికింది కదాని చెలరేగిపోబాకు. అంతమందిలో ఆ త్రిలోక్‌గాణ్ణి చెప్పుతో కొట్టిందంటే ఆమె నువ్వనుకుంటున్నంత సామాన్యురాలేం కాదు. కాబట్టి వీలైనంత జాగ్రత్తగా మసలుకో"

సుబ్బారావ్ అలా అంటుంటే 'వీడి జిమ్మడ! వీడు పుట్టింది నాకు నీతులు చెప్పడానికే అయినట్టు ప్రతిదానికీ ఇలా మాట్లాడ్తాడేంటీ?' అని చిరాకుగా అనుకున్నాడే తప్ప, దాని వెనుక దాగిన మిత్రుడి ఆంతర్యాన్ని సరిగ్గా అవగతం చేసుకోలేకపోయాడు గౌతమ్. అలాంటి సిట్యుయేషన్‌లో ఎవరైనా అంతేనేమో.

"అలాగేలే" అనేశాడు రవంత చిరాగ్గా.

ఆ రాత్రి సుబ్బారావ్ గౌతమ్ ప్రేమ వ్యవహారం గురించి మనసులో చాలాసేపు మధనపడ్డారు.

వీడి వూపూ అదీ చూస్తుంటే ఎలాగోలా రంగంలో దిగిపోయేటట్టే వున్నాడు. త్రిలోక్ పుణ్యమా అని పరిస్థితి కూడా ఒకింత అనుకూలంగానే మారింది.

అన్నీ అనుకూలంగా జరిగి ఒకవేళ రేపొద్దున్న అనూహ్యతో వీడి ప్రేమాయణం ముదురుపాకాన్న పడితే వాడి అమ్మా నాన్నలతో తనెన్ని మాటలు పడాల్సొస్తుందో?

మరీ మరీ చెప్పి పంపించారాయె. ఏ కారణంచేతనైనా అనూహ్యతో వీడి ప్రేమ వ్యవహారం వాళ్లకి నచ్చకపోతే- నచ్చకపోవడానికే ఎక్కువ స్కోవుంది. పెద్దలన్నాక ప్రేమని వ్యతిరేకించకుండా ఎలా వుంటారు? కాబట్టి ఈ విషయంలో తను బ్లేమైపోవడం ఖాయం? అందువల్ల ఇలాగిలాగ జరుగుతోందని ఊదేయడం మంచిది. ఆ తర్వాత వాళ్లేం చేసుకుంటారో వాళ్లిష్టం.

ఏదో అలా అనిపించిందన్న మాటేగానీ ఆ ఊహని ఎక్కువసేపు మనసులో బ్రతకనివ్వలేదు సుబ్బారావ్.

అదిలో (అంటే ఇంతకుముందు) ఆలోచించినట్టే మళ్లీ ఆలోచించాడు.

ఆలూ లేదు చూలూలేదు, కొడుకుపేరు సోమలింగం అన్నట్టు, అసలేమీ జరక్కముందే అప్పుడే అలాంటి పనిచేయడందేనికిలే అన్న ధోరణిలో-

ఆలోచిస్తూ ఆలోచిస్తూ ఆ రాత్రి అలాగే నిద్రలోకి జారిపోయాడుగాని మర్నాడుదయం లేవగానే మాత్రం అతనొక నిర్ణయం తీసుకున్నాడు. అనూహ్య గురించి బాగా ఎంక్వయిరీ చేయాలనీ, ఒకవేళ ఆమె గౌతమ్‌కి తగిన పిల్ల కాదనిపిస్తే మాత్రం ఖచ్చితంగా వాయించితీరాలనీ.

అంతేకాదు... ఆ ప్రయత్నానికతను ఆరోజే శ్రీకారం కూడా చుట్టేడు.

★ ★ ★

మరోవారం గడిచేసరికల్లా సుబ్బారావ్ ఎలాగైతేనేం వాళ్లనీ వీళ్లనీ బట్టి అనూహ్య గురించి పూర్తి సమాచారం సేకరించాడు.

అనూహ్య వాళ్లది మధ్యతరగతి కుటుంబమే అయినా మచ్చలేని కుటుంబం. అనూహ్య తండ్రి కోటేశ్వర్రావ్ టీచర్‌గా చేసి రిటైరయ్యాడు. అనూహ్య తల్లి సావిత్రమ్మ ఉత్తమ ఇల్లాలు. ఆ దంపతులకు అనూహ్య, అనూహ్య అన్నగారైన రాజశేఖరం- ఇద్దరే సంతానం. రాజశేఖరానిక్కూడా సిటీలోనే ఉద్యోగం. అనూహ్య వాళ్లింట్లోనే ఉంటోంది ప్రస్తుతం. ఆమె తల్లిదండ్రులు మాత్రం వాళ్ల స్వగ్రామంలోనే ఉంటున్నారు. అటు పల్లెకీ ఇటు పట్నానికీ మధ్యస్తంగా వుండే ఆ వూళ్లో ఓ చిన్న పెంకుటిల్లు తప్ప, ఇతరత్రా ఆస్తిపాస్తులేమీ లేవు వాళ్లకి. రాజశేఖరానికి వివాహం అయింది. ఇద్దరు పిల్లలు కూడా వున్నారు.

అదలావుంచి అనూహ్య కేరక్టర్ విషయానికొస్తే ఆమె గురించి అంతా నిప్పులాంటి పిల్ల అని చెప్పినవారే తప్ప, 'ఇదిగో ఈ అమ్మాయిలో ఈ లోపముందీ' అని చెప్పినవారు మచ్చుకొక్కరైనా కానరాలేదు సుబ్బారావ్‌కి.

ఆస్తి విషయంలో గౌతమ్ వాళ్ల కుటుంబంతో సరితూగలేకపోయినా మొత్తానికి

అనూహ్య అన్నివిధాలా గౌతమ్‌కి తగిన జోడీ అని నిర్ధారించుకున్నాడు సుబ్బారావ్.

ఇకపోతే కులాలు ఒక్కటి కాకపోవడం అనేది అతిముఖ్యమైన సమస్య.

అయితే మారుతున్నకాలంతోపాటు మనుషులూ మారుతున్నారు కాబట్టి అది అధిగమించలేనంత జటిల సమస్య కాకపోవచ్చనే అనిపించింది సుబ్బారావ్‌కి.

గౌతమ్ అదృష్టం బాగుండి అనూహ్య కూడా అతన్ని ప్రేమించడమంటూ జరిగితే దాన్ని సఫలం చేయడానికి తనవంతు సహకారాన్ని పరిపూర్ణంగా అందించాలని కూడా నిర్ణయించుకున్నాడు సుబ్బారావ్.

ఎటొచ్చీ ఇహ జరగాల్సిందల్లా గౌతమ్ అనూహ్య మనసుని ఆకట్టుకోగలగడం.

ఆ విషయంలో కూడా వీలైనంత మట్టుకు కోపరేట్ చేయాలని గట్టిగానే అనుకున్నాడు సుబ్బారావ్.

అదే చెప్పాడు గౌతమ్‌తో-

''అనూహ్య గురించి నేను వివరాలన్నీ తెలుసుకున్నాన్రా... మీతో పోలిస్తే కాస్త పేదకుటుంబమే అయినా నీకు భార్యకాగల అర్హతలన్నీ ఆమెకున్నాయి. నీ సెలక్షన్నీ, నీ నిర్ణయాన్నీ నేనిప్పుడు మనస్ఫూర్తిగా మెచ్చుకుంటున్నాను. అంతేకాదు ఈ విషయంలో నీకు పూర్తిగా కోపరేట్ చెయ్యాలని కూడా అనుకుంటున్నాను. సో... గో అహెడ్...'' అంటూ అతని భుజం తట్టేడు.

గౌతమ్ ప్లీజైపోయాడు మిత్రుడి మాటలకి. ఆ సంతోషంలో అతను సుబ్బారావ్‌ని గట్టిగా కౌగలించేసుకున్నాడు. ''ఇప్పుడురా నువ్వు నా నిజమైన స్నేహితుడవనిపించుకున్నావ్. ఇన్నాళ్లూ తొందరపడబాకు తొందరపడబాకు అంటూ వెనక్కి గుంజినవాడివి ఈనాడిలా అంటున్నావు అంటే, చెప్పొద్దూ నాకు చాలా అయోమయంగా కూడా వుంది. ఏమైతేనేం మొత్తానికి నీ ఎంక్వయిరీ పుణ్యమా అని నా అనూపట్ల నీలో చాలా చాలా మంచి అభిప్రాయం ఏర్పడినందుకు నాకు చాలా సంతోషంగా వుంది- ఇహ చూస్కో చూపిస్తా నా తడాఖా'' అన్నాడు సంబరంతో చింకి చేటంతయిపోయిన మొహంతో.

''ఏదీశావ్‌లేగాని కాస్త తగ్గించు నీ జోరు. నేనేదో ఎంకరేజింగ్‌గా మాట్లాడేను కదాని చెప్పి, అవకతవగ్గా ప్రవర్తించి కొంపమీదకి తెచ్చుకోబాకు'' తన సహజ ధోరణిలో మందలింపులాంటిది చేసి, ఆ మీదటడిగేడు సుబ్బారావ్-

''నీ విషయంలో ఎలా వుంటోందామె ప్రవర్తన? అప్పటిలాగే వుంటోందా లేక ఏమైనా మార్పు...?''

గౌతమ్ నిట్టూర్పులాంటిది విడిచి చెప్పాడు-

''మార్పంటూ పెద్దగా ఏమీలేదుగాని, ఇదివరకటి కోపం అట్టే వున్నట్టుగా అనిపించడంలేదు. నువ్ తొందరపడొద్దని వెనక్కి గుంజుతూండటంవల్ల నా అంతట నేనేమీ అడ్వాన్సవ్వకుండా ఊరుకున్నాను ఇన్నిరోజులూ. నువ్ ఊ అను, రేపు కాస్త లైట్‌గా కదిపి చూస్తాను''

''కదిపిచూడ్డం అంటే?''

''అదేరా నా ప్రేమ ఆమెకర్థమయ్యేలా నాలుగు ముక్కలు...''

''మాట్లాడ్తానంటావ్'' మధ్యలో అందిపుచ్చుకుని అన్నాడు సుబ్బారావ్- ''అదే తొందరపాటంటే. ఒక్కసారి ఆ త్రిలోక్‌గాణ్ణి గుర్తుకు తెచ్చుకో. అలాంటి సత్కారమే నీక్కూడా పొందాలని కోరిగ్గా వుందా?''

గౌతమ్ ముఖం చిన్నబోయింది.

''అంటే నువ్వనేదేంటి? నన్ను కూడా చెప్పుతో కొడుతుందనేగా?'' రోషంగా ముక్కుపుటాలెగరేశాడు.

''ముమ్మాటికీ అంతే... అయ్ లవ్ యూ అనగానే మురిసి నిన్ను ముద్దాడేస్తుందా లేకపోతే?''

''నీతో ఇదేరా చిక్కు. ఏ విషయమూ తిన్నగా చెప్పేడవు. ఇంతకీ నన్నేం చేయమంటావ్?''

''ప్రస్తుతానికైతే ఏమీ చేయొద్దనే అంటాను. ఇంకా కొన్ని రోజులు జరగాలి. నెల్రోజుల పరిచయానికీ, రెణ్ణెల్ల పరిచయానికీ నిన్ను ప్రేమించేస్తున్నాననే మగాణ్ణి తెలివున్న ఏ





అమ్మాయీ నమ్మదు. కాబట్టి ప్రస్తుతానికి నువ్ చేయాల్సిందేవిటీ అంటే నీ టీజింగ్ నేచర్‌ని కాస్త అదుపులో పెట్టుకుని ఫర్వాలేదు వీడు కాస్త బుద్ధిమంతుడే అనే అభిప్రాయాన్ని ఆమెలో కలిగించుకో చాలు. ఆమెవద్ద నీ ప్రేమని ఎప్పుడు ఎలా వ్యక్తంచేయాలీ అన్నది తగిన సమయం వచ్చినప్పుడు నేచెబు తాను- సరేనా?''

పాలపొంగుపై చన్నీటి చిలకరింపులా సుబ్బారావ్ మాటలు గౌతమ్‌లోని ఉత్సాహాన్ని అణగార్చేశాయ్.

''సరే... అలాగే'' అన్నాడు నీరసంగా తలూపుతూ.

★ ★ ★

మిత్రుడికిచ్చిన మాటప్రకారం ఆఫీసులో చాలా చాలా బుద్ధిగా వుంటున్నాడు గౌతమ్.

పొరపాట్న కూడా ఎవర్నీ నిక్‌నేమ్ పెట్టి పిలవటంలేదు. పైగా ప్రతి ఒక్కర్నీ 'గారు' అని సంభోదిస్తూ 'అబ్బ... నిజమైన సంస్కారవంతుడంటే ఇతనే సుమా!' అనిపించేటంత నైస్‌గా ప్రవర్తించడాన్ని అలవరచుకున్నాడు.

అసలు ఆఫీసులో అతను చేసే ఆకతాయి పనులు కేవలం నిక్‌నేమ్స్ పెట్టడంవరకే పరిమితమై వుండేవి కావు గతంలో. ఎవరైనా కుర్చీలోంచి లేచి నిలబడి టేబుల్‌మీద అదీ ఇదీ సర్దుకుంటున్నప్పుడు శబ్దం చేయకుండా వెనుకపాటుగా వెళ్ళి ఆ కుర్చీని చప్పుడుకాకుండా తొలగించటం, ఆ విషయం తెలీక ఆ వ్యక్తి మళ్ళీ కుర్చీలో కూర్చొబోతు నేలమీద పడితే ఫకాలున నవ్వటం, టేబుళ్ళమీది ఫైళ్లని అటూ ఇటూ మార్చి ఆయావ్యక్తులు సదరు ఫైళ్లకోసం వెతుక్కుచచ్చేలా చేసి వినోదించటం వంటి బాల్య చాంచల్యపు పనులు కూడా లెక్కకు మిక్కుటంగానే చేస్తూండేవాడు. సదరు బాధితులు- ''మంచోడివీ కాదు, పిచ్చోడివీ కాదు. ఎంత వేళాకోళానికయితే మాత్రం మరీ ఇలాంటి పాడుపనులేంటయ్యా?'' అంటూ అతన్ని తిట్టిపోస్తే ఏదో ఘనకార్యం చేసినవాడిలా ముసిముసి నవ్వులు నవ్వేవాడే తప్ప, ఏమాత్రం సిగ్గుపడేవాడు కాదు.

టీజింగ్ నేచర్ విషయంలో అతనెవర్నయినా సైకియాట్రిస్ట్‌ని సంప్రదించటం అవసరమని కూడా చాలా మందికి అనిపిస్తూండేది.

ఎందుకంటే అంత క్రూడ్‌గానూ, అంత రూడ్‌గానూ కూడా వుంటూండేవి అతను చేసే కొన్ని ఆకతాయిపనులు.

అలాంటిది అతనిప్పుడు అనూహ్యా కోసం అలాంటి వికారపు చేష్టలన్నీ పూర్తిగా కట్టిపెట్టేశాడు.

అలాగని అతను మానసికంగా పరివర్తన చెందాడా అంటే కాదు. ఆ ఉగ్గబట్టుకోవడం అంతా ఆఫీసులో వున్నంతసేపే. బైటికొచ్చాక మళ్ళీ మామూలే. దారేపోయే దానయ్యనో దానమ్మనో ఏదో ఒకలా కెలకరించి వలకరించి ఎగతాళి చేసి వినోదించటం.

ఒకపక్క ఆఫీసులో బుద్ధిమంతుడి పాత్రని నవ్యంగానే పోషిస్తూనే ఇటీవల బైట అతను చేసిన ఆకతాయి చేష్టల లిస్టు ఖచ్చితంగా కొల్లేటి చేంతాడుకన్నా పెద్దదే.

అసలే డుంబూవాళ్ల మదరు తమమీద చిర్రుబుర్రులాడుతూ వుందని తెలిసి కూడా ఓరోజు వాడి చొక్కామీద ఇంకు విదిలించి పావనితో ముక్కచీవాట్లు తిన్నాడు. డుంబూ గమనించటం లేదనుకుని చేశాడా పాడుపని. అయితే ఖర్మవశాత్తూ డుంబూ అది కాస్తా చూసేసి నా చొక్కామీద గౌతమంకుల్ సిరా విదిలించాడంటూ తల్లితో చెప్పేయటంతో సంభవించిందా ఉపద్రవం.

మరోనాడు బస్సులో ఓ గుండు శాల్తీని ఏదో అనగూడని మాట అని ఏడిపించబోయి, తానే భంగవడ్డాడు. ఎందుకంటే అతని ప్రవర్తన నచ్చని తోటి పాసింజర్లు గుండు శాల్తీని వెనకేసుకొస్తూ అతనిమీద మూకుమ్మడిగా విరుచుకుపడ్డారు. సమయానికి సుబ్బారావ్ పక్కనే వుండటంవల్ల 'మావాడదో రకం బైపులెండి' అంటూ స్క్రూ లూజ్ అనే అర్థం వచ్చేలా సైగచేసి, మంచి మాటల్తో అందర్నీ ఎలాగోలా శాంతింపజేయబట్టి సరిపోయింది గాని- లేకపోతే అతనారోజు ఏమయ్యుండేవాడో?

ఇంకోరోజు ఓ సినిమాహాల్లో ఓ పిలకజడల అమ్మాయిని ఏడిపించబోయినప్పుడు కూడా బస్‌లో జరిగినట్టే అక్కడా చాలా పెద్ద గొడవే జరిగింది. అప్పుడు కూడా అతన్ని సుబ్బారావే

రక్షించుకున్నాడు, అందరికీ ఏదో సర్దిచెప్పి.

ఇవి మూడూ మూడు ఉదాహరణలు మాత్రమే.

లిస్టు కొల్లేటి చేంతాడంతని ముందు చెప్పడం జరిగింది కాబట్టి ఊహించుకోగలిగిన వాళ్లకి ఊహించుకోగలిగినన్ని ఉదాహరణలు.

రోజులలా గడుస్తూండగా ఓ రోజతనికి వాళ్ల నాన్న దగ్గర్నుంచి ఉత్తరమొచ్చింది.

విషయం పాతదే.

సుబ్బారావ్‌కి ఊర్మిళ రాసిన సంగతినే కన్‌ఫర్మ్ చేస్తూ రాశాడు జోగారావ్.

కానైతే అదనంగా తెలిసిందేమిటంటే- పెళ్లి చూపులకు డేట్ కూడా ఫిక్స్‌చేసి, ఆ డేట్‌కి గౌతమ్ కంపల్సరీగా అక్కడుండి తీరాలని రాసేడాయన. 'ఒక్కడివే వొద్దు, సుబ్బారావ్‌ని వెంటబెట్టుకుని రా' అని కూడా రాశాడాయన.

సుబ్బారావ్‌కా ఉత్తరాన్ని చూపి- "ఇప్పుడేం చేద్దామంటావ్? అనూహ్యని ప్రతిష్ఠించుకున్న హృదయంతో వేరే అమ్మాయిని చూడ్డం కోసం 'పెళ్ళిచూపులు' పేరుతో అంతదూరం నేను వెళ్ళిరావడం అర్ధరహితం. దీన్ని నివారించడానికి మార్గమే లేదా?" అని వాపోయేడు గౌతమ్.

సుబ్బారావ్ ఒకింతసేపాలోచించి చెప్పాడు-

"తప్పదు... వెళ్ళిరావటమే అన్నివిధాలా శ్రేయస్కరం"

"అంతా తెలిసుండి కూడా అదేం మాటరా?"

కించిత్ కోపంగా అన్నాడు గౌతమ్- "అనూహ్యమీద నాకుగల ప్రేమని శంకిస్తున్నావా ఏమిటి?"

"నోనో... అది కాదురా!"

"ఏది కాదు? అనూహ్యమీద నాకు గల ప్రేమని శంకించనప్పుడు తగుదునమ్మా అని నన్నా పెళ్ళిచూపులకి వెళ్ళిరమ్మని ఎగదొయ్యడం దేనికి?"

"అంతా నీ మంచి కోసమే! ఇప్పుడు గనక నువ్వా పెళ్ళిచూపులకు వెళ్ళకపోతే కారణం ఏమిటని మీ నాన్న నిన్ను నిగ్గదియ్యడా? అప్పుడు నువ్వేం చెప్పగలవ్?"

"ఏముందీ? ఉన్న విషయం చెప్పేస్తాను"

"నీ బొంద... అవతల అనూహ్య ఇంకా నీ లైన్‌లోకి రానేలేదు అలాంటిది అప్పుడే ఈ విషయాన్ని పెద్దవాళ్ళదగ్గర టాంటాం చేసేనుకుంటే లేనిపోని రాద్ధాంతమే తప్ప, ప్రయోజనమేమీ వుండదు. కాబట్టి నామాట విను. పెళ్ళిచూపులకెళ్ళినంత మాత్రానికే పెళ్ళయిపోదుగా! వెళ్తావ్, చూస్తావ్, నచ్చలేదనేస్తావ్. దట్సాల్... దేరెండ్స్ ద మాటర్!"

ఒకింత బుర్రపెట్టి ఆలోచించిన మీదట మిత్రుడిమాటల్లోని ఔచిత్యం అర్థమయ్యింది గౌతమ్‌కి.

"సరేరా!" అనేశాడు.

★ ★ ★

పెళ్ళిచూపుల అనంతరం పిల్ల నచ్చలేదంటూ వంకపెట్టిన గౌతమ్ మీద తాడెత్తున లేచాడు అతని తండ్రి జోగారావ్.

"కళ్ళుగాని మసకలు కమ్మేయా? లేకపోతే ఏంటి? ఏం తక్కువైందా అమ్మాయికి?" అంటూ విరుచుకుపడ్డాడు.

గౌతమ్ గుటకలు మింగుతుంటే సుబ్బారావ్ మిత్రుడి తరుపున వకాల్తా పుచ్చుకున్నవాడిలా చెప్పాడు-

"మరీ అలా నిగ్గదీస్తే ఎలాగండీ? మనందరికీ నచ్చినంత మాత్రాన వాడికీ నచ్చితీరాలని రూలేం లేదుగా? తన కాబోయే భార్య ఫలానవిధంగా వుండాలని అతనికో అభిప్రాయం వుండొచ్చు. ఆ అమ్మాయి ఆ అభిప్రాయానికి అనుగుణంగా లేకపోయి వుండొచ్చు"

"నువ్ మూస్కోవయ్యా నోరు! ఏంటి వాడికి వంతపాడుతున్నావ్? లక్షణంగావున్న అమ్మాయి నచ్చక పోవడం ఏంటి? అసలు నేను పెళ్ళిచూపుల్లోనే గమనించాను. వీడా అమ్మాయికేసి సరిగ్గా చూసిన పాపాన్నయినా పోలేదు. ఏదో ఇష్టంలేని తతంగంలా ముఖం ముటముటలాడిస్తూ కూర్చున్నాడు. కొంపదీసి ఈ దొరగారు సిటీలో ఏవైనా వెధవ్వేషాలు గాని వేస్తున్నాడా?" అంటూ తీక్షణంగా చూశాడు జోగారావ్.

"వెధవ్వేషాలా? వెధవ్వేషాలేంటి సార్?"





వీలైనంత అమాయకంగా ముఖం పెట్టి అడిగాడు సుబ్బారావ్.

"అదేనోయ్... లవ్వు. ఈకాలం కుర్రసన్నాసులందరికీ అదో గొప్ప ఫాషనైపోయిందిగా... ఏ తలమాసిందాన్నో ప్రేమించేయడం!"

గౌతమ్ హృదయం గిజగిజలాడిపోయింది.

"ఎంత మాటనేశావ్ నాన్నా! నా అనూ తలమాసింది కాదు నాన్నా, దేవత!" అనుకున్నాడు మనసులో బాధగా. అదేమాట పైక్కూడా అనాలన్నంత ఆవేశం కూడా వచ్చింది గాని, ఎలాగో నిగ్రహించుకున్నాడు.

"చఛ... వీడా? ప్రేమించడమా? నోనో, అలాంటిదేం లేదండీ! అసలు అమ్మాయిల కేసి కన్నెత్తయినా చూడ్డు వెధవ. అలాంటిదిలాంటి అప్రాచ్యప్పనులెందుకు చేస్తాడండీ?"

సుబ్బారావ్ ఈ మాటల్ని ఎంత నమ్మకంగా చెప్పేడూ అంటే అంత నమ్మకంగా చెప్పేడు.

దాంతో ఒకింత కుదుటపడ్డ జోగారావ్- "మరలాంటప్పుడు ఆ అమ్మాయి నచ్చకపోవడ మేంటి?" అంటూ మళ్ళీ పాతపాటే పాడేడు.

"దాందేముందండీ? ఇందాక చెప్పేనుగా. వీడు వూహించుకుంటున్న అమ్మాయిలా ఆ అమ్మాయి వుండుండదు పాపం. ఏరా అంతేనా?" చివరిముక్క గౌతమ్ నుద్దేశించి అడిగాడు సుబ్బారావ్.

అంతే అంతే అన్నట్టు నిలువుగా తలాడించేడు గౌతమ్.

జోగారావ్ అంతలోకే కన్విన్స్ అయిపోలేదు గాని, కుర్రాడు వొద్దు మొర్రో అంటున్నప్పుడు చేయగలిగిందేముందిలే అన్న ఉద్దేశంతో అప్పటికింక మిన్నకుండి పోయాడు.

గౌతమ్ తల్లి రామసీత కూడా ఎంతగానో చెప్పిచూసింది."పిల్ల కుందనపుబొమ్మలా వుందిరా! అర్థంపర్థంలేకుండా ఏవేవో వంకలు పెట్టి కాదంటున్నావ్‌గాని అంత మంచి పిల్ల దొరకడం నిజానికి చాలా అదృష్టం అనుకోవాలి! మరోసారి ఆలోచించు..." అంటూ ఒకటికి పదిసార్లు చెప్పిందామె.

కానీ గౌతమ్ కొరుకుడు పడలేదు.

ఎలా పడతాడు? అతని హృదయం నిండా అనూహ్య రూపమేనాయె!

"ఆఫ్టరాల్ ఈ నీరజదేముందమ్మా! నా అనూహ్య ఇంతకన్నా వెయ్యిరెట్లు కుందనపుబొమ్మ! ఆ కుందనపుబొమ్మ హృదయాన్ని కొల్లగొట్టి ఆమెని నీ కోడలిగా తెచ్చిన నాడు అప్పుడు నువ్వే మెచ్చుకుంటావ్ నన్నూ నా అదృష్టాన్నీ!" అనుకున్నాడు మనసులో.

★ ★ ★

"ఏమోయ్? ఇల్లు ఖాళీ చేసే విషయం ఏం నిశ్చయించుకున్నారు?" గౌతమ్ పెళ్ళి చూపుల నిమిత్తం వూరెళ్ళొచ్చిన మిత్రద్వయాన్ని రాగానే అడిగాడు శ్రీరామ్మూర్తి.

నిజానికి 'అడిగేడు' అనటం కరెక్ట్‌కాదు. పావని అతనితో 'అడిగించింది'.

"చూస్తున్నాంసార్... అదే చూస్తున్నాం! మరో నాలుగైదురోజుల్లో ఖచ్చితంగా మార్చేస్తాం" అనేశాడు సుబ్బారావ్ ఏదో అప్పటికా ప్రస్తావన దాటిపోతే చాలని. అంతేతప్ప నిజానికి అంతవరకూ వాళ్ళు వేరే ఇంటికోసం కనీసం ఒక్క చిన్న ప్రయత్నమయినా చేయలేదు.

"నాలుగైదు రోజుల్లో ఖాళీ చేసేస్తారా? గుడ్! ఇంతకీ ఎక్కడ దొరికింది ఇల్లు?" అడిగేడు శ్రీరామ్మూర్తి.

"రెండు మూడు చూసేం సార్! కానీ దేంట్లో దిగాలా అన్నది ఇంకా డిసైడ్ చేస్కోలేదు" చప్పున కోసేశాడు సుబ్బారావ్.

" అలాగా... ఏదోకటి డిసైడ్ చేసేస్కుని తొందరగా మారిపోండి మరి!" అని వెళ్ళిపోయేడు శ్రీరామ్మూర్తి.

ఆయన వెళ్ళిపోయాక సుబ్బారావ్‌తో అన్నాడు గౌతమ్-

"ఇదొక దరిద్రగొట్టు పీడైపోయింది మన ప్రాణానికి! ఇచ్చే అద్దె ఇచ్చుకుంటూ ఏదో పుణ్యానికుంటున్నట్టు ప్రతిరోజూ మాటలు కాయడం దేనికి? అంతగా వేరే ఇల్లేదీ దొరక్కపోతే ఏదైనా లాడ్జీలోనైనా వుందాంగాని ఇక్కడ మాత్రం ఇంకుండొద్దు మనం"

"అలాగేలేరా! ఇవ్వాళ్టినుంచే చాలా సిన్సియర్‌గా ఇళ్ల వేట ప్రారంభిద్దాం. అదృష్టం బాగుంటే ఇంతకన్నా మంచి ఇల్లే దొరకొచ్చు. ఏం? దొరక్కూడదని ఏముంది?" అన్నాడు సుబ్బారావ్. మరొక్క రోజులో గౌతమ్




హృదయం మారిపోతుందనీ, ఛీ అన్నా ఛా అన్నా పో అన్నా ఆ ఇంటిని వదిలి వెళ్ళలేని సంకటస్థితిలో పడిపోతాడనీ పాపం ఆ క్షణాన్న సుబ్బారావ్ వూహించలేకపోయాడు.

అనుకున్నట్టుగానే ఆరోజు ఆఫీసవ్వంగానే ఇళ్ళ వేటలో పడ్డారు మిత్రద్వయం.

కళ్ళు దగ్గరెట్టుకుని గల్లీలన్నీ ఓపిగ్గా తిరగ్గలగాలేగాని సిటీలో 'టులెట్' బోర్డులకు కొదవేముంది?

లేదుగాక లేదు.

ఆ పూట ఓ అరడజనుకుపైగా టులెట్ బోర్డుల్ని చూశారు వాళ్ళు.

కానైతే ట్రాజెడీ ఏమిటంటే అందులో ఏ ఒక్క హవుసోనరూ వాళ్ళతో మూడు నిముషాలకన్నా ఎక్కువసేపు మాట్లాడిన పాపాన్న పోకపోవడం.

ఫేమిలీనా బేచులర్సా అనడగడం... బేచులర్స్‌మే అని వీళ్ళు చెప్పగానే వేరే మాటకి ఆస్కారమే ఇవ్వకుండా రోడ్డువైపు చెయ్యి చూపించడం అన్నిచోట్లా అలాంటి అనుభవమే ఎదురయ్యింది మిత్రద్వయానికి.

నేటి బ్రహ్మాచారులే రేపటి సంసారులన్న ఇంగితం ఈ హౌసోనర్లకి ఎందుకుండిచావదో మరి? బేచులర్స్ అనగానే ఠక్కున డిబాచులర్స్ అనేస్కుంటారో ఏంపాడో?!

మొత్తానికి ఆరోజు శ్రమయితే పడ్డారుగాని ఫలితం మాత్రం దక్కలేదు మిత్రద్వయానికి.

★ ★ ★

మర్నాడుఃదయం వేకువనే నిద్రలేచి మళ్ళీ ఇళ్లవేటకి బయలుదేరబోయిన మిత్రద్వయానికి-

ఇంట్లోంచి కాలుబైట పెట్టగానే ఎదురింటి వైపు నుంచి వస్తూన్న ఓ తొమ్మిదేళ్ళ బుడతడు ఎదురయ్యాడు.

వాడి లాగూకి గుండీలూడిపోయి కనిపించకూడనిది కనిపించేస్తూ వుండి అదికాస్తా గౌతమ్ కళ్ళబడ్డంతో- అతనిలోని ఆకతాయి ఒళ్ళు విరుచుకున్నాడు.

"రేయ్ పోస్టాఫీస్! ఇలారా!" అని పిలిచేడు బుడతడ్ని.

వాడు పాపం అమాయకంగా దగ్గరికొచ్చి నిలబడ్డాడు.

"ఉత్తరం పోస్ట్ చెయ్యాలి ఆగు" అంటూ, చుట్టూ చూసిన గౌతమ్‌కి రోడ్డుమీద ఓ ఖాళీ సిగరెట్ ప్యాకెట్ తాలూకు అట్టొకటి కనిపించింది. చటుక్కున దాన్నందుకుని పోస్ట్ చేసేశాడు గౌతమ్. అంటే గుండీలూడిపోయిన వైపునుండి బుడతడి నిక్కర్లో పడేశాడన్నమాట.

అంతే... బుడతడు పాపం సిగ్గుతో మెలికలు తిరిగిపోతూ చటుక్కున 'అక్కడ' చెయ్యడ్డం పెట్టుకున్నాడు. పాపం అంతవరకూ వాడు గమనించుకోలేదు తన లాగూకి గుండీ లూడిపోయేయని.

సుబ్బారావ్ గౌతమ్ భుజం మీద ఫెటీల్మని చరిచేడు- "పాపం ఏంపనుర్రా అవి?" అంటూ.

"ఉష్... నువ్వుండు" సుబ్బారావ్‌ని కాస్త ఎడంగా నెట్టి బుడతడ్ని అడిగాడు గౌతమ్-

"ఏరా పోస్టాఫీస్! నీ పేరేంట్రా?"

బుడతడు బెదురు చూపులు చూసేడే తప్ప బదులివ్వలేదు.

"రేయ్ నిన్నే అడుగుతూంట! నీ పేరేంటో చెప్పు" బుడతడ్ని భయపెట్టి వినోదించాలనుకున్న గౌతమ్ కోపంగా చుస్తూ గసిరినట్టుగా అడిగాడు.

బుడతడు పాపం నిజంగానే భయపడిపోయాడు. ఏడుపుముఖం పెట్టి- "నాకు మాటలు రావు" అన్నట్టుగా సైగచేశాడు.

"ఏంటీ? నువ్ మూగోడివా? నీకు మాటలు రావా?!" ఆశ్చర్యంగా అడిగాడు గౌతమ్.

"రావు" అన్నట్టు తలాడించేడు బుడతడు. వాడి కళ్ళు అప్పటికే వర్షించడానికి సిద్ధంగా వున్న మేఘాల్లా అయిపోయినై.

"అరెరెె... పాపం!" జాలిగా అన్నాడు సుబ్బారావ్.

"మాటల్రావా? సర్లే...ఐతే పేరు చెప్పొద్దులేగాని ఏదయినా పాటపాడు, వదిలేస్తా!" కొంటెగా అన్నాడు గౌతమ్. ఊహ తెలిసినప్పట్నించి అతనిలో పెరుగుతూ వచ్చిన టీజింగ్ నేచర్ ఆ క్షణాన్న అతనిలోని వివేకాన్నీ వివేచన్నీ పూర్తిగా నశింపజేసింది. కళ్ళెదుట వున్న పసికుంక మూగవాడు కదా, పాపం దేవుడే

చిన్నచూపు చూసిన ఆ చిన్నారి బాలుడ్ని ఏడిపించటం ఇంచుమించు రాక్షసత్వంతో సమానం కదా అన్న జ్ఞానమైనా లేకుండా పోయిందతనిలో.

గౌతమ్ ప్రవర్తన సుబ్బారావుక్కూడా ఎంతో ఎబ్బెట్టుగా అనిపించింది- "రేయ్ గౌతమ్..." కోపంగా అరిచాడు. "ఛీ... నువ్ రోజురోజుకీ మరీ పాడైపోతున్నావురా! వాడ్ని చూసి జాలిప డాల్సింది పోయి... మంచీ మానవత్వం లేకుండా ఏంటా ఏడిపించటం?"

గౌతమ్ ఆ మాటల్లోని తీవ్రతని పట్టించుకో లేదు. అతని సందట్లో అతనున్నాడు- "ఏదో లేరా... ఊర్కే సరదాకి" అంటూనే బుడతడ్ని కాస్త దగ్గరికి లాక్కుని "మాకన్న కదూ! ఏద మ్మా ఒక్క పాట... ఒక్కపాట పాడు... వదిలే స్తా!" అన్నాడు మరింత వేళాకోళంగా.

బుడతడు పూర్తిగా బెదిరిపోయాడు. దుః ఖాన్ని ఆపుకోవటం ఇంక వాడివల్ల కాలేదు. అంతే! వాడి రెండుకళ్ళూ రెండు పగిలిన నీటికుండలయ్యాయి.

అది చూసి గౌతమ్‌కి కూడా పశ్చాత్తాపం కలిగింది. చఛ... మరీ ఇలా ప్రవర్తించి వుండా ల్సింది కాదు.

అతని ప్రవర్తన మీద అతనికే కాస్త ఏవ గింపులాంటిది కలిగింది.

"చఛ...వూర్కోరా! నిన్నేమీ చెయ్యన్లే. వెళ్లి పో" అన్నాడు వాడి కళ్ళు తుడుస్తూ.

అప్పుడు...

అప్పుడు జరిగింది ఊహించని ఆ సంఘ టన!

ఎక్కడినుంచి వచ్చిందో ఏమో, అనూహ్య పరుగుపరుగున వచ్చి ఆ బుడతడ్ని అక్కున చేర్చుకుంది.

"అనూహ్యగారూ! మీరు... మీరు..." తన కళ్ళని తానే నమ్మలేకపోయాడు గౌతమ్.

సుబ్బారావ్ పరిస్థితి కూడా ఇంచుమించు అలాగే వుంది.

బుడతడు అనూహ్య చీర కుచ్చెళ్లలో ముఖం దాచుకుని వెక్కివెక్కి ఏడుస్తుండగా, అనూహ్య గౌతమ్‌కేసి అసహ్యంగా చూసింది. మురికిగుంటల్లో దొర్లి పైకి లేచిన పందివైపు చూసినంత అసహ్యంగా.

ఆ అసహ్యంతోపాటు ఆమె కళ్ల వెంబడి ఆగ్రహంకూడా అగ్నిబాణాలై వర్షించింది.

"అనూహ్యగారూ..." గౌతమ్ ఏదో చెప్పబో యాడు. ఆశ్చర్యంలోంచి ఇంకా పూర్తిగా తేరుకో లేదతను.

"షటప్!" ఇంచుమించు ఆడపులిలా గాండ్రించింది అనూహ్య. "ఛీ!" ఖాండ్రించి ఊసింది ఆ వెంటనే.

గౌతమ్‌కి ఏంజరుగుతూందో, ఏం జరగబో తోందో ఏమీ అర్థంకాలేదు.

అతను అయోమయంలో కొట్టుమిట్టులాడు తుండగా- అనూహ్య తన కళ్లలోని అసహ్యాన్నీ ఆగ్రహాన్నీ ద్విగుణీకృతం చేస్తూ అతనివైపు గుండె నిలువునా చీలిపోయేలా ఒక్క చూపు చూసింది.

"అనూహ్యగారూ!..." బలవంతాన ఎలాగో గొంతుపెగల్చున్నాడు గౌతమ్. "అయామ్ సారీ అండీ! ఈ అబ్బాయి... ఈ అబ్బాయి... మీకు తెలిసిన కుర్రాడా?"

అనూహ్య ఏమనుకుందోమరి- అవునన్న ట్టుగా నిలువుగా తలాడించింది.

"అయామ్ సారీ అండీ! మీకు తెలిసిన కుర్రాడనుకోలేదు. తెలిసిన కుర్రాడని తెలి సుంటే ఏడిపించుండేవాడ్ని కాదు" కంగా రులో ఏంమాట్లాడుతున్నాడో తనకే తెలియని స్థితి. గౌతమ్ ముఖంనిండా స్వేదబిందువులు అలుముకుపోయాయి.

"నాకు తెలిసినవాడు కాకపోతే మూగవా డైనా సరే కుంటివాడైనా సరే గుడ్డివాడైనా సరే మీరేడిపిస్తారన్నమాట! ఛీ! మనిషి జన్మ ఎత్తేక మానవత్వం వుండాలండీ! ఎదుటివ్యక్తి అంగ వైకల్యాన్ని అవహేళన చేసి వినోదించడం కుసంస్కారం మాత్రమే కాదు... పశుతుల్యులు చేసే పని! ఛీ... అందరూ చెబుతుంటే ఏంటోలే అనుకున్నానేగాని మీరు మరీ ఇంత శాడిస్ట్ అనుకోలేదు. వెళ్ళండిక్కడ్నించి..." అని గసిరిపారేసి బుడతడ్ని వెంటబెట్టుకుని అనూహ్య విసవిసా వెళ్ళిపోయింది అక్కణ్ణించి. అదే రోడ్డుగుండా ముందుకు వెళ్ళి పక్కగల్లీలో కి తిరిగి కనుమరుగైపోయిందామె.

గౌతమ్ చేష్టలు దక్కి నిలబడిపోయేడు.




గుండెలో బండలు పేలుతున్న భావన.

మనసుని పకోడీలు వేయించినట్టు నూనెలో వేపుకున్నంత బాధ.

ముఖంలో ప్రేత కళ!

"అయిపోయిందిరా గౌతమ్ అయిపోయింది. నీ ఆశల హర్మ్యాలన్నీ పునాదుల్తోసహా కూలిపోయినట్టే. నో బడీ కేన్ సేవ్ యూ. అనూహ్య హృదయంలో నీ స్థానం గొంగళి పురుగుకన్నా హీనమైపోయింది. ఇహ నిన్నామె ప్రేమించటం కల్ల..." అంతరాత్మ చెవిలో నోరెట్టి అరుస్తూంటే వుండేలు దెబ్బతిన్న పక్షిలా గిజగిజలాడిపోయేడు గౌతమ్.

"నో... అలా జరగటానికి వీల్లేదు" అనుకున్నాడు బాధగా.

అంతవరకూ గౌతమ్‌వేపు ఎగాదిగా చూస్తూ మవునంగా నిలబడ్డ సుబ్బారావ్ నెమ్మదిగా నోరు విప్పాడు.

"బాధ పడుతున్నావా? ఇప్పుడు బాధపడ్తే ఏంలాభం? ఎన్నిసార్లో నెత్తీ నోరూ మొత్తుకుని చెప్పేన్నేను. నీ బుద్ధి మార్చుకోరా అని. విన్నావా? హుఁ... ఇప్పుడు చూడేమైందో? నీ ఆకతాయితనంవల్ల ఆమె హృదయంలో నువ్వొక హీనుడివైపోయావు. చేతులు కాలాక ఆకులు పట్టుకున్నట్టు ఇప్పుడెంత విచారిస్తే మాత్రం ఒరిగేదేమిటి?"

సుబ్బారావ్ అలా అంటుంటే గౌతమ్ తట్టుకోలేకపోయాడు- "వొద్దురా... శపించినట్టుగా అంతలేసి మాటలనకురా..." దాదాపు ఏడుస్తున్నట్టు అన్నాడు. "అనూహ్య ప్రేమ నాకు దక్కనినాడు ఐ విల్ బి నోమోర్! నేను బ్రతకలేనురా... బ్రతకలేనురా..."

'ప్రేమ ప్రకోపంవల్ల అలా అంటున్నాడే తప్ప, ఆమె లేకపోతే వీడు బ్రతకలేకపోవడం ఏంటి? గాడిదగుడ్డు. ఇన్నాళ్లూ బ్రతకలేదా?' అనుకున్నాడు సుబ్బారావ్ మనసులో.

'బ్రతకలేకపోతే చావు' అందామనుకున్నాడు పైకి. కానీ మరీ అంతమాట అనడానికి నోరు రాకపోవడంతో "నీ చేతుల్తో నువ్వే నీ కొంపకి నిప్పెట్టుకున్నట్టయ్యింది. నడిరోడ్డు మీద శోకాలొద్దు. ఆలోచిస్తే ఏదో ఒక ఉపాయం తోచకపోదు. ఇంట్లోకి పద" అనేసి వెనుదిరిగాడు. ఆ స్థితిలో ఇళ్లవేట కార్యక్రమాన్ని తాత్కాలికంగా వాయిదా వేసేయటమే బెటరనిపించింది అతనికి.

"ఆలోచించరా త్వరగా ఆలోచించు. నా మనసులో అగ్నిపర్వతాలు బద్దలైపోతున్నాయ్. నేనీబాధను భరించలేను. నా అనూహ్య దృష్టిలో నేను మళ్లీ మంచివాణ్ణయిపోవాలంటే ఏంచేయాలో త్వరగా ఆలోచించు. నీ మేధాశక్తినంతా ఉపయోగించి ఏదైనా తిరుగులేని ఉపాయం ఆలోచించు..." ఇంట్లో తిరిగి కాలు పెట్టిన వెంటనే సుబ్బారావ్‌ని చుట్టుకుపోతూ వలవలా ఏడ్చేసినంత పనిచేశాడు గౌతమ్.

లాగిపెట్టి ఒక్కటి తన్నాలనిపించింది సుబ్బారావ్‌కి. కానీ బాధలో వున్నాళ్లే పాపమని ఆ పని చేయలేదు.

అవును మరి. సంవత్సరాల తరబడి చేస్తూ వచ్చిన హితోపదేశాన్ని పెడచెవిన పెట్టి కొంప మీదకు తెచ్చుకున్న సన్నాసి వెధవమీద కోపంగాక ముద్దొస్తుందా ఎవరికైనా?

"నా బుర్రేం ఉపాయాల పుట్టకాదు ఇప్పటికిప్పుడు ఉపాయం తట్టెయ్యడానికి. నెమ్మది మీద ఆలోచిస్తాలే" అన్నాడు ఒకింత చిరాగ్గానే.

"అంతవరకూ నేనీ క్షోభని భరిస్తూనే వుండాలా?" బేలగా అన్నాడు గౌతమ్.

"చేసుకున్నవాడికి చేసుకున్నంత. అనుభవించక తప్పుతుందా? అనుభవించు..." అన్నాడు కఠినంగా సుబ్బారావ్.

ఆ సమయంలో అలా కఠినంగా మాట్లాడకపోతే గౌతమ్ మరీ టూమచ్‌గా సతాయించేస్తాడని అతని భయం.

గౌతమ్ ఇంకేమీ మాట్లాడకుండా వెళ్లి మంచానికడ్డంగా ఒరిగిపోయాడు.

'తిక్క తిన్నగా వదిలింది వెధవకి' అనిపించింది సుబ్బారావ్‌కి. కానీ మళ్లీ అంతలోనే బోలెడంత జాలి కూడా వేసింది.

ఎంతయినా గౌతమ్ అతని ప్రాణమిత్రుడాయె. ప్రాణమిత్రుడి ప్రేమకు గండిపడినప్పుడు ఆ మాత్రం జాలిపడకుండా ఎవరు మాత్రం వుండగలరు?

★ ★ ★

ఓ గంటన్నరసేపటి తర్వాత-

ఇంకా అలాగే మంచానికడ్డంగా ఒరిగి పోయి వున్న గౌతమ్‌ని- "రేయ్ ఆఫీసుకి టైమవుతోంది లే... లే..." అంటూ లేపబోయా డు సుబ్బారావ్.

గౌతమ్ అప్పటికే తలగడ దిండులోకి అదు ముకుపోయి వున్న ముఖాన్ని మరింతగా అది మేసుకుంటూ బాధగా అన్నాడు-

"ఇంకేం ఆఫీసురా నా బొందాఫీసు. ఆఫీసు కెళ్లి అక్కడ నా అనూహ్యాకి మళ్లీ నా ముఖం ఎలా చూపించమంటావురా?"

"రోజూ ఎలా చూపిస్తున్నావో అలాగే చూ పించు. అక్కడికి ఇన్నాళ్ళూ నీమీద ఆవిడకేదో సదభిప్రాయం వున్నట్టు ఎందుకలా ఇదైపో తావ్?" గౌతమ్ వీపుమీద చరుస్తూ కాలర్ పుచ్చుకుని అతన్ని పైకి గుంజేడు సుబ్బారావ్.

లేచికూచున్న గౌతమ్ కణతలు రుద్దు కుంటూ అన్నాడు-

"ఆలోచించీ ఆలోచించీ నా బుర్ర పాడైపో యిందే తప్ప, ఆ ప్రశ్నకి మాత్రం సమాధానం దొరకటం లేదురా"

"ఏ ప్రశ్నకి?"

"అదేరా... ఆ సమయంలో అసలనూహ్యా అక్కడికి రావడం ఏంటి?"

సుబ్బారావ్ ముసిముసిగా నవ్వుకున్నాడు మనసులో.

"అవున్రా... నాకూఅదే తోచట్లేదు" అన్నాడు పైకి ముఖాన్ని అమాయకంగా పెట్టి.

"ఆ బుడతడు మన ఎదురింట్లోంచి కదా బైటికొస్తా? సో... అనూహ్యాకి మన ఎదురింటివా ళ్ళు బాగా తెలిసినవాళ్ళన్నమాట మరంతే గదా, ఆ బుడతణ్ణి వెంటపెట్టుకుని ఎక్కడికో తీస్కెళ్లిందీ అంటే వాళ్లూ వీళ్లూ ఖచ్చితంగా ఫేమిలీ ఫ్రెండ్స్ అయివుంటారు. ఏరా అంతే నంటావా?" అన్నాడు గౌతమ్ లేచినిలబడి సుబ్బారావ్ భుజాలమీద చేతులు వేస్తూ.

'అసలు విషయం చెప్తే వీడు ఆనందంగా గుండాగి చస్తాడేమో' అనుకున్నాడు సుబ్బా రావ్ మనసులో.

కానీ ఆ అసలు విషయాన్ని (?) అప్పుడే చెప్పటం ఇష్టంలేక "ఆఁ... ఆఁ... అంతే అయివుండొచ్చు" అన్నాడు పైకి.

గౌతమ్ రెండు చేతుల్తో చెంపలు రుద్దు కుంటూ అడిగాడు-

"అద్సరే... ఇన్నాళ్లూ నేను గమనించనేలే దు. ఇంతకీ మన ఎదురింట్లో ఎవరుంటున్నా ర్రా?"

"ఏమో నాకు మాత్రం ఏం తెలుసు?"

"కానీ ఇప్పుడు తెలుసుకుని తీరాల్సిన అవసరం ఏర్పడిందిరా. ఎందుకంటే ఆ ఫామి లీని మంచి చేస్కుని వాళ్లద్వారా నెమ్మదిగా నా అనూహ్యాలోని దురభిప్రాయాలన్నిట్నీ తొలగిపో యేలా చేస్కోవచ్చుగా?" అన్నాడు ఆశగా గౌ తమ్.

అంతవరకూ ఆఫీసుకెళ్ళేటప్పుడు దార్లో నిదానంగా చెబుదాంలే అనుకుంటూ వచ్చిన సుబ్బారావ్ ఎందుకోగాని సడన్‌గా మనసు మార్చేసుకుని అసలు విషయం చెప్పడానికి సిద్ధపడిపోయాడు.

"హియర్ ఈజ్ ఎ గుడ్‌న్యూస్ ఫర్ యూ" ఊరించిగాని చెప్పడం ఇష్టంలేక అంతమట్టు కే చెప్పి ఆగాడు.

"గుడ్‌న్యూసా? శుభవార్తా? ఏంట్రా అది?" ఆత్రంగా అడిగాడు గౌతమ్.

"గుడ్‌న్యూసంటే అలాంటి ఇలాంటి గుడ్ న్యూస్ కాదు. చెప్తే ఎగిరి గంతేస్తావ్!"

"అబ్బ... వెధవ ఊరింపు చాల్లేగాని తొంద రగా చెప్పేడవరా" విసుక్కున్నాడు గౌతమ్.

ఇంతకీ అసలు సంగతేమిటంటే గౌతమ్ మంచానికడ్డంగా ఒరిగిపోయి దిండులో తల దూర్చి పడుకున్న సమయంలో సిగరెట్లు తెచ్చుకోవడానికని బైటికెళ్లాడు సుబ్బారావ్.

అతనింట్లోంచి కాలుబైట పెట్టీపెట్టగానే ఎదురింటి వరండామీద బుడతడి పక్కన నిలబడి వున్న అనూహ్యా కనిపించింది అతని కి.

అనూహ్యా ఇక్కడుండటం ఏమిటి? బుడత డికీ ఆమెకీ ఏమిటి సంబంధం? అసలు ఇంట్లో ఎవరుంటున్నారు? ఇత్యాది ప్రశ్నలన్నీ ఒక్కసారిగా మెదడ్ని కుదిపివేయడంతో సిగరె ట్ల సంగతి మర్చిపోయి గౌతమ్‌ని లేపి ఆ విషయం చెబుదామన్న ఉద్దేశంతో తిరిగి





ఇంట్లోకి రాబోయేడు సుబ్బారావ్.

అదే సమయానికి శ్రీరామ్మూర్తి వీళ్ల వరండా మీదకి రావడంతో అక్కడే ఆగిపోయి ఆయన్ని అడిగి చూశాడు- "మన ఎదురింట్లో ఎవరుంటున్నారండీ?" అని.

అప్పటికి అనూహ్యా ఇంకా ఆ వరండామీదే వుండటంవల్ల శ్రీరామ్మూర్తి సుబ్బారావ్‌వైపు కాస్త అనుమానంగా చూశాడు- 'ఆ అందమైన అమ్మాయిని చూసి రిమ్మతెగులు రేగిందా నాయినా? అందుకేనా ఆరాలడుగుతున్నావ్?' అన్నట్టు.

అది గమనించిన సుబ్బారావ్- "అహఁ... మరేం లేదండీ. ఆ అమ్మాయి మా గౌతమ్ వాళ్ల కొలీగ్! అందుకని అడుగుతున్నా- ఇక్కడుందేమిటా అని?" అన్నాడు సంజాయిషీ ఇస్తున్న ధోరణిలో.

అప్పుడు శ్రీరామ్మూర్తి 'అలాగా' అన్నట్టు తలతాటించి చెప్పాడు.

"ఇక్కడుండక మరెక్కడుంటుందయ్యా. అదే వాళ్లిల్లు"

"అబ్బే లేదుసార్... వాళ్ళిల్లు సనత్‌నగర్‌లో. వాళ్లన్నయ్య రాజశేఖర్ దగ్గరుంటోందా అమ్మాయి" అన్నాడు సుబ్బారావ్, శ్రీరామ్మూర్తి తప్పు చెబుతున్నాడనుకుని.

"ఇంతకుముందు అక్కడుండేవాళ్లేమో ఆ సంగతి నాకు తెలియదు. కానీ నిన్న మధ్యాహ్నంనుంచి మాత్రం వాళ్ళు ఈ ఇంట్లోనే వుంటున్నారు. అంతకుముందు అందులో అడ్వకేట్ మాధవ్‌రావ్ వుండేవాడు. అతను ఖాళీ చేసేశాక వీళ్లు దిగేరు" ఏ కళనున్నాడో గాని శాంతంగా వివరంగా చెప్పేడు శ్రీరామ్మూర్తి.

"నిజంగానా సార్...?" సంతోషంగా అడిగేడు సుబ్బారావ్- "నిజంగా రాజశేఖర్‌వాళ్లు ఆ ఇంట్లో దిగేరా?"

ముక్తసరిగా- "అఁ..." అనేసి గబగబా లోపలికెళ్లిపోయాడు శ్రీరామ్మూర్తి. 'ఎంతయినా కుర్రబుద్ధులు కుర్రబుద్ధులే. ఎదురింట్లో అందమైన అమ్మాయుందని తెలియగానే ఎంత సంతోషమో చూడు' అని లోలోన అపార్థం చేస్కుంటూ.

అసలు సంగతి అతనికేం తెలుసు పాపం?

సుబ్బారావ్ గౌతమ్‌ని లేపి అప్పటికప్పుడే ఆ విషయాన్ని చెప్పేద్దామనుకున్నాడు ముందు.

కానీ అంతలోనే ఆఫీసు కెళ్ళేటప్పుడు దార్లో చెప్తే సర్‌ప్రైజింగ్‌గా వుంటుందికదా అనిపించి ఆ ప్రయత్నం మానుకున్నాడు.

అదీ సంగతి.

గౌతమ్‌ని మరి కాస్సేపువూరించి చివరికెలాగైతేనేం చెప్పేశాడు సుబ్బారావ్ ఆ శుభవార్త.

అంతే... పట్టరాని ఆనందంతో గౌతమ్ విరుచుకుపడిపోయాడు మళ్లీ మంచానికడ్డంగా.

'కొంపదీసి వీడికి స్పృహ తప్పేసిందా ఏంటి?' అని సుబ్బారావ్ కంగారుపడిపోయాడు.

కానీ నిజానికి గౌతమ్‌కి నిజంగా స్పృహ తప్పలేదు. టన్నులకొద్దీ ఆనందం ఒక్కసారిగా గుండెల్లో నిండిపోవడంవల్ల అలా విరుచుకుపడిపోయాడంతే

"రేయ్ గాడిదా... ఏంటలా పడిపోయావ్?" కంగారుని కంఠంలో కూడా ధ్వనింపజేస్తూ మిత్రుణ్ణి భుజాలు పట్టుక్కుదిపేస్తూ అడిగాడు సుబ్బారావ్.

"ఇది పడిపోవడం కాదురా పిచ్చి సన్యాసి... నా అనూని నాకింత చేరువ చేసిన ఆ కనిపించని భగవంతుడికి సాగిలపడి మొక్కటం అన్నమాట" అంటూ దిగ్గున లేచి కూర్చుని- "వూరిస్తే ఊరించేవ్‌గాని మొత్తానికి ఎంత మంచి వార్త చెప్పేవురా" అన్నాడు గౌతమ్ పరవశంగా.

"మరేంటనుకున్నావ్ నేనంటే?" అన్నట్టు గర్వంగా తలెగరేసి- "సర్లే...సర్లే... ఆఫీస్‌కి టైమైంది. ఇంక లేచి తయారవ్" అనేశాడు సుబ్బారావ్.

గౌతమ్ అమాయకత్వానికి సుబ్బారావ్ కాసమయంలో మనసులో జాలేసింది.

అవును మరి. లేకపోతే ఏమిటి? మరో నాలుగైదురోజుల్లో ఆ ఇల్లు ఖాళీ చేసేయక తప్పదని తెలిసి కూడా గౌతమ్ అలా మురిసిపోవడం అర్థరహితమేకదా.



ఆమాటే అందామనుకున్నాడుగాని, పోన్లే వెధవని కాస్సేపిలాగే సంబరపడనిలే అని పించి ఊరుకున్నాడు సుబ్బారావ్.

* * *

అదేరోజు

లంచవర్లో అనూహ్యా ఒంటరిగా వున్నప్పుడు ఆమె టేబుల్ దగ్గరికెళ్లి నిలబడి- "అయామ్ సారీ అనూహ్యగారూ... పొద్దున్న జరిగిన దానికి నేను చాలా సిగ్గుపడుతున్నాను. నన్ను క్షమించండి" అన్నాడు గౌతమ్ చాలా సిన్సియర్‌గా. ఎంత సిన్సియర్‌గా అన్నాడు అంటే సిన్సియర్ 'మంచి బాలుడు సోమూ' టైపులో చేతులు కూడా కట్టుకున్నాడు.

అదే అతను చేసిన పొరపాటు. ఎందుకంటే అతని ఫోజూ అదీ చూస్తుంటే అనూహ్యకాసమయంలో 'అతివినయం ధూర్త లక్షణం' అనే సామెత గుర్తుకొచ్చిందే తప్ప ఆ సిన్సియారిటీ నిజమైనదిగా అనిపించలేదామెకి.

అదంతే మరి. ఒక మనిషిమీద బేడ్ ఒపీనియన్ కలిగేక అదంత తేలిగ్గా తుడిచిపెట్టుకుపోతుందా ఎవరికైనా?

"జరిగిందేదో జరిగింది. దానికిప్పుడు మీ సంజాయిషీగాని, క్షమాపణలుగాని ఎవరడిగేరు?" అంది కఠినంగా.



"మీరడిగేరని కాదనూహ్యాగారూ... నా ప్రవర్తనమీద నాకే ఏవగింపు కలిగి పశ్చాత్తాపంతో మనసు దహించుకుపోతూండటంవల్ల నా అంతట నేనే చెబుతున్నానన్నమాట. మీరు మా ఎదురింట్లో దిగారటకదా? చాలా సంతోషం. మా ఎదురింట్లో వుంటున్న మీకు నామీద చెడు అభిప్రాయం ఏర్పడటం మంచిది కాదుకదా? అందుకు..."

"ఎవరికి మంచిది కాదు? ఎందుకు మంచిది కాదు?" గౌతమ్ మాటల్ని మధ్యలో ఖండిస్తూ ఉరిమి చూసింది అనూహ్య.

బెదిరిపోయాడు గౌతమ్- "నా... నా... నాకే" అన్నాడు నంగినంగిగా.

-"ఎందుకని?" లోలోన పళ్ళు కొరుకుతూ అడిగింది.

గౌతమ్‌కి ఏం చెప్పాలో, ఎలా చెప్పాలో తోచలేదు.

'ఎందుకేంటండీ? నేను మిమ్మల్ని ప్రేమిస్తున్నానుకదా? అందుకు అని చెప్పేస్తే ఎలా వుంటుంది?' అనిపించిందో క్షణం.

కానీ అంత సాహసం చేయలేకపోయాడు. చెంప మైసూర్ బజ్జీలా పొంగిపోయేట్టు చెప్పుతో కొట్టించుకోవటం అతనికి సరదానా ఏంటి?

"మాట్లాడరేం? మీ వరస మొదట్నుంచీ చూస్తున్నాను. ఎందుకు పద్దాకా నాతో కల్పించుకుని మాట్లాడాలని చూస్తుంటారెప్పుడూ? మనసులో ఏవైనా పిచ్చి పిచ్చి ఊహలు పెంచుకుంటున్నారేమో. ఆ త్రిలోక్‌గాడికి ఏ గతిపట్టిందో తెలుసుగా?"

అనూహ్య అలా అడుగుతుంటే కడుపులో చెయ్యిపెట్టి కెలుకుతున్నట్టుగా అనిపించింది గౌతమ్‌కి.

'ఎలా విన్నవించుకోను అనూ? నా బాధని నీకెలా విన్నవించుకోను? నా హృదయాన్ని నీకెలా విప్పి చెప్పను?' అనుకున్నాడు ఆవేదనగా.

"అదికాదండీ..." అంటూ ఏదో చెప్పబోయాడు. కానీ అనూహ్య అతని మాటలు సాగనివ్వలేదు.





"ఏది కాదు?" అంటూ ఈసడింపుగా చూసి - "చెప్పిన క్షమాపణలు చాల్లేగాని వెళ్ళి మీ సీట్లో కూర్చోండి! ఏదో మొదటిసారికదా అని వూరుకున్నాను. ఇంకోసారి గనుక మా శ్యాంబాబుని మళ్ళీ ఎగతాళి చేసినట్టు కనిపిస్తే మర్యాదగా వుండదు" అని వార్నింగిచ్చింది అనూహ్య.

"శ్యాంబాబా? ఓహో... అయితే ఆ బుడతడి పేరు శ్యాంబాబన్నమాట?!" అన్నాడు గౌతమ్ సిగ్గులేకుండా. ప్రేయసేకదా, ప్రేయసి దగ్గర సిగ్గెందుకులే అనుకున్నాడో ఏమో మరి!

అనూహ్య ఎర్రగా చూసింది. "బుడతడేంటి బుడతడు? ఇంతకీ వాడెవరనుకుంటున్నారు? మా అన్నయ్య కొడుకు... తెల్సా?"

గౌతమ్ ఏదో తప్పు చేసినవాడిలా చప్పున లెంపలేసుకుంటూ "ఏంటేంటి ఆ బుజ్జిగాడు మీ అల్లుడా? నేనింకా నిజంగానే మీకు తెలిసిన కుర్రాడంతేనేమోననుకున్నాను. అలాగాండీ? మీ అల్లుడా అండీ? అయితే అయామ్ రియల్లీ సారీ అండీ! పొద్దున్నేదో నోరుజారి అలా అనేశానన్నమాటే గాని, అప్పట్నుంచి నాకు ఒకటే బాధగా వుందండీ..." అని మళ్ళీ పాత రాగాన్నే తిరిగి ఆలపించాడు.

"బుజ్జిగాడూ లేదు గజ్జిగాడూ లేదు. వెళ్లండిక్కణ్ణుంచి. మరొక్కమాట గాని అధికంగా మాట్లాడేరో నేను మన మేనేజర్‌తో కంప్లయింట్ చేయాల్సొస్తుంది" అని - 'ఆపైన మీ ఇష్టంమరి' అన్నట్టుగా చూసింది అనూహ్య. ఆమెకి చాలా స్పష్టంగా అర్థమైపోయింది గౌతమ్ అంతర్యం ఏమిటో.

అతగాడు తనని ఆకర్షించాలని చూస్తున్నాడు. లేకపోతే ఎందుకలా ఇదైపోతాడు? జరిగిందేదో జరిగిపోయిందిలే అని వూరుకోక అంతిదిగా క్షమాపణలూ గట్రా చెప్పుకోవాల్సిన అవసరమేముంది?

నో డవుట్. ఇది ఖచ్చితంగా ఆ బాపతు వికారమే! ఏదోకరకంగా తనని ప్రసన్నురాల్ని చేస్కోవాలని చూస్తున్నాడు.

తను గనుక ఏమాత్రం మెత్తబడినా 'ఐ లవ్ యూ' అని ఖచ్చితంగా అనేస్తాడు. అందులో అనుమానానికి తావే లేదు.

ఇలాంటి చీడని మొదట్లోనే తుంచేయడం మంచిది.

# ఇరువిధాలా లాభపడండి.
# యులిప్ చేపట్టండి.

తక్కువ
ఖర్చుతో మీకవసరమైన
భీమా రక్షణ.



తప్పనిసరిగా
మీరు కోరే అధిక
ప్రతిఫలాల అర్జన.

యూనిట్ లింక్‌డ్ ఇన్సూరెన్స్ ప్లానులో మీరు పెట్టుబడి పెట్టినప్పుడు, నామమాత్రమైన ప్రీమియంపైన మీకు జీవిత భీమా రక్షణ లభిస్తుంది. అది కూడా వైద్య పరీక్ష లేకుండానే. ఇంకా, రు. 15,000 దాకా ప్రమాదాల భీమా రక్షణ కూడా లభిస్తుంది.

అంతేననుకున్నారేమో. యులిప్‌ని ఇంకా మరింత ఆకర్షణీయంగా చేసేది, ఏటేటా పెరుగుతూ, పునః పెట్టుబడి పెట్టబడే డివిడెండ్లు. గత సంవత్సరం డివిడెండు 14.5%. దీనికి తోడుగా, పరిణతి సమయంలో బోనస్ కూడా. 10 ఏళ్ల ప్లానులో 5%, 15 ఏళ్ల ప్లానులో 7.5% మీరందుకుంటారు.

**ఇక పన్ను రాయితీల మాటేమిటి?**

యులిప్ క్రింద మీరు కట్టే మొత్తానికి, ఆదాయం పన్ను చట్టం సెక్షన్ 88 క్రింద ఆదాయం పన్ను రాయితీ లభిస్తుంది. రు. 13,000 దాకా డివిడెండ్లపైన కూడా సెక్షన్ 80 L క్రింద రాయితీ లభిస్తుంది.

**ప్లాను వివరాలు**

వయస్సు : ఈ ప్లానులో చేరడానికి కనీస వయస్సు ఇప్పుడు 12 ఏళ్లు. గరిష్ఠ వయస్సు 10 ఏళ్ల ప్లానుకు 55½ ఏళ్లు. 15 ఏళ్ల ప్లానుకు 50½ ఏళ్లు.

టార్గెట్ మొత్తం : రు. 6,000 నుంచి రు. 60,000.

వ్యవధి : మీకనువైన వ్యవధి ఎంచుకోవచ్చు—10 ఏళ్లు లేదా 15 ఏళ్లు.

ఉచిత సమాచారానికై ఏ యూనిట్ ట్రస్ట్ కార్యాలయం వద్దగానీ, ముఖ్యప్రతినిధి లేదా ఏజెంటు వద్దగానీ, ఏ పంచవటి సూపర్ మార్కెట్ దుకాణం వద్దగానీ సంప్రదించండి.




**యూనిట్ ట్రస్ట్ ఆఫ్ ఇండియా**
ఒక కోటి పైగా యూనిట్ హోల్డర్ల సేవకై అంకితం.

## యూనిట్ లింక్‌డ్ ఇన్సూరెన్స్ ప్లానులో పెట్టుబడి పెట్టండి.

సెక్యూరిటీ పెట్టుబడులన్నిటి మీద మార్కెట్ రిస్కు ఉంటుంది. పెట్టుబడి పెట్టే ముందుగా మీ పెట్టుబడి సలహాదారుడుగానీ, ఏజెంటుగానీ తప్పక సంప్రదించండి.

---

మండల కార్యాలయము : 45, సెకండ్ లైన్ బీచ్, మద్రాసు 600 001. ఫోన్ : 587433, 562257.
శాఖా కార్యాలయము : విజయవాడ : 29-3-12, వెంకటేశ్వరరావు వీధి, ఆప్కో భవన్ దగ్గర, వెస్ట్ ఆఫ్ రహమాన్ పార్క్, గవర్నర్‌పేట, విజయవాడ 520 002, ఫోన్ : 63964 □ హైదరాబాదు : 203/204, మొఘల్ కోర్ట్ కాంప్లెక్స్, రెండవ అంతస్తు; బషీర్‌బాగ్, హైదరాబాదు 500 001, ఫోన్ : 240030.
ఆంధ్రప్రదేశ్‌లో మా ముఖ్య ప్రతినిధులు : □ ఆదిలాబాద్ : సన్‌వల్ రామ్‌సా, సిరిపూర్, కాగజ్ నగర్, ఫోన్ : 91 (పి.పి.) □ అనంతపూర్ : వి.యల్. నారాయణ, ఫోన్ : 22196 □ కడప : ఎ.ఆర్. కృష్ణారెడ్డి, ఫోన్ : 2701 □ కర్నూలు : టి. సీతారామయ్య, ఫోన్ : 22335 (పి.పి.) □ కరీంనగర్ : శ్రీమతి టి. అహల్యా శ్రీనివాస్ ఫర్టిలైజర్ సిటీ, ఫోన్ : 312 □ ఖమ్మం : జి. అమరనాథ్, ఫోన్ : 8711-8709 □ గుంటూరు : కే.వి. తిలక్, ఫోన్ : 24964, 31839 □ చిత్తూరు : పత్తి చంద్రయ్య, తిరుపతి, ఫోన్ : 22176 □ తూర్పు గోదావరి : పి. వెంకటరమణ, కాకినాడ, ఫోన్ : 76047 □ నల్గొండ : యమ్. శంకర్‌గుప్తా, సూర్యాపేట, ఫోన్ : 545 □ నిజామాబాద్ : డి. నర్సయ్య, హెచ్. నెం. 5-5-18, తహసిల్ ఆఫీసు రోడ్డు వెనుక, ఖలీల్‌వాడీ, నిజామాబాద్ 503 003 □ నెల్లూరు : ఏ. సత్యనారాయణ, ఫోన్ : 22002 □ పశ్చిమ గోదావరి : వై. సోమసుందరరావు, తణుకు, ఫోన్ : 2440 □ ప్రకాశం : యమ్.వి. రమణయ్య, ఒంగోలు, ఫోన్ : 3337; 3244 □ మహబూబ్‌నగర్ : యన్. వెంకటనారాయణ, హెచ్. నెం. 10-87, టి.ఆర్. కాంపౌండ్, జడ్చర్ల 509 301 □ మెదక్ : పి.వి. కృష్ణారెడ్డి, ఫోన్ : 2820 □ రంగారెడ్డి : యస్. వీరరాఘవులు గోవిందకృప, 26-75, సఫిల్‌గూడా, సికింద్రాబాద్ 500 047 □ వరంగల్ : టి.యస్.యన్. మూర్తి, ఫోన్ : 8631 □ విజయనగరం : యం.యస్.యన్. శర్మ, ఫోన్ : 2461 □ విశాఖపట్టణం : సి. నారాయణస్వామి, ఫోన్ : 63116.

Sista's UTI 1759 91 TE B

ఆమె ఆలోచనలు ఆ ఏంగిల్‌లో పరిగెడుతున్నాయని గౌతమ్‌కేం తెలుసు? వస్తుతః నిప్పులాంటి ఆడది కాబట్టి అలా గసురుతోందంతేలే అనుకున్నాడంతే!

తాడుని తెగేదాకా లాగడం మంచిది కాదన్నారుకదా పెద్దలు? పెద్దల మాట చద్దిమూట కదా? కాబట్టి పాటించడం మంచిది కదా? అనిపించి - "సారీ అండీ" అంటూ నమస్కరించి అక్కణ్ణించి వెళ్ళిపోయి తన సీట్లో కూర్చున్నాడు గౌతమ్.

ఆ నమస్కారాన్ని 'దండాలు తల్లీ దండాలు ఇంకెప్పుడు నీ జోలికి రాన్లే' అనే ధోరణిలో పెట్టిందిగా భావించిందనూహ్య.

'పోరా కుయ్యా' అనేసుకుంది చాలా తేలికభావంతో.

నిజానికి సారీతోపాటు నమస్కారం పెట్టడంలో గౌతమ్ ఉద్దేశం వేరు. "సారీ అండీ. ఇప్పుడు మీ మూడ్ బాగోలేనట్టుంది. వీలును బట్టి మరోసారెప్పుడైనా నా మనసుని విప్పి మీ పాదాలముందు పరుస్తాలే. అంతవరకూ శలవ్" అని ఆమెతో చెప్పినట్టే భావించుకున్నాడతనా సమయంలో. దాన్నేకాబోలు గుండె భాష అంటారు.

అతని గుండెభాష నర్థంచేసుకుని ప్రతిస్పందించాల్సిన అవసరం అనూహ్యకేముంది?

అదీగాక గుండెభాష అందరికీ అర్థం కాదాయె!

★ ★ ★

అనూహ్యకి శ్యాంబాబంటే పంచప్రాణాలు. ఆమె కళ్ళముందు పుట్టిపెరిగినవాడు ఆ బుడతడు. అదీగాక అన్నకొడుకాయె! మరీ ముఖ్యంగా నోరులేనివాడాయె!

శ్యాంబాబుకి తల్లిదగ్గిరకంటే అనూహ్యదగ్గిరే మాలిమి ఎక్కువ.

వాడికి తల దువ్వాలంటే అత్తే! స్నానం చెయ్యించాలంటే అత్తే! బట్టలు తొడగాలీ అంటే అత్తే! వాడికి సంబంధించిన ఏ పనైనా అత్తే చేసితీరాలి. 'అత్తా' అని పిలవడానికి పాపం నోరు లేకపోయినా, అనూహ్య ఇంట్లో వున్నంతసేపూ ఆమె చెంతనే వుంటాడు వాడు.

అనూహ్య వదిన నీలమణి అనూహ్యని ఓ ఆడపడుచులా చూడదు. సొంత చెల్లెల్లా చూస్తుంది. అందుక్కారణం ఒకరకంగా శ్యాంబాబే! అవునుమరి... తన బిడ్డడ్ని తనకన్నా మిన్నగా ప్రేమించే మరదల్ని ఏ వదిన మాత్రం అభిమానించకుండా వుండగలుగుతుంది?

"శ్యాంబాబు పుట్టింది నా కడుపునే అయినా నిజానికి వాడు నీ బిడ్డడే అనూహ్యా! నువ్వు వాణ్ణి చేరదియ్యడమూ అలాగే వుంది. వాడు నీకు చేరికవ్వడమూ అలాగే వుంది! రేప్పొద్దున్న నీకు పెళ్ళై నువ్వత్తారింటికి వెళ్ళిపోతే వాడు నీమీద ఎంత బెంగపెట్టుకుంటాడో" అని తరుచుగా వాపోతూంటుంది నీలమణి.

"పెళ్ళయినంతమాత్రాన పండూని వదిలేసిపోతానా వదినా? నేనెక్కడున్నా వీడు నా పక్కనుండాల్సిందే" అంటుంది అనూహ్య.

"అ వచ్చేవాడు అందుకొప్పుకోకపోతే?" అని నీలమణి అడిగితే-

"అలా ఒప్పుకోనివాణ్ణి నేనసలు చేసుకోనే చేసుకోనుగా?" అంటుంది అనూహ్య. తమాషాగా కాదు. ఎంతో సీరియస్‌గానూ, సిన్సియర్‌గానూ.

నిజంగానే అనూహ్యకి ఆ పసివాడంటే అంతే ప్రాణం. వాణ్ణి చూసినప్పుడల్లా వాడికి నోరు లేకుండా చేసినందుకు ఆ భగవంతుణ్ణి నిందించకుండా వుండలేదామె.

ఆ రాత్రి నిద్రపట్టక మంచంమీద అటూ ఇటూ దొర్లుతున్న సమయంలో ఎందుకోగాని గౌతమ్ మాటలు గుర్తొచ్చాయామెకు. దాంతోపాటు అతను శ్యాంబాబుని ఎగతాళి చేసిన దృశ్యం కూడా కళ్ళముందు మెదిలింది.

"ఛీ! శాడిస్టు వెధవ! నోరులేని బిడ్డడ్ని పట్టుకుని నానా యాగీ చేసింది చాలక, క్షమించాలంట క్షమించాలి! అసలు మనసులో ఏ దురుద్దేశమూ లేకపోతే ఎందుకలా ప్రాధేయపడ్డాడు? త్రిలోకగాడు ఆ లెటర్ రాసిన్నాడు పెద్ద హీరోలా ప్రవర్తించేశాను కదా అని మిడిసిపడుతున్నాడేమో? హుఁ... అలాంటి శాడిస్టునీ కుసంస్కారినీ ఎంత దూరంలో వుంచితే అంత మంచిది" అనుకుందామె ఏవగింపుగా.




"త్రాష్టుడు పైగా ఎదురింట్లోనే తగలడ్డాట్ట! దాన్నానరాగా తీస్కుని వెధవ్వేషాలు వెయ్యబో తాడేమో! అతననుకుంటున్న ఏంగిల్‌లో 'ఇంచి' ముందుక్కదిలినా వూర్కోకూడదు. ఆ త్రిలోక్‌గాడికి చెప్పిందానికన్నా ఎక్కువగానే బుద్ధిచెప్పాలి. ఇతనిక్కూడా ఓ కోటింగ్ పడితే ఆఫీసులో అందరికీ బుద్ధొస్తుంది. ఆపైన నా జోలికి రావడానికి ఏ వెధవా సాహసించడు..." అని కూడా అనుకుందామె. చేతులు దురదగా వుండి కాదు. ఒకరిద్దరిమీద అలా తన ప్రతాపం చూపితే అటుపైన అదే తన పాలిట రక్షణ కవచమవుతుంది కదా అని!

ఆమె హృదయంలోనూ ఆలోచనల్లోనూ తన పొజిషన్ అంత హీనాతిహీనమైపోయిందని పాపం గౌతమ్‌కేం తెలుసు?

అందుకే అదే సమయాన్న అతను ఆమెను గురించి తియ్యతియ్యని కలలు గంటూ (అవిన్నూ ఈస్ట్‌మన్ కలర్‌లో) ఆశాసాగరంలో తేలియాడిపోతూ వున్నాడు.

ఆప్టిమిస్టిక్‌గా వుండటం మంచిదే. కానీ తన ప్రవర్తనలో సవాలక్ష లోటుపాట్లుంచుకుని ఎదుటివ్యక్తి ప్రేమని కాంక్షిస్తే ఎలా?



జేబులోంచి క్యాడ్‌బరీస్ చాక్లెట్‌ని బైటికి తీసి దాన్ని ముద్దుపెట్టుకుంటున్న గౌతమ్‌కేసి ఆశ్చర్యంగా చూశాడు సుబ్బారావ్.

"అదేంట్రా చాక్లెట్‌ని ముద్దాడుతున్నావ్?"

"నా ప్రేమబాటలో ఏర్పడ్డ అడ్డంకుల్ని తొలగించబోతోన్న బుల్‌డోజర్‌రా ఇది!" మరోసారి చాక్లెట్‌ని ముద్దాడి చెప్పాడు గౌతమ్. "దీంతో ముందు ఆ బుజ్జిగాడి హృదయాన్ని కొల్లగొడ్తా! అవసరమైతే రోజుకొకటి కొనిచ్చైనా నారే వాణ్ణి నా ఫాన్‌ని చేసేసుకుంటా! నెమ్మది నెమ్మదిగా వాడిద్వారా నా అనూహ్యకి చేరువైపోతా!"

అర్థమైంది సుబ్బారావ్‌కి గౌతమ్ ప్రణాళిక ఏమిటో.

"దీజ్ ఆర్ ఆల్ ఓల్డ్ ట్రిక్స్. రిజల్ట్ ఫేవరబుల్‌గా వుంటుందని నేననుకోను. అయినా చాక్లెట్లతో కుర్రాణ్ణి దగ్గరికి లాక్కోగలవేమోగాని, నీ విషయంలో వాడు చేయగలిగిందేమీ వుండదు. పాపం వాడికి మాటలు రావుకదా, అనూహ్య దగ్గర నీ గురించి మంచిగా మాట్లాడి పరోక్షంగా సహకరించగలగడానికి?" అన్నాడు పెదవి విరుస్తూ.

"అలా అని కాదురా! వాడ్ని మొన్న ఎగతాళి చేసినందుకు అనూకి నామీద చాలా చాలా కోపం ఏర్పడిపోయింది. అది పోవాలీ అంటే వాడ్ని నేను కూడా ఇలా ప్రేమగా చూస్కోవడం మంచిదికదా?"

"నీ ఇష్టం" అనేశాడు సుబ్బారావ్, 'ఆపితే మట్టుకు ఆగుతాడా?' అనిపించి.

అంతే! చేతిలో చాక్లెట్‌తో రాకెట్‌లా వరండా మీదికి దూసుకుపోయాడు గౌతమ్.

అతని కళ్ళు ఆత్రంగా ఎదురింటికేసి చూశాయ్. అదృష్టవశాత్తూ ఎదురింటి వరండా మీద ఒంటరిగా కూర్చుని వున్నాడు శ్యాంబాబు.

"ఒరేయ్ మాటలు రాని మొద్దు రాచిప్పగాడా ఇలా రా" అని మనసులో అనుకొని - ఆకతాయి తనాన్ని మనసులో కూడా చంపేస్కోవడం అంటే కష్టం కదా? - పైకిమాత్రం ముఖంనిండా చిరునవ్వు పులుముకుని వాడివైపే చూస్తూ చెయ్యూపి పిలిచాడు గౌతమ్.

వాడు బెదురు చూపులు చూస్తూ రానన్నట్టు అడ్డంగా తలాడించేసరికి చేతిలోని చాక్లెట్‌ని వాడికి కనిపించేలా గాల్లో ఆడించాడు గౌతమ్.

అనలే ఒకసారి గౌతమ్ దెబ్బ రుచి చూసి హడలిపోయి వున్నాడేమో, ఆ చెయ్యాడించడాన్ని మరోలా అర్థం చేస్కున్నాడు శ్యాంబాబు. కూర్చున్న చోటునుండి గభాల్న లేచి లోపలికి పరిగెత్తి హాల్లో తల దువ్వుకుంటున్న అనూహ్యకి

సైగలద్వారా చెప్పాడు - "ఎదురింటబ్బాయ్ నన్ను పిలుస్తున్నాడత్తా! రానినేనరికి కొడతా నని బెదిరిస్తున్నాడు" అనే భావం స్ఫురించేలా.

వాడి సైగలభాష ఆ ఇంట్లో అందరికన్నా ఎక్కువగా అనూహ్యకే బాగా తెలును. వాడు సైగద్వారా ఏ విషయం చెప్పినా ఇట్టే గ్రహించ గలుగుతుందామె. అనేక సందర్భాల్లో వాడి సైగల భావని వాడి అమ్మానాన్నలక్కూడా తనే ట్రాన్స్‌లేట్ చేసి చెబుతూంటుందామె! - అంత ఎక్స్‌పర్టు!

వాడు చెప్పింది గ్రహించగానే తేనెపట్టు మీద రాయి విసిర్తే తేనెటీగలు చెలరేగిపోయినట్టు ఆమెలో ఆగ్రహావేశాలు చెలరేగిపోయాయి.

వాడి చెయ్యి పట్టుకుని గబగబా వరండా మీదకొచ్చింది.

శ్యాంబాబు అలా అనూహ్యని వెంటబెట్టుకొస్తాడని ఊహించని గౌతమ్ ఇందాక నిలబడిన చోటులోనే అలాగే వున్నాడింకా.

అనూహ్య వాళ్ళ వరండామీదనుంచి కోపంగా చూసింది గౌతమ్‌కేసి.

ప్రేమ మైకంకదా? ఒళ్ళు తెలవదాయె! ఆమె చూసిన ఆ చూపుని పలకరింపుగా భావించేసి - "ఇహిహి" అన్నాడు గౌతమ్.

ఒళ్ళు మండింది అనూహ్యకి.

"ఇలా వస్తారా?" అన్నట్టు చెయ్యూపి పిలిచింది.

కట్టుకోవడానికి రెక్కలు లేకపోవడంవల్ల ఎగిరి దూక్కుంటూ వెళ్ళేడు గౌతమ్.

"పిలిచేరా అండీ?" అడిగేడు సంబరంగా.

అవునన్నట్టు తలూపి క్రోధంగా చూస్తూ అడిగింది అనూహ్య. "ఏంటి మా వండూనేదో బెదిరిస్తున్నారంట? కొడతానూ? చేస్తానూ అంటున్నారట?"

బిత్తరపోయేడు గౌతమ్. "నేనాండీ?... అబ్బే లేదండీ?! అన్నాడు ప్రాణాలవిసిపోతుండగా.

'హు... ఏంటో, నోరు లేని వెధవలు కూడా కల్పించిచాడీలు చెప్పేయడమే! ఛీ! దునియా గలీజైపోయింది' అనుకున్నాడు మనసులో బాధగా.

"బుకాయించబాకండి! మా వండూ అబద్ధాలు చెప్పడు" ఉరిమింది అనూహ్య.

'నిజాలుమాత్రం చెప్పేడవగలడా ఏంటి మూగవెధవ!' అని మనసులో కసిగా అనుకొని - "అహఁ... అబద్ధం చెప్పటం కాదండీ! అపార్థం చేస్కున్నాడన్నమాట! నేనీ చాక్లెట్ ఇవ్వడానికని పిలిస్తే పొరపాట్న అలా అనుకున్నాడన్న మాట!" అన్నాడు తత్తరపడ్తూ గౌతమ్.

అనూహ్య కళ్ళు ఆగ్రహంతో ఎర్ర గాజుగోళాలయ్యాయి.

"వాడికి చాక్లెట్ ఇవ్వాల్సిన అవసరం ఏమొచ్చింది మీకు? ఏం వాడేమన్నా చాక్లెట్లకి మొహంవాచిపోయి వున్నాడనుకుంటున్నారా?"

"అహఁ అలా అని కాదండీ! బాబుని మొన్న ఏడిపించాసుకదా, దానికి ప్రాయశ్చిత్తంగా అన్నమాట!" తత్తరపాటు తగ్గకపోయినా బుద్ధిగానే చెప్పాడు గౌతమ్.

"మీ బోడి ప్రాయశ్చిత్తాలూ, క్షమాపణలూ ఇక్కడెవరికీ అవసరం లేదు" అంటూ ఈసడింపుగా చూసి - "ఆ చాక్లెట్‌ని ఏ ముష్టికుర్రాడికన్నా ఇవ్వండి సంతోషిస్తాడు" అనేసి శ్యాంబాబుని తీస్కుని లోపలికెళ్ళి దభేల్న తలుపు మూసేసింది అనూహ్య.

"ఏంటమ్మా... ఏమైంది?" అడిగాడు అప్పుడే స్నానం ముగించి బాత్‌రూంలోంచి హాల్లోకొచ్చిన అనూహ్య అన్న రాజశేఖరం.

"ఏంలేదన్నయ్యా!" అనేసింది అనూహ్య - "ఆ వెధవ కొమ్ముల్తొంచడం తనవల్ల కాకపోయినప్పుడుకదా? అనవసరంగా అన్నయ్యతో చెప్పడం దేనికి?" అని అనుకుంటూ.

నీరసించిపోయిన మొహంతో అనూహ్యవాళ్ల వరండామీదనుంచి నెమ్మదిగా కాళ్ళీడ్చుకుంటూ తమ ఇంట్లోకొచ్చివద్ద గౌతమ్‌ని - "ఏమైందిరా?" అని అడిగేడు సుబ్బారావ్.

"మొహంమీద తలుపేసిందిరా!" తొలుదొల్త విచారాన్ని వ్యక్తంచేసి ఆ తర్వాత వివరంగా చెప్పాడు గౌతమ్ జరిగిన సంగతి.

"ఇంకా నయం... లోపలికి పిలిచి వాళ్ళన్నయ్యతో నిన్ను తన్నించలేదు సంతోషించు" అన్నాడు సుబ్బారావ్.




అన్నాడంటే అనడా మరి? గౌతమ్ చేస్తున్న నన్నాసి చేష్టలలా తగలడ్డాయ్ మరి!

★ ★ ★

ఓ గంట తర్వాత మిత్రద్వయం ఆఫీసులకు బయలుదేరబోతుండగా 'రంగంలో నేను న్నానోచ్' అంటూ ఢుంబూ వచ్చి మరోసారి హెచ్చరించి పోయాడు - ఇల్లు ఖాళీ చేయడం గురించి.

వాడు వెళ్ళగానే తల పట్టుక్కూలబడిపోయేడు గౌతమ్.

"ఈ ఆపదనుండి గట్టెక్కడం ఎలారా? ఇన్నాళ్ళూ దారి వేరు. అప్పుడంటే ఎదురింట్లో నా అనూ లేదు కాబట్టి వెధవిల్లు ఖాళీచేసేద్దాంలే అనుకున్నాం. కానీ ఇప్పుడలాక్కాదుగా? ఎదురిల్లు అనబడే దేవాలయంలో నా దేవి వుంటూండంగా మనం ఈ ఇల్లు వదల్లేంకదా?"

'మొహంమీద తలుపేసి పంపినా సిగ్గు రాలేదు వెధవకి. తగుదునమ్మా అని ఇంకా పైత్యప్రకోపంతో మాట్లాడుతున్నాడు!' - అనుకుని "అయినా తప్పదుగా మరి?" అన్నాడు సుబ్బారావ్.

"ఎందుకు తప్పదు? అవసరమైతే నేను పావనిగారి కాళ్ళమీదయినా పడిపోతాను. అంతేతప్ప ఈ ఇల్లుమాత్రం వొదల్ను!" మొండిగా అన్నాడు గౌతమ్.

"వొదల్నంటే కుదరడానికి ఇది నీ బాబుగారిల్లా?" ఎకసెక్కంగా అన్నాడు సుబ్బారావ్. "మరీ పిచ్చేళ్ళా మాట్లాడబాకు. ప్రేమకోసం ఆత్మాభిమానాన్ని సైతం చంపుకుని హవుస్ ఓనర్ కాళ్ళమీద పడిపోతారా ఎవరైనా?"

సుబ్బారావ్ అలా అంటూండగా ఏదో పని మీద అప్పుడే వరండామీద కొచ్చిన పావని ఆ మాటలు విని చాలా చాలా ఘోరంగా, ఘోరంగానే కాదు ఘోరాతి ఘోరంగా కూడా అపార్థం చేసేస్కుని-

"ఏంటి నాయన్లారా ప్రేమకోసం హవుసోనర్ కాళ్ళమీద పడ్డం అంటున్నారు?" అంటూ వినురుగా వీళ్ళ పోర్షన్‌లోకి వచ్చేసింది.

కష్టకాలం దాపురించినప్పుడు ఒక్కోసారి మట్టిబుర్రకైనా సరే అమోఘమైన ఐడియాలు తట్టడం కద్దు! "అబ్బే ఏం లేదక్కయ్యగారూ!" అంటూ దబ్బున ఆమె కాళ్ళ మీద పడిపోబోతున్నవాడిలా ముందుకొంగాడు గౌతమ్.

"ఛఛ... ఏంటిది?" అంటూ రెండడుగులు వెనక్కి వేసింది పావని. గౌతమ్ ఆమెనలా పిలవడం అదే మొదటిసారి. గౌతమ్‌కిగాని సుబ్బారావుగ్గాని ఆమెతో మాట్లాడాల్సిన సందర్భాలు ఎక్కువగా ఎదురుకావు. మరీ తప్పని సరి పరిస్థితిలో మాట్లాడాల్సొస్తే 'ఏవండీ' అంటారే తప్ప, ఇలా వరసలుకలిపి మాట్లాడ్డం ఇంతకుముందు లేదెప్పుడూ. అందుకే పావని ఆశ్చర్యంగా చూసింది గౌతమ్ వేపు.

గౌతమ్ ఉత్తమ విద్యార్థిలా చేతులు కట్టుకు నిలబడి- "సారీ అక్కయ్యగారూ! మేం ఈ ఇల్లు ఖాళీ చెయ్యలేం. దానిక్కారణవేంటో చెప్తాను. ఆ తర్వాత తుదినిర్ణయం మీరే చెయ్యండి" అన్నాడు వినయంగా.

పిలుపులో వచ్చిన మార్పు, ఇల్లు ఖాళీ చెయ్యలేం అని తెగేసినట్టు చెప్పడం... ఇదంతా పావనికి చాలా ఆసక్తికరంగా అనిపించింది.

"సరే...చెప్పు" అన్నట్టు తల తాటించింది.

'కూర్చోండక్కయ్యగారూ" అంటూ ఆమెకు కుర్చీచూపించి, కూర్చున్నాక చెప్పడానికి గొంతు సవరించుకున్నాడు గౌతమ్.

"వీడు ఏం వాగి ఏంకొంపముంచుతాడో?'నన్న భయం లోలోన వున్నా అసలేం చెప్పబోతున్నాడన్నది బొత్తిగా తెలీకపోవడంవల్ల సుబ్బారావ్‌కి మౌనంగా వుండిపోవడం మినహా చేయగలిగిందేమీ కనిపించలేదు.

గొంతు సవరించుకునే నెపంతో మాటలు కూర్చుకున్నాక గళం విప్పేడు గౌతమ్.

"ఇన్నాళ్ళూ మీ ముందు దాచిపెట్టిన ఒక విషయాన్ని ఇప్పుడు చెప్పబోతున్నాను అక్కయ్యగారూ! మీరు అచ్చం మా పెదనాన్నగారి కూతురు తనూజక్కయ్యలా వుంటారు. అదే పోలిక, కళ్ళలో అదే శాంతం. ముఖంలో అదే నైర్మల్యం! ఆఖరికి స్వరం కూడా. అంటే తన స్వరంకూడా మీ స్వరం లాగే మృధుమదురమైన జలతరంగిణిలా వుంటుందన్నమాట!మా తనూజక్కయ్యనీ మిమ్మల్నీ పక్కపక్కన నిలబె

డితే కవల పిల్లలే అనుకుంటారెవరైనా!"

ఊపిరి పీల్చుకోవడానికి ఓ క్షణమాగి తిరిగి కంటిన్యూ చేశాడు గౌతమ్. అయితే స్వరంలో మాత్రం చాలా మార్పొచ్చింది.

"... ఒక తల్లి కడుపున పుట్టకపోయినా మా తనూజక్కయ్యా నేనూ సొంత అక్కాతమ్ముళ్ళక న్నా మిన్నగా వుండేవాళ్లం అక్కయ్యగారూ! కానీ విధి చిన్నచూపు చూపిందక్కయ్యగా రూ..."

"ఏమైంది గౌతమ్?" గౌతమ్ గొంతు బొంగురు పోవడాన్ని స్పష్టంగా గమనించి ఆత్రంగా అడిగింది పావని.

సుబ్బారావ్‌కి ఆశ్చర్యంతో మతి పోతున్నట్టే అనిపించసాగింది. ఎందుకంటే అతనికి తెలిసి గౌతమ్‌కనలు పెదనాన్నే లేడు. గౌతమ్ తాతకి జోగారావ్ ఒక్కడే. జోగారావ్‌కి గౌతమ్ ఒక్కడే. 'వీడు కోతలు కొయ్యడంలో ఇంత ఎక్స్‌పర్ట్ ఎప్పుడయ్యేడు చెప్మా?' అనుకుంటూ బుగ్గన వేలేసుకున్నాడు సుబ్బారావ్.

గౌతమ్ బొంగురుపోయిన గళాన్ని మళ్ళీ విప్పేడు.

"అవునక్కయ్యగారూ! విధి చిన్నచూపే చూ సింది! మా తనూజక్కయ్యని కలరా రూపంలో కాటేసింది! అలాంటిది... ఈ ఇంట్లో చేరేక పోయిందనుకున్న మా తనూజక్కయ్య మళ్లీ మీలో దొరికింది నాకు. కానీ చెప్తే నమ్మరేమో నని మీతో చెప్పలేదు నేను. అయినా పైకి చెప్పుకోవాలా ఏంటి? మీలో నా అక్కయ్యని చూసుకుంటున్న తృప్తి నాకు వుండాలి గాని!"

అవునన్నట్లు తలాడించింది పావని. అప్ప టికే ఆమె మనసుమైనవు ముద్దైపోయింది.

"ఒరి భడవా... ఎక్కణ్ణించి ఎక్కడికి వేశా వురా లైను?!!" అనుకున్నాడు సుబ్బారావ్ ఆశ్చర్యంగా.

"మీరు ఇల్లు ఖాళీ చేసెయ్యమన్నారు కదా! మా సుబ్బారావేమో ఖాళీ చేసేద్దాం అంటున్నా డు. కోల్పోయిన నా అక్కయ్య ప్రేమకోసం అవసరమైతే మీకాళ్లయినా పట్టుకుంటాను గాని ఈ ఇల్లు మాత్రం వదిలేది లేదు అని నేనంటున్నాను. అవునక్కయ్యగారూ! ఇన్నా ళ్ళూ నోరు తెరిచి అక్కయ్యా అని పిలవకపో యినా మిమ్మల్ని అలాగే భావిస్తూ వచ్చాన్నేను. ఆత్మాభిమానం ఏంటి గాడిదగుడ్డు?! అక్క లాంటి మీ పాదాలు పట్టుకుంటే అది ఆత్మాభి మానానికి భంగమా? నా బాధ వాడికేం తెలు స్తుంది? వాడికీ ఒక అక్కయ్య వుండి, విధి చిన్న చూపు..."

అప్పటికే పూర్తిగా కరిగిపోయిన పావని ఇంక గౌతమ్‌ని మాట్లాడనివ్వలేదు.

"వద్దు గౌతమ్....ఇంకేం చెప్పొద్దు. నీ బాధ నాకు పూర్తిగా అర్థమైంది! ఈ సంగతి మాటవ రసకైనా ఎప్పుడూ అనలేదుకాబట్టి విషయం ఇంతదాకా వచ్చింది. నీకు నా మీద అలాంటి పవిత్రమైన భావన వుందని తెలిస్తే మిమ్మల్ని ఇల్లు ఖాళీ చేయమని నేను అనుండేదాన్నే కాను! సర్లే...ఇప్పటికైనా చెప్పేవు చాలా సంతోషం!" అంది శాంత గంభీరస్వరంతో.

"థాంక్స్ అక్కయ్యగారూ! అయితే ఇక నుండి మేం ఇళ్ల వేట మానేయొచ్చా?" సంబ రంగా అడిగేడు గౌతమ్.

"లక్షణంగా మానేయొచ్చు. అద్సరే, గారూ ఏంటిగారూ? అక్కాతమ్ముళ్ల మధ్య మర్యాద లూ మన్నింపులూ వుండాల్సిన పన్లేదు. అక్క య్యా అని పిలువ్ చాలు" ఆప్యాయంగా అంది పావని- 'మృదుమధురమైన జలత రంగిణిలాంటి స్వరం అంటే ఇలాగే వుంటుందా. లేక మరోలా వుంటుందా' అని లోలోన ఆలోచించుకుంటూ.

సుబ్బారావ్ గౌతమ్ తెలివితేటలకి ఆశ్చర్య పోయాడు! ఎంత తేలిగ్గా బుట్టలో వేసేశాడు వెధవ? అని చెప్పి.

గౌతమ్ పావనికి రెండుచేతులూ జోడించి వినయాతివినయంగా చెప్పేడు.

"అలాగే అక్కయ్యా!"

"అలా అన్నావు బాగుంది! తమ్ముడంటే అలా వుండాలి" అంది పావని ఆప్యాయంగా. లేచిన వేళావిశేషం నుంచి దైనప్పుడు ఒక్కోసా రంతే! కొండంత సమస్యలు సైతం కొనగోట తాకిడికి లేచిపోతాయ్!

★ ★ ★

దేవుడి దయవల్ల ఎలాగోలా ఇంటి సమస్య తేలిపోయింది.




ఇహ మిగిలిందల్లా అనూహ్య మనసులోంచి దురభిప్రాయాన్ని తొలగించి అందులో స్థానం సంపాదించుకోవడం.

కానీ ఎలా?

ఇప్పటి పరిస్థితుల్నిబట్టి అదేమంత సుల భసాధ్యంకాదే?!

పావన్ని బుట్టలో పడేసినంత తేలిక్కాదు అనూహ్యని బుట్టలో పడేయగలగడం! అదీ కాక పావని దారివేరు. అక్కాతమ్ముళ్ళ పవిత్రా నుబంధం అనే సెంటిమెంట్‌తో కొట్టిన దెబ్బ కాబట్టి ఆమె విషయంలో ఆ ప్రాబ్లమ్ అలా సాల్వ్ అయిపోయింది. కానీ అనూహ్యది ఎన్టైర్లీ డిఫరెంట్ కేసాయె!

అసలే తన మీద చెడు అభిప్రాయంతోవున్న ఆమెని ప్రసన్నురాల్ని చేస్కుని తన దార్లోకి తెచ్చుకోవడం అంటే ఇట్స్ నాటె జోక్!

ఆ రాత్రంతా కంటిమీద కునుకన్నది లేకుండా ఆలోచించాడు గౌతమ్. కానీ ఏం చెయ్యాలో, ఎలా ముందుకు సాగాలో తోచి చావలేదు.

అయితే ఇంక ఆ విషయంలో అతను సుబ్బారావ్ సలహాల్నిగాని సహకారాన్నిగాని కోరదలుచుకోలేదు. ఎప్పటికప్పుడు వెనక్కి గుంజుతుంటే అలాంటివాణ్ణి పట్టుకుని వేళ్లాడ్డం మంచిది కాదులే అనిపించింది.

నిద్రలేమి వల్ల ఆ మర్నాడు బారెడు పొద్దెక్కేకగాని లేవలేకపోయాడు గౌతమ్. లేపేందుకు సుబ్బారావ్ ప్రయత్నించలేదని కాదు. నాలుగైదుసార్లు ప్రయత్నించేడు. అయినా ఇతనే లేవలేదన్నమాట!

"ఎందుకురా నిద్ర మానుకుని బుర్రంతా ఖరాబు చేస్కుంటావ్? మొహం చూడెలా పీక్కుపోయిందో? ఆలోచనలతో అవగింజని కూడా కదిలించలేరెవరూ..." లేచి కూర్చున్నాక కూడా ఇంకా ఆవులిస్తూనే వున్న గౌతమ్‌ని చూసి అలవాటుగా హితోపదేశం ప్రారంభించాడు సుబ్బారావ్.

"ప్రొద్దున్నే ససపెట్టబాకు" మధ్యలోనే అందుకుని కసిరిపారేశాడు గౌతమ్. "అయినా నిన్నటి దాకా నా బుర్ర మీద కంటే నీ బుర్ర మీదే ఎక్కువ నమ్మకం వుండేది నాకు! కానీ రాత్రి పావనిగార్ని అలా ఐస్ చేసేశాక నా తెలివితేటల మీద నాకు నమ్మకం పెరిగిపోయింది! నా సమస్యల్ని ఎలాగోలా నేనే పరిష్కరించుకుంటాను. యూ సింప్లీ కీప్ క్వయిట్ దట్సాల్"

పుల్లవిరిచి చెవిలో దోపినట్టు గౌతమ్ అలా అంటుంటే నేచురల్‌గానే ఒళ్ళు మండిపోయింది సుబ్బారావ్‌కి.

"నీ విషయాల్లో ఇంకెప్పుడయినా ఇంటర్‌ఫియరైతే చెప్పుచ్చుక్కొట్టు" అనేసి తిరస్కారంగా ముఖం ప్రక్కకు తిప్పేసుకున్నాడు.

'ఆఁ ఈ కోపం ఎంతసేపులే బోడి' అనుకున్నాడు గౌతమ్.

తమతమ ఆఫీసులకు ఆపూట కూడా ఎప్పటిలా కలిసే బయలుదేరినా దార్లో ఒకరితో ఒకరు మాట్లాడుకోలేదు మిత్రద్వయం.

★ ★ ★

ఆఫీసులో ఏదో ఫైలు ముందేసుక్కూర్చుని సీరియస్‌గా పనిచేస్తున్న వాడిలా నటిస్తూ అనూహ్యకి ఓ ఉత్తరం రాశాడు గౌతమ్.

దాన్ని ఆమెకు ఇవ్వాలా ఇవ్వకూడదా అన్నది తర్వాత సంగతి. అసలు ఓ ఉత్తరమంటూ రాస్తే ఎలా వుంటుంది? తను సరిగ్గా రాయగలుగుతాడా లేదా? అనేదాన్ని టెస్ట్ చేసుకోవడం కోసం అతనా పనికి శ్రీకారం చుట్టేడు.

"డియర్ అనూహ్యగారూ!

త్రిలోక్‌గాడికి ఏ గతి పట్టిందో తెలిసుండి కూడా సాహసించి ఈ ఉత్తరం రాస్తున్నందుకు నన్ను మన్నించండి. ఎందుకంటే వాడిలా నాది కపటమైన ప్రేమకాదు. మిమ్మల్ని చూసిన తొలిక్షణం నుండి నేను మిమ్మల్ని చాలా గాఢంగా, నిండుమనసుతో ప్రేమిస్తున్నాను. అనుక్షణం మీ ఆరాధనలోనే గడుపుతున్నాను. నా హృదయాన్ని మీకు వ్యక్తం చేయడానికి ఇంతకన్నా మరో మార్గమేదీ తోచక ఇలా ఈ ఉత్తరం రాస్తున్నాను. దయతో ఆసాంతం చదివి, చెప్పుతో కొడతారో లేక కరుణతో కటాక్షిస్తారో అప్పుడు తీసుకోండి ఏదోక నిర్ణయం. ఉత్తరాన్ని పూర్తిగా చదవకముందే తొందరపడి గలభాచేయవద్దని ప్రార్థిస్తున్నాను.





సరే...నేరుగా అసలు విషయంలోకి వస్తాను. నా గురించి మీకు చాలామంది చాలా చాలా చెడ్డగా చెప్పివుంటారు అవునా? నిజమే... నేను ఆకతాయినే! ఏదో తమాషాకీ, సరదాకీ అంద ర్నీ ఆటపట్టిస్తుంటాను. కానీ నిజానికి నేను మీరనుకుంటున్నంత దుర్మార్గుణ్ణి మాత్రం కా దనూహ్యగారూ.

ఒకవేళ దుర్మార్గుణ్ణే అనుకున్నా ఏం, దు ర్మార్గుడికి మాత్రం ప్రేమించే హక్కు వుండదా?

నేను మిమ్మల్ని ప్రేమిస్తున్నాను. నాకు మీ ప్రేమ కావాలి. నేను మీ ప్రేమ కోసం ఎలాంటి త్యాగానికైనా సిద్ధంగా వున్నాను.

చెప్పండి? ఏంచేయమంటారు నన్ను? మీ శ్యాంబాబుని ఏడిపించినందుకు మీకు నా మీద చాలా అసహ్యం కలిగిందికదూ? నిజమే. ఆ పసివాడి విషయంలో నేను చాలా అమాను షంగా ప్రవర్తించాను. నన్ను క్షమించమని ఎన్నిసార్లు ప్రాధేయపడినా మీరు పట్టించుకో వడం లేదు. కాబట్టి నా తప్పుకి ప్రాయశ్చి త్తంగా నాకు నేనే ఓ శిక్ష విధించుకుంటున్నా ను.

అదేమిటో తెలుసా అనూహ్యగారూ?

మాటలు రాని మీ మేనల్లుణ్ణి ఏడిపించిన పాపానికిగాను ఈ ఉత్తరాన్ని మీకు అందించిన మరుక్షణం నుంచి నేను మాటలొచ్చినా సరే మూగవాడినైపోవాలనుకుంటున్నాను. నేను తిరిగి కంఠం విప్పేది మీరు నన్ను మన్నించి నా ప్రేమని అంగీకరించినప్పుడు మాత్రమే! మీ ప్రేమ నాకు దక్కనినాడు నేను జీవి తాంతం మాటలొచ్చిన మూగవాడిగా మిగిలిపో తాను. నేను మాటంటే మాటే! దీనికింక తిరు గులేదు.

అంటే ఒకరకంగా ఇది మరో మౌనపోరాటం అన్నమాట! ఈ పోరాటంలో తుది విజయం నాదే అవుతుందని నా నమ్మకం. కానీ విధి నిర్ణయం ఎలా వుందో కదా?

మీ కోసం మూగవాడైపోతున్న ఈ దీనుణ్ణి కరుణించి తిరిగి మాట్లాడేలా చేస్తారని ఆశి స్తూ...

మీ
ప్రేమపూజారి
గౌతమ్"

రాయడం ముగించి ఓ మారు చదివి చూసుకున్నాడు గౌతమ్.

'అమ్మబాబోయ్ నేనేనా ఇంత చక్కగా రాయగలిగిందీ?' అనిపించిందో క్షణం.

ఫర్వాలేదు ఉత్తరం బాగానేవుంది. చాలా చాలా ఇంప్రెసివ్‌గావుంది.

కానీ దీన్ని చూసి అనూహ్య ఎలా రియాక్ట్ అవుతుందో కదా? అసలే కరోడా మనిషి. సరే... నీ ఇష్టం. 'జీవితాంతం పెదవి విప్పకుండా అలా మూగవాడిగానే వుండిపో' అన్నట్టుగా ఆమె మిన్నకుండిపోతే?

ఆవేశంలో ఏదో రాసేశాడే తప్ప నిజంగా ఆ మాటను నిలబెట్టుకోగలడా తను?

పోనీ అలా కాకున్నా తన ప్రేమని టెస్ట్ చేయడానికి ఓ ఆరు నెలలపాటు సైలెంట్‌గా వుండిపోతుందామె. అంటే ఏమాటా చెప్ప కుండా అన్నమాట!

అప్పుడు తన పరిస్థితి?

ఒకటి రెండు రోజులయితే ఫర్వాలేదు. నెలల తరబడి మాట్లాడకుండా వుండటం అంటే మాటలా?

ఊహుఁ... ఆచరణ సాధ్యంకాని విషయ మది.

లాభంలేదు. ఈ ఉత్తరాన్ని ఆమెకిచ్చి కోరి కొరివితో తలగోక్కోవడం కన్నా మరో ఐడియా ఏదయినా ఆలోచించడం మేలు.

పూర్తి చేసిన ఉత్తరాన్ని వెనక్కి తిప్పి పెట్టి దాని మీద పేపర్ వెయిట్ పెట్టి రెండు చేతుల మధ్యా తలను ఇరికించుకుని సుదీర్ఘ మైన ఆలోచనలోపడ్డాడు గౌతమ్.

గోడగడియారంలోని పెండ్యులమ్‌లా అతని మనసు అటూ ఇటూ వూగులాడుతోంది.

ఇస్తే ఎలా వుంటుంది? ఇవ్వకపోతే ఎలా వుంటుంది?

ఇస్తే ఉత్పన్నమయ్యే ఇబ్బందులేమిటి? ఇవ్వకపోతే ఆమె మనసును జయించడానికి ఇంతకన్నా మంచి మార్గాలేమిటి?

అడుగు ముందుకు వెయ్యాలా? వెనక్కి లాగాలా?

దాదాపు ఓ గంటసేపు అలా ఆలోచించాక ఏమైనాసరే ఆ ఉత్తరాన్నామెకు అందివ్వాలనే నిర్ణయించుకున్నాడు గౌతమ్. కానైతే ఆఫీసులో కాదు. ఇంటికి వెళ్ళాక ఎదురిల్లే కాబట్టి ఏదోక సమయంలో అందివ్వాలని నిశ్చయించుకున్నాడు.

ఎందుకంటే ఒకవేళ పరాభవాన్ని ఎదుర్కోవాల్సి వచ్చినా ఆఫీసులో కంటే ఇంటి దగ్గరయితే కొంత నయంకదా?!

★ ★ ★

అనుకున్నట్టుగానే ఆ మర్నాడుదయం ఆ ఉత్తరాన్ని అనూహ్యకి ఇంటి దగ్గిరే అందించాడు గౌతమ్.

మొండి తెగింపు మనిషిలో ఎంతటి సాహస కృత్యాన్నయినా చేయిస్తుంది. అనూహ్య చేతిలో ఆ ఉత్తరాన్ని ఉంచుకున్నప్పుడు గౌతమ్‌ని నిలువెల్లా ఆవహించింది మొండి తెగింపే! తను అలాంటి సాహసానికి ఒడిగట్టబోతున్నట్టు అతను సుబ్బారావ్‌తో కనీసం మాటవరసకైనా చెప్పలేదు. ఫలితం ఏమైనా కానీ, ఉత్తరం మాత్రం ఇచ్చేది ఇచ్చేదే అన్న గట్టి నిర్ణయంతో ఉదయం ఏడున్నర గంటలప్పుడు వాళ్ళ వరండామీద ఒంటరిగా కనిపించిన అనూహ్య దగ్గరికి ముందూ వెనుకా ఆలోచించకుండా చకచకా నడిచి వెళ్ళి ఓ పోస్ట్‌మాన్ ఉత్తరాన్ని బట్వాడా చేసినంత క్యాజువల్‌గా ఆమె చేతిలో ఆ ఉత్తరాన్ని పెట్టేశాడు.

"ఏంటిది?" ఘన్నైపోతూ అడిగింది అనూహ్య.

'అది నా హృదయం' అన్నట్టుగా సైగ చేసి మరోమాట మాట్లాడేందుకు ఆమెకు అవకాశం ఇవ్వకుండా ఆమె ఆశ్చర్యంనుండి కోలుకోక ముందే వడివడిగా అక్కడినుంచి వచ్చేశాడు గౌతమ్. ఎందుకైనా మంచిదని గభాల్న ఇంట్లో దూరిపోయి తలుపులు కూడా మూసేసుకున్నాడు.

ఇక్కడ గౌతమ్ గుండెలో రైళ్ళూ రాకెట్లూ గుర్రాలూ ఎక్స్ప్రెస్‌ట్రా పరుగులుతీస్తుండగా అక్కడ అనూహ్య ఆ ఉత్తరాన్ని విప్పి చదివింది.

చదవడం ముగించగానే అంకమ్మలా శివాలెత్తిపోలేదామె. 'ఒరి పిచ్చికుంకా' అనుకుని జాలిగా నవ్వుకుంది. అవును మరి! పిచ్చోళ్ళు తప్ప ఎవరైనా రాస్తారా అలా?

మరో మౌనపోరాటమట!

తలతిక్క కాకపోతే ఏమిటిది?

అతని ప్రేమని అంగీకరించేవరకూ తిరిగి కంఠం విప్పడట! తన ప్రేమ అతనికి దక్కని నాడు జీవితాంతం మూగవాడిగా మిగిలిపోతాట్ట!

మాట్లాడకుండా వుండటం అంటే ఆషామాషీ అనుకుంటున్నాడు కాబోలు!

ఒక్కరోజు... కనీసం ఒక్కరోజయినా నిలుపుకోలేడు ఆ మాటని!

కంటెంట్స్ 'చిరువెర్రి' టైప్‌లో వుండటంవల్ల అనూహ్య అలా శాంతంగా వుండగలిగింది లేకపోతే అలా లౌ లెటర్ రాసి పైగా తగుదునమ్మా అంటూ నేరుగా వచ్చి అందించినందుకు ఆమె అతన్ని ఎంతమాత్రం బేర్‌చేసి వుండేది కాదు.

అలాగని ఆ ఉత్తరం ఆమెలో అసలే కొంచెం కూడా కోపాన్ని కలిగించలేదని కాదు. కోపమైతే వచ్చింది కానైతే అది లావాలా ఎగజిమ్మకు రాలేదంతే!

చూద్దాం... ఒకట్రెండు రోజుల్లో అతని రంగు బైటపడకపోదు. చేసిన శపథాన్ని గాలికొదిలేసి వసపిట్టలా వడవడా వాక్కపోడు. అప్పుడు... అప్పుడు చెప్పాలి బుద్ధి!

ఏంనాయనా ఇదేనా ప్రేమంటే? మాటంటే మాటే అన్నావుగా? సిగ్గులేకుండా ఎలా మాట్లాడుతున్నావ్ ఇప్పుడు? అని నిలదీసి అడిగి మరీ అప్పుడు... అప్పుడు కొట్టాలి దెబ్బతో.

జీవితంలో మళ్ళీ కోలుకోలేనంతగా యాగీ చేసిపారేయాలి.

హుఁ... లేకపోతే ప్రేమంటే అల్లాటప్పా వ్యవహారం అనుకుంటున్నాడు కాబోలు.

అసలు నాలుగైదు రోజులదాకా ఎందుకు?

తను తలుచుకుంటే ఓ అరగంటలోనే తేలిపోతుంది అతని వ్యవహారం!

ఆలోచనలో పడిన అనూహ్యకి ఓ బ్రహ్మాండమైన ఉపాయంతోచింది.




క్లోజ్...ఈ దెబ్బతో అతని పని క్లోజ్ అను కుందామె గర్వంగా.

ఆ ఉపాయాన్ని ఆచరణలో పెట్టడానికి ఆ వెనువెంటనే ఉద్యుక్తురాలైంది!

తలనొప్పి కారణంగా ఆఫీసుకు రాలేకపోతున్నందున ఒకరోజు క్యాజువల్ లీవ్ గ్రాంట్ చేయాల్సిందిగా టకటకా ఓ లీవ్ లెటర్ రాసి దాన్ని రాజశేఖరం చేతిలో పెట్టింది.

"ఏంటమ్మా ఇది?" అడిగేడు రాజశేఖరం.

"ఒంట్లో నలతగా వుందన్నయ్యా! ఇవ్వాళ ఆఫీసుకి వెళ్ళలేను. మా కొలీగ్ గౌతమ్ మన ఎదురింట్లోనే ఉంటున్నాడు. దీన్నాయనకివ్వు. మా మేనేజర్ కివ్వమని చెప్పు"

చెల్లెలికి నలతగా వుందని తెలియగానే రాజశేఖరం ఆందోళన వ్యక్తంచేశాడు. ఏంటమ్మా జ్వరంగా వుందా?" అంటూ కంగారుగా ఆమె నుదుటి మీద చెయ్యేసి చూసి- "అరెః కాలిపోతోంది. లీవ్ లెటర్ సంగతి తర్వాత చూసుకోవచ్చు. ముందు డాక్టర్ దగ్గరికి వెళ్దాం పదమ్మా" అంటూ తొందరపెట్టాడు.

అన్నగారి ప్రేమకి అనూహ్య మనసు మురిసిపోయింది.

"ఛఛ...జ్వరం ఏమీలేదన్నయ్యా! కాస్త తలనొప్పిగా వుందంతే! ముందా లీవ్‌లెటర్ గౌతమ్‌గారి కిచ్చేసి రా! మళ్ళీ ఆయన ఆఫీసుకు గాని వెళ్ళిపోతే పనిగట్టుకుని నువ్ వెళ్లాల్సొస్తుంది" అంటూ నవ్వేసింది. 'గౌతమ్ అన్నయ్యతో మాట్లాడకుండా వుంటాడా? నేను అనూహ్య అన్నయ్యనండీ అని అన్నయ్య పరిచయం చేసుకోగానే ఒళ్ళు మర్చిపోయి తప్పకుండా మాట్లాడేస్తాడు. 'రండ్రండి కూర్చోండి' అని మర్యాదకైనా ఆహ్వానిస్తాడు. 'అది చాలు తనకి' అని లోలోన అనుకుంటూ-

"ఇంట్లో అనాల్జిన్ టాబ్లెట్స్ ఏవో వుండాలి- వేస్కోమ్మా" అని చెల్లికి చెప్పి గౌతమ్ వాళ్ళ ఇంటివేపు దారితీశాడు రాజశేఖరం.

గుమ్మంలో నిలబడ్డ రాజశేఖరాన్ని చూడగానే గౌతమ్ ముఖంలో భయాందోళనలు ముప్పిరిగొన్నాయి!

కొంపదీసి అనూహ్యగాని ఊదేసిందా ఏంటి? అంటే అదే- కంప్లైంట్ చేయడం!

'ఎంతవని చేశావు అనూ?!' అనుకున్నాడు బాధగా.

తప్పేదేముంది? చేసిన తప్పు చిన్నదీ చితకదీ కాదాయె! శిక్ష అనుభవించాలి- తప్పదు.

రాజశేఖరం ఈడ్చిపెట్టి చెంపమీద ఒకటి కొట్టడం ఖాయం అని మనసులో నిశ్చయించేసుకుని సదరు చెంపదెబ్బను తినేందుకు మానసికంగా ప్రిపేర్ అయిపోయాడు గౌతమ్. నోరు తెరిచిన పామువేపు కప్పపిల్ల చూసినట్టు బెదురు చూపులు చూసేడు రాజశేఖరంవైపు.

అసలు సంగతి తెలియని రాజశేఖరం ఇదేంటి ఇతను ఇలా చూస్తున్నాడు అనుకున్నాడు అయోమయంగా.

అతని చూపే అంతకాబోలులే అనుకుని జేబులోంచి లీవ్ లెటర్ని బైటికి తీశాడు.

గౌతమ్‌కి అరికాళ్ళలోంచి వొణుకుప్రారంభమైంది. ఎందుకంటే దాన్నతను లీవ్‌లెటర్ అనుకోలేదు. తను రాసిన ఉత్తరాన్ని అనూహ్య అన్నగారికిచ్చింది గావల్నూ అది అదే గావల్నూ ఏం రాతలయ్యా ఇవి అంటూ అతనిపుడు తన మీద విరుచుకుపడతాడు గావల్నూ అనుకున్నాడు.

'సారీ సార్... ఏదో బుద్ధిగడ్డితిని రాసేను. ఇంకెప్పుడూ చేయనలాంటి అవకతవకఖంగాళీ పనులు. దయచేసి ఈ ఒక్కసారికీ నన్ను క్షమించి వదిలేయండి? అని వేడుకుందామా అనిపించింది ఓ క్షణం.

కానీ శపథం గుర్తొచ్చి, 'ఛీ' ఆదిలోనే జావగారిపోవడవేంటి? అనిపించి, ధైర్యాన్ని కూడగట్టుకున్నాడు.

గౌతమ్ కాళ్ళలోని వొణుకునీ, అతని విచిత్రమైన వాలకాన్ని స్పష్టంగా గమనించిన రాజశేఖరంలోని అయోమయం రెట్టింపైంది!

గౌతమ్‌వైపు ఆశ్చర్యంగా చూస్తూ- "అరెః ఏంటలాగైపోతున్నారు? కొత్తవాళ్లని చూసి కంగారుపడిపోవడం మీ నైజమా?" అన్నాడు చేతిలోని లీవ్ లెటర్ని అతని చేతిలో వుంచుతూ.

కాలుతున్న కట్టెపుల్లని చేతికందిస్తే పట్టుకున్నంత భయంగా దాన్నందుకున్నాడు గౌతమ్.

"అరె...ఏంటిసార్ అలా వణికిపోతున్నారు?



నేను మీకు ఇచ్చింది అటంబాంబేంకాదు. లీవ్ లెటర్. నేను మీ కొలీగ్ అనూహ్యా అన్నయ్యని, పేరు రాజశేఖరం చూసే వుంటారు బహుశా! మీ ఎదురింట్లోనే వుంటున్నాం మేము'' పలకరింపుగా చిరునవ్వు నవ్వుతూ తననుతాను పరిచయం చేసుకున్నాడు రాజశేఖరం.

అంతే... గౌతమ్ గుండె దూదిపింజకన్నా తేలికైపోయింది!

వార్నీ... ఎంత కంగారు పడిపోయాడు తను?

'అలాగాండీ... రండి ...లోపలికి రండి' అనబోయి చటుక్కున శపథం గుర్తొచ్చి నాలుక కరుచుకుని వెర్రి నవ్వు నవ్వాడు.

నట్ లూజా? లేక మాటలు రావా? అర్థంకాలేదు రాజశేఖరానికి.

"మా అనూహ్యకి ఫీవరిష్‌గా వుందంట సార్! అందుకని ఈరోజు ఆఫీసుకు రావటం లేదు. దయచేసి ఈ లీవ్ లెటర్ని మీ మేనేజర్ గారికి ఇవ్వండి!''

"అలాగే'' అన్నట్టు తలాడించి, లోపలికి రమ్మన్నట్టుగా సైగచేశాడు గౌతమ్. 'ఈ సుబ్బిగాడొకడు ఇప్పుడే చావాలా బైటికి?' అని మనసులో బాధపడిపోతూ-

ఇక్కడ గమనించాల్సిన విషయం ఏమిటంటే- సరిగ్గా గౌతమ్ అనూహ్యకి ఉత్తరాన్ని అందించడానికి వెళ్ళినప్పుడే కాయగూరల కోసమో మరి దేనికోసమోగాని సుబ్బారావ్ బైటికి వెళ్ళిపోయాడు. ఆ వెళ్ళిన మనిషి ఇంతవరకూ అయిపూ అజా లేడు. గౌతమ్ ఇలా మౌనవ్రతం పూనిన సంగతి సుబ్బారావ్ కింకా తెలియదు.

ఇందులో ఇంత మతలబు వున్న సంగతి రాజశేఖరానికేం తెలుసు?

'నో డవుట్! ఇతను క్రాక్ మాస్టర్ జనరలే! అని మనసులో నిర్ణయించేసుకుని "మరోసారెపుడైనా తీరుబాటుగా మాట్లాడుకుందాం మీరేదో కన్‌ఫ్యూజింగ్ మూడ్‌లో వున్నట్టున్నారు. వస్తా! లీవ్ లెటరివ్వడం మర్చిపోకండి'' అనేసి చకచకా వెళ్ళిపోయాడు అక్కడినుంచి. ఎదుటివ్యక్తి ఉన్మాదేమోననిపించినప్పుడు అతన్ని తొందరగా వదిలించుకోవాలనిపించడం సహజమే కదా!

రాజశేఖరం మెట్లు దిగి వెళ్ళిపోతుంటే 'ఛీ... ఏమనుకున్నాడో ఏమో పాపం! నోరు తెరిచి ఒక్కమాట అయినా మాట్లాడలేకపోయాను. దిక్కుమాలిన శపథంవల్ల' అనుకున్నాడు గౌతమ్ బాధగా.

ఆ తర్వాత అతని బుర్ర చురుగ్గా పనిచేయడం ప్రారంభించింది.

తన ఉత్తరాన్ని అందుకున్నాక కూడా అనూహ్యా ఆ విషయాన్ని అన్నగారితో ఫిర్యాదు చేయకపోగా పైపెచ్చు అతని చేత లీవ్‌లెటర్ పంపించిందీ అంటే అర్థం?

ఆమెకు కోపం రాలేదన్నమాట!

తన ప్రేమ దరఖాస్తుని చాలా లిబరల్‌గా పరిశీలిస్తూ వుందన్నమాట!

అవునంతేగా మరి? కోపం వచ్చిన మనిషైతే ఈపాటికి చెడుగుడు ఆడేయదా?

కాబట్టి సందేహంలేదు. తన ఉత్తరం ఆమెని బాగానే ఇంప్రెస్ చేసిందన్నమాట! 'చూద్దాం మాటమీద ఏమాత్రం నిలబడతాడో?' అనుకుని వుండొచ్చు బహుశా! తను గనుక ఓపిగ్గా ఓ వారం లేదా ఓ నెల. చేసిన శపథానికి గనక కట్టుబడి వుండగలిగితే- ఆమె మనసు కరిగిపోవడం ఖాయం. కరిగిన ఆ మనసుని తన దోసిట్లో పోయటమూ ఖాయమే!

అలా వూహించుకుంటే మనసంతా ఆనందంతో ఉక్కిరిబిక్కిరైపోయింది గౌతమ్‌కి. విజయపథంలో ముందుకు సాగిపోతున్నట్టే అనిపించి- 'జయంబు నిశ్చయంబురా భయంబు లేదురా...' అనే పాటని మనసులో సంబరంగా పాడుకున్నాడు.

ఇతనిక్కడ ఇలా పాడుకుంటున్న సమయంలో అక్కడ అన్నగార్ని అడిగింది అనూహ్యా.

"నిజంగా అతను ఒక్కమాటకూడా మాట్లాడలేదా?''

అప్పటికది రెండోసారి ఆమె అలా అడగటం.

అందువల్ల రాజశేఖరం ఇక్కడ కూడా ఒకింత అయోమయానికి లోను కావాల్సివచ్చింది.





"ఎందుకమ్మా అలా అడుగుతున్నావ్?" అన్నాడు ఆశ్చర్యంగా.

"అబ్బే ఏంలేదన్నయ్యా! ఆఫీసులో అతను వనపిట్టలా ఒకటేవనిగా వాగుతుంటాడులే! అలాంటిది నిన్ను కనీసం వలకరించను కూడా లేదంటే ఆశ్చర్యంగా అనిపించింది అంతే" అంది అనూహ్య తడబాటును కప్పిపుచ్చు కుంటూ.

"నోరు తెరిచి ఒక్కమాట మాట్లాడితే ఒట్టు. మాట్లాడలేదు సరికదా, వెర్రిచూపులు చూడ్డం, వొణికిపోవడం, అతని వరసేంటో నాకు బొత్తిగా అర్థంకాలేదు. ఉత్తక్రాక్‌గాడిలా వున్నాడు"

"అవునవునంతే...ఒక్కోసారి మా ఆఫీసులో కూడా అతనలాగే విచిత్రంగా ప్రవర్తిస్తుంటా డు. అదో రకం ఫోబియా కాబోలు మరి"

కంఠంలో సిన్సియారిటీ లోపించడంవల్ల చెల్లి తన నుండి ఏదో దాస్తోందన్న అనుమానం వచ్చింది రాజశేఖరానికి.

కానీ ఆ విషయాన్ని గురించి తర్కించడాని కి అతనికి అవకాశం కలగలేదు.

కారణం...ఏదో వనున్న దానిలా అనూహ్య అక్కడినుంచి వెళ్ళిపోవడం.

తనగదిలో ఒంటరిగా కూర్చుని ఆలోచనలో పడింది అనూహ్య.

గౌతమ్ అన్నయ్యతో ఒక్కమాట అయినా మాట్లాడలేదూ అంటే- ప్రస్తుతానికి మాట నిల బెట్టుకున్నాడన్నమాట!

కానీ ఎల్లకాలం అలాగే వుండగలడా?

రాజశేఖరం తన అన్నయ్య అని అతనికి తెలుసు కాబట్టి మాట్లాడకపోయి వుండచ్చు. కానీ అందరితోనూ మాట్లాడకుండా వుండగ లడా?

ఎలా సాధ్యం అది? తన కోసం ఆఫీసుకు రావడం డ్యూటీ చేయడం మానేయలేడుగా? ఆఫీసుకొచ్చి మాట్లాడకుండా వుండగలగటం కుదుర్తుందా?

ఇంపాసిబుల్!

మహా అయితే ఓ గంటసేపు వుండగలుగు తాడు. ఆ తర్వాత ఎందుకు మాట్లాడట్లేదని అందరూ కలిసి నిగ్గదీస్తే ఏం చెబుతాడు?

'నేను మౌనవ్రతం పూనేను. నన్నెవ్వరూ మాట్లాడించకండి' అని కాగితం మీద రాసి చూపుతాడేమో? కానీ కారణం ఏంటని అడిగితే ఏం చెబుతాడు? అదేలే ఏం రాసి చూపించగ లుగుతాడు?

అసలు కారణం చెబితే నలుగురూ నవ్విపో తారు కాబట్టి ఈ విషయాన్ని బహిర్గతం చెయ్యడుగాక చెయ్యడు.

అసలిదంతా ఎందుకు? మాట్లాడకుండా ఆఫీసులో పనిచేయగలగడం కుదిరేపని కా దు.

ఏ విషయం ఎలా వున్నా మేనేజర్ వూర్కుంటాడా? నల్లిని నలిపినట్టు నలిపేయ డూ? బొమ్మిడాయిని తోమినట్టు తోమేయడూ?

ఒకవేళ గౌతమ్ తన శపథాన్ని గనక నిలబె ట్టుకునేమాట నిజంగానే నిజమయినట్లైతే అత ను వడాల్సివచ్చే పాట్లను వూహించుకొంటున్న కొద్దీ అనూహ్యకి అపరిమితమైన నవ్వొచ్చింది.

ఎంత అమాయకంగా రాసేశాడు పాపం? అనిపించి ఓ క్షణం జాలి కూడా వేసింది.



అయివూ అజా లేకుండా బైటికెళ్ళిపోయి ఓ గంటన్నర తర్వాత తిరిగొచ్చిన సుబ్బారా వ్‌ని- "ఎక్కడ తగలడ్డావ్‌రా ఇంతసేపూ" అనడిగేడు గౌతమ్.

అడిగేడంటే నిజంగా అడగటం కాదు.

ఓ చిన్న కాగితం ముక్కమీద అలా రాసిచూ పించాడన్నమాట!

అది చూసి సుబ్బారావ్‌కి మతిపోయింది!

పోదా మరి?

లక్షణంగా నోరుంచుకుని మాటలు రానివా డిలా అలా స్లిప్‌మీద రాయడం ఏంటి?

అమాటే అడిగాడు.

"ఏంనాయనా...నోటికేం రోగం వొచ్చింది? ఆ అడిగేదేదో నోటితో అడగొచ్చుగా?"

గౌతమ్ జేబులో సిద్ధంగా వుంచుకున్న స్లి ప్పుల దొంతరలోంచి ఒకదాన్ని పైకిలాగి దాని మీద బాల్‌పెన్‌తో బరబరా రాసేడు- "అ దంతా తర్వాత రాస్తా! ముందు నువ్ ఎక్కడికె ళ్ళేవో చెప్పు"

ఆ స్లిప్పందుకుని అందులో విషయం చది విన సుబ్బారావుకు ఇంచుమించు తిక్కరేగి నంత పనయింది. అప్పటికింకా చెప్పులు విడ వలేదేమో... నేల వగిలేట్టు గట్టిగా ఒక్క తన్ను తన్ని - నేలనే సుమండీ - పెంకులెగిరిపో యేలా అరిచాడు.

"తర్వాత రాయడవేంట్రా గాడిదా? అసలు రాయడవేంటి? ఏం నీ నోటికేం మాయదా రోగం వొచ్చింది?"

గౌతమ్ మళ్ళీ పెన్నుకి పని కల్పించాడు.

"మాయదారోగం కాదు. ప్రస్తుతం నేను మౌనదీక్షలో వున్నాను. వివరాలు తర్వాత చెప్తా ను. ఐ మీన్ రాస్తాను"



మిత్రుడందించిన స్లిప్పుని వుండలా చుట్టి బైటికి గిరాటేశాడు సుబ్బారావ్. "మౌనదీక్షా? ఏం- ఏం పోయేకాలం వచ్చింది?" అన్నాడు హూంకరిస్తూ.

హుంకరించడామరి? అర్థం పర్థం లేకుండా మిత్రుడిలాంటి. వెర్రిమొర్రి వేషాలేస్తుంటే?!

ఒక్కసారి వ్రతభంగం చేసుకుని అసలు విషయం చెప్పేసి ఆ తర్వాత మళ్ళీ కంటిన్యూ చేస్తే బావుంటుందేమో అనిపించింది గౌతమ్‌కి.

అవునుమరి... అసలు విషయమంతా రాసి చూపించాలంటే చేటభారతం అంత వివరణ ఇవ్వాల్సుంటుందాయె! కష్టంకదా?

కానీ అంతలోనే అలా ఆలోచించినందుకు సిగ్గుపడ్డాడు. మాటంటే మాటే! అనూహ్యకోసం, అనూహ్య ప్రేమకోసం ప్రాణాలైనా అర్పించడానికి సిద్ధంగా వున్నాడు తను. అలాంటిది మౌనంగా వుండలేకపోవడమేంటి? ఇంతలోనే ఏదో కొంపమునిగిపోయినట్టు వ్రతభంగం దేనికి?

నో! ఎట్టి పరిస్థితుల్లోనూ ఈ దీక్షనిలా కొనసాగించాల్సిందే! అనూహ్య చూడబోవటంలేదు కదా అని ఆమె లేనప్పుడు యధేచ్ఛగా మాట్లాడేసేటట్లయితే ఇంక తన ప్రేమకి విలువేముంది? అనూహ్యని డిసీవ్ చేయడం అంటే తనని తానే డిసీవ్ చేసుకున్నట్టు లెక్క! ఆత్మవంచనకన్నా ఆత్మహత్య మిన్న!

నో... ఈ విషయంలో తను ఓడిపోవడానికి వీల్లేదు. వీల్లేదుగాక వీల్లేదు.

ఒక రామారావ్ ఒక వసంతని ప్రేమించొచ్చు. ఒక కృష్ణమూర్తి మరో రేణుకని ప్రేమించొచ్చు. ఒక శ్రీనివాసరావ్ ఇంకో సరితని ప్రేమించొచ్చు. ఇలా ఎవరైనా ఎవర్నైనా ప్రేమించొచ్చు. బట్ అవన్నీ మామూలు ప్రేమలు. కానీ తన ప్రేమ అలాంటిది కాదు. తనది మహోన్నతమైన ప్రేమ. అద్వితీయమైన ప్రేమ. అవధులులేని ప్రేమ!

ఈ విషయం అనూహ్యకు కూడా అర్థమవ్వాలీ అంటే ఈ మౌనదీక్ష విషయంలో తను చాలా స్ట్రాంగ్‌గా వుండాలి. ఆరునూరైనా నూరు ఆరైనా సరే మాట తప్పకూడదు. అనూహ్య కరుణించడం కరుణించకపోవడం అన్నది అటుంచి తన ప్రేమకు యావత్ప్రపంచమూ అదిరిపోవాలి! ప్రేమ అంటే గౌతమ్‌దే అసలైన ప్రేమ! అని అందరూ తనను గురించి గొప్పగా చెప్పుకోవాలి.

ఇలా పిచ్చిపిచ్చిగా ఆలోచించేసుకుంటూ ఎట్టి పరిస్థితుల్లోనూ తన వ్రతాన్ని భంగపరుచుకోకూడదని గట్టి నిర్ణయానికి వచ్చేశాడు గౌతమ్. ఆ విషయంలో అతని హృదయం ఉక్కుకన్నా దృఢమైపోయింది!

మిత్రుడు ఎంతకీ మాట్లాడకపోవడంతో మళ్ళీ హుంకరించాడు, గౌతమ్! - "మాట్లాడవేంట్రా అడ్డగాడిదా? ఏం - తిక్కతిక్కగా వుందా? నువ్వేమయినా మాజీ ముఖ్యమంత్రివా మౌనదీక్షలూ నీ బొంద దీక్షలూ చేయడానికి?"

మళ్ళీ కలానికి పని కల్పించక తప్పలేదు గౌతమ్‌కి.

"సారీరా! అంతా వివరంగా రాసి సాయంత్రం చూపిస్తాను నీకు. ఈలోగా నా మౌనదీక్షకి భంగం కలిగించడానికి ప్రయత్నించబాకు. అన్నట్టు నేనివ్వాళ ఆఫీసుకు వెళ్ళడంలేదు. కాబట్టి లీవ్‌లెటర్ రాసిస్తాను. దయతో మా ఆఫీసుకెళ్ళి మా మేనేజర్‌కి అందజేయి. దాంతోపాటే అనూహ్య లీవ్‌లెటర్ కూడా ఇస్తాను. దాన్ని అందజేయి" అని రెండు స్లిప్పులమీద రాసి వాటిని సుబ్బారావ్ కందించాడు - ఒక స్లిప్పు చాలకపోవడంవల్ల.

ఏంటబ్బా వీడి వ్యవహారం? మౌనదీక్ష అంటున్నాడు. ఆఫీసుకు వెళ్ళలేనంటున్నాడు. అనూహ్య కూడా లీవ్ పెట్టిందంటున్నాడు. ఇద్దరూ కలిసి ఒకేసారి లీవ్ పెట్టడం ఏమిటి? అసలు ఆమె తాలూకు లీవ్ లెటర్ వీడిదగ్గర వుండటం ఏమిటి? అసలింతకీ ఈ మౌనదీక్ష దేనికోసం? - బుర్రంతా గందరగోళంగానూ అయోమయంగానూ అయిపోయింది సుబ్బారావ్‌కి.

మిత్రుడు మౌనదీక్షలో వున్నాడని తెలిసినా మనసాగక ప్రశ్నలమీద ప్రశ్నలు గుప్పించాడు.

కానీ అది అంతా చెవిటివాడిముందు శంఖం వూదిన చందమే అయ్యింది.

ఏవేవో సైగలు చేశాడే తప్ప, గౌతమ్ నోరుతె





రిచి ఒక్క మాటయినా మాట్లాడిన పాపాన్న పోలేదు.

అయితే ఆ సైగలకి అర్థం ఏమిటో సుబ్బారావ్‌కి కాస్త కూడా అర్థం కాలేదు.

దాంతో ప్రాణం విసిగి - "నీకూ, నీ మౌనదీక్షకీ, నీ చంఢాలపు సైగలకీ దండాలు నాయనా దండాలు!" అనేశాడు అసహనంగా.

ప్రశ్నలమీద ప్రశ్నలు గుప్పించడంవల్ల అంతకుముందు కలాన్ని ఉపయోగించలేకపోయిన గౌతమ్ ఇప్పుడు కాస్త వ్యవధి చిక్కడంతో మరో స్లిప్పుమీద ఇలా రాశాడు - "నీకు వివరాలన్నీ డిటెయిల్డ్‌గా రాయడంకోసమే ఆఫీసుకి సెలవు పెడుతున్నాను. సాయంత్రందాకా ఓపిక పట్టు. నీ ప్రశ్నలన్నింటికీ సమాధానాలు లభిస్తాయ్"

నవ్వాలో ఏడ్వాలో అర్థంకాక జుత్తు పీక్కున్నాడు సుబ్బారావ్.

ఆ స్థితిలో అంతకన్నా చేయగలిగిందేముంది?

మరి కాస్సేపటి తర్వాత - గౌతమ్ ఇచ్చిన రెండు లీవ్ లెటర్లనీ జేబులో పెట్టుకుని ఒంటరిగా ఆఫీసుకి బయలుదేరాడు సుబ్బారావ్ - ఎప్పుడు సాయంత్రం అవుతుందా? ఎప్పుడెప్పుడు వివరాలు తెలుస్తాయా అన్న కుతూహలాన్ని గుండెల్లో అణిచిపెట్టుకుంటూ.

సుబ్బారావ్ వెళ్ళిపోయిన ఓ గంట తర్వాత ఏమీ తోచక అలా వరండాలోకి వెళ్ళి నించున్నాడు గౌతమ్.

సరిగ్గా అప్పుడే అనూహ్యా కూడా వాళ్ళ వరండాలోకి రావడం జరిగింది. ఆమె గౌతమ్‌ని చూడ్డమూ జరిగింది.

ఇదేంటి ఇంకా గౌతమ్ ఇంట్లోనే వున్నాడు? అతను కూడా ఆఫీసుకు 'డుమ్మా'నా ఏంటి?... మరైతే తన లీవ్ లెటర్ సంగతి? - కంగారు పుట్టింది అనూహ్యాకి.

అనలే మేనేజర్ చండశాసనుడాయె! లీవ్ వాడేసుకున్నాక లీవ్‌లెటరందితే వూరుకునే బాపతు కాదు!

ఆ కంగారులో ఆమె అన్నీ మర్చిపోయి 'ఏవండీ గౌతమ్‌గారూ! మీరు కూడా ఆఫీసుకు వెళ్ళలేదా?" అంటూ చప్పట్లు కొట్టి పిలిచి మరీ అడిగేసింది.

ఆ పిలుపు విని ఆనందంతో ఉక్కిరిబిక్కిరైపోయాడు గౌతమ్.

ఇంత జరిగాక కూడా అనూహ్యా తనతో మాట్లాడుతోంది! - అదిన్నూ ఆమె అంతట ఆమే పలకరించి మరీ! అంటే ఆమెకు తన మీద కించిత్తయినా కోపం లేదన్నమాటే కదా?

ఇందాక లీవ్ లెటర్... ఇప్పుడేమో పలకరింపు! ఇంతకన్నా వేరే నిదర్శనం ఏం కావాలి!

'ఒరేయ్ గౌతుగా! యు ఆర్ ఎ లక్కీ బాయ్' అనుకున్నాడు ఆనందంగా.

ముఖంనిండా నవ్వు పులుముకుంటూ అనూహ్యా వైపు ఆప్యాయంగా చూసి - 'వెళ్ళలేదండీ' అన్నట్టుగా చెయ్యాడించాడు.

దాంతో అనూహ్యాలోని కంగారు రెట్టింపైంది.

"మరి నా లీవ్ లెటర్ సంగతి?" అడిగింది అక్కణ్ణించే.

'మా సుబ్బారావ్ ద్వారా ఇచ్చి పంపించానండీ' అనే అర్థం వచ్చేలా సైగ చేశాడు గౌతమ్. అయితే అతనికి సైగలభాష కొత్త కాబట్టి 'అలా చేశాను' అని అతననుకున్నాడే తప్ప, నిజానికతని సైగల్లో అలాంటి అర్థం ఏమీ రాలేదు.

అంచేత నేచురల్‌గానే అనూహ్యాకేమీ అర్థమై చావలేదు. "ఏవంటున్నారూ?" అంది బిగ్గరగా.

"మా సుబ్బా..." నోరు పెగలబోయింది గాని అంతలోనే చటుక్కున శపథం సంగతి గుర్తొచ్చి నోరు మూసేసుకున్నాడు గౌతమ్. మూసేస్కుని మళ్ళీ అదేరకంగా సైగ చేశాడు.

తనక్కడ నిలబడ్డం, అతనలా సైగలు చేయడం - ఎవరైనా గనక చూస్తే అపార్థం చేసుకుంటారనిపించింది అనూహ్యాకి. దానికన్నా తనే అతనికి దగ్గరికి వెళ్ళి నేరుగా మాట్లాడేస్తే బావుంటుంది కదాని కాళ్ళకి పని కల్పించింది.

ఆమె తనని సమీపిస్తూండడం చూసి గౌతమ్ హృదయం పులకించిపోయింది. 'వచ్చేస్తోందిరా గౌతమ్, నీ దేవి నీ చెంతకు కల

హంసలా నడచి వచ్చేస్తోంది' అనుకున్నాడా నందంగా.

ఓ పది పదిహేను సెకండ్ల తర్వాత గౌతమ్ ఎదుట అనూహ్య!

కళ్ళు మతాబుల్లా మెరుస్తుండగా - 'చెప్పండి' అన్నట్టు చూశాడు గౌతమ్ ఆమెకేసి.

"నా లీవ్‌లెటర్నేం చేశారు?" అనుమానంగా అడిగింది అనూహ్య.

'మీ లీవ్‌లెటర్ సంగతి సరే! నా ప్రేమలేఖ సంగతేం చేశారు? అంగీకరించినట్టేనా?' అనే అర్థం స్ఫురించేలా సైగ చేశాడు. స్ఫురిస్తుందని అతననుకున్నాడు. కానీ నిజానికి స్ఫురించలేదు.

"మీరేమంటున్నారో అర్థం కావట్లేదు! పిచ్చిపిచ్చిగా సైగలు చేస్తే ఎలా అర్థమౌతుంది? ఇంతకీ నా లీవ్ లెటర్ మాటేంటి?" అంది అనూహ్య అతనికేసి ఎగాదిగా చూస్తూ.

'మా సుబ్బారావ్‌కిచ్చి పంపించానండీ' అనే అర్థం వచ్చేలా సైగ చేశాడు గౌతమ్. కానీ ఫలితం డిటోనే.

పిసరంత కూడా అర్థం కాని అనూహ్య అసహనంగా నుదురు చిట్లించింది - "అబ్బ! ఎందుకిలా చంపుతారు? అర్థమయ్యేలా చెప్పండి" అంది చిరాగ్గా.

అప్పుడు గాని గుర్తుకు రాలేదు గౌతమ్‌కి - తన జేబులో ఓ పెన్నూ, స్లిప్పుల దొంతరా వున్న సంగతి. వెంటనే జేబులోంచి వాట్ని బైటికి తీసి - "మా సుబ్బారావ్‌కిచ్చి పంపించాను అనూహ్యగారూ!" అని ఓ స్లిప్‌మీద రాసి దాన్నామె చేతికందించాడు.

ఆమె చదువుకుని దాన్ని నలిపి కింద పడేస్తుండగా - నందట్లో నడేమియా అన్నట్టు చప్పున మరో స్లిప్పందించాడు గౌతమ్.

"అది సరే అనూహ్యగారూ! ఇంతకీ నా విషయం ఏం చేశారు? నేను మళ్ళీ నోరు తెరిచి మాట్లాడగలిగే శుభదినం ఎప్పుడు?" ఇదీ అందులోని వర్తమానం.

'నీ బొంద' అనుకుంది అనూహ్య. 'మొత్తానికి గట్టివాడివే! నిజంగానే మాటమీద నిలబడిపోయేవాడిలా మా బాగా నటించేస్తున్నావ్'





అని కూడా అనుకుంది. అలా అనుకుంటుండగా ఆమెలో ఓ చిలిపి ఆలోచన మెరుపులా మెరిసింది.

ఈ నాటకాల రాయుణ్ణి ఇంత తేలిగ్గా వదిలిపెట్టకూడదు. ముప్పతిప్పలు పెట్టి మూడు చెరువుల నీళ్ళు తాగించాలి!...

"మీకు నిజంగా మళ్ళీ మాట్లాడాలని అనిపిస్తోందా?" అడిగింది ముఖంలో ఏ భావమూ వ్యక్తంకాకుండా జాగ్రత్తవహిస్తూ.

గౌతమ్ చేతిలోని స్లిప్పుల దొంతరలోని మరో స్లిప్పు నల్లబడింది.

"ఎందుకు లేదనూహ్యగారూ? కానీ మీరు నా ప్రేమనంగీకరించాలిగా?" ఇవీ ఆ స్లిప్పులోని అక్షరాలు.

"ఒకవేళ అంగీకరించకపోతే?" అడిగింది సీరియస్‌గా.

మరో స్లిప్పుద్వారా సమాధానం చెప్పాడు గౌతమ్ - "ఏముందీ! జీవితాంతం ఇలా నోరులేనివాడిగా మిగిలిపోవడమే!"

"నో... నేను నమ్మను. జీవితాంతం అక్కర్లేదు... ఇలా మాట్లాడకుండా కనీసం ఓ రెండు మూడు నెలలు కూడా వుండలేరని నా నమ్మకం?" అంది కవ్వింపుగా.

"వుండగలిగితే?" అడిగాడు స్లిప్పుద్వారా.

"వుండలేరు" రెచ్చగొట్టింది అనూహ్య.

అవకాశాన్ని వదులుకోలేదు గౌతమ్.

"మీకోసం ఏమైనా చేయగలన్నేను... మూడు నెలలేం ఖర్మ? ఓ ఏడాది దాకా మాట్లాడకుండా వుంటాను? పోనీ కనీసం అప్పుడైనా నా ప్రేమని అంగీకరిస్తారా?" అడిగాడు మరో స్లిప్పుద్వారా. దాన్ని ఆమెకు అందిస్తున్నప్పుడు 'ఏమంటారు మరి?' అని సవాలు చేస్తున్నవాడి కిమల్లే చూశాడు.

'నీ మొహంలే' అనుకుంది అనూహ్య. సరే చూద్దాం ఏమాత్రం నెగ్గుతారో అనిపించి - ఓ కండిషన్ పెట్టింది. "అలాగే! కానీ ఓ షరతు... కేవలం నా ఒక్కదానితో మాట్లాడకుండా వుండటం కాదు. ఇంకెవ్వరితోనూ మాట్లాడకూడదుమరి!"

అంతే! గౌతమ్ గుండెల్లోంచి ఆనందం ఎగదన్నుకొచ్చేసింది! హుర్రే అని బిగ్గరగా అరవాలనిపించిందిగాని అది బలవంతాన్న

కంట్రోల్ చేసుకున్నాడు. పెన్నుతో స్లిప్‌మీద చకచకా బరికాడు. "ఓకే... కనీసం ఒంటరిగా వున్నప్పుడు తేలు కుట్టినాసరే 'అబ్బా' అని కూడా అనబోనని ప్రామిస్ చేస్తున్నాను. కానీ మీరు మాట తప్పకూడదు సుమా!"

"డన్" అంది అనూహ్య పందానికి సిద్ధప డుతున్నదానిలా.

ఆనందాన్ని అదుపులో పెట్టుకోలేకపోయిన గౌతమ్ - ఆమెను ముద్దాడే సాహసం చేయలేక చటుక్కున తన అరచేతిని ముద్దుపెట్టుకున్నా డు. ఆ తర్వాత -

"అలాగే" అన్నట్టుగా తలెగరేశాడు ఆమె వైపు మెరుస్తున్న కళ్ళతో చూస్తూ.

"నేనైతే మాట తప్పను. మీ అదృష్టాన్ని పరీక్షించుకోండి మరి!" అనేసి, మరో మాటకు అవకాశం ఇవ్వకుండా చకచకా అక్కడినుంచి వెళ్ళిపోయింది అనూహ్య.

"అదృష్టవంతుడివిరా గౌతమ్! తంతే బూరె లబుట్టలో పడ్డావు" అనుకున్నాడు గౌతమ్ ఆమె వెళ్ళిన దిక్కు సంబరంగా చూస్తూ.

ఆమె తనకేదో మహదావకాశాన్నిచ్చిందను కున్నాడే తప్ప, పాపం ఆ అమాయకుడు తానొక ఉక్కుచట్రంలో బిగించబడ్డాడని గ్ర హించలేకపోయాడు.

తొండ ముదిరి ఊసరవెల్లి అయినట్టే ప్రేమ ముదిరి పిచ్చి అవుతుంది కాబోలు మరి!

* * *

ఒకపక్క ఆనందసాగరంలో తేలియాడు తూనే సుబ్బారావ్‌కి విషయమంతా ఆమూలా గ్రంగా తెలియజేస్తూ ఓ సుదీర్ఘమైన ఉత్తరాన్ని రాశాడు గౌతమ్.

అనుకోకుండా అనూహ్య తనదగ్గరికి రావడం అనాలోచితంగా తను రాసిన ఆ ఉత్తరాన్ని ఓ పందెంలా కన్వర్ట్ చేయడం - అదంతా కూడా రాశాడు వివరంగా.

సుమారు మూడున్నర గంటలు పట్టింది ఆ ఉత్తరాన్ని పూర్తిచేయడానికి. నిడివి తొమ్మిది న్నర అరఠావులైంది.

దాన్నిబట్టి సులభంగానే వూహించుకోవచ్చు అతనెంత డీటెయిల్డ్‌గా రాసుంటాడో.

ఆ సాయంత్రం ఆ ఉత్తరాన్ని చదివిన సుబ్బారావ్ నెత్తినోరు తపీతపీమని బాదు కుంటూ లబోదిబోమని మొత్తుకున్నాడు. "ఇదె క్కడి దిక్కుమాలిన గోలరా బాబూ? మెడకి బండ కట్టుకుని మరీ ఊబిలో దూకడానికి సిద్ధపడినట్టుగా వుంది ఇదంతా! ఆ అనూహ్య నీ మీద క్రోధంతో నిన్ను రెచ్చగొట్టి ఇలా ఉచ్చులో బిగించేసింది! ఏడాది పాటు మాట్లా డకుండా వుండటం అంటే మాటలను కుంటు న్నావేంట్రా? అంతకన్నా నరకం వేరొకటుంద దు. అంతే కాదు అందరూ నిన్ను పిచ్చివాడిగా ఎంచి తాటాకులు కడతారు. నా మాట విను మౌనదీక్షా లేదు నీ బొందా లేదు. ఆ అనూహ్య కాకపోతే మరో అపర్ణ. ఓపిగ్గా వెతకాలేగాని ఆమెకన్నా అందగత్తెలు ఎంతోమంది దొరుకు తారు. కాబట్టి ఆమెను మర్చిపో. నీ వెధవ దీక్షని తుంగలో తొక్కి హాయిగా మాట్లాడు" అంటూ శతవిధాల చెప్పిచూశాడు గౌతమ్‌కి.

కానీ కొంచెం కూడా మెత్తబడలేదు గౌతమ్.

ఇంత జరిగాక ఇంక ఇప్పుడు వెనుకంజ వేయడం అన్న ప్రశ్నేలేదు- అని ఖండితంగా తేల్చేశాడు. అంటే నోరు తెరిచి మాట్లాడాడని కాదు. ఆ విధంగా రాసి చూపించాడన్నమాట.

"ఇంతకన్నా తలతిక్క వ్యవహారం వేరొకటి వుండబోదు. చూడబోతే నీకు నిజంగానే పిచ్చె క్కిపోయి నట్టుంది" అన్నాడు సుబ్బారావ్ కోపంగా.

దానికి గౌతమ్ స్లిప్పుద్వారా ఇచ్చిన సమా ధానం- "నన్ను పిచ్చివాడనుకో, వెర్రివాడనుకో, మతిలేని వెధవనుకో, ఇంకేమన్నా అనుకో. కానీ నా నిర్ణయం మార్చుకోవడం మాత్రం కల్ల. నా అనూహ్య కోసం నిప్పుల్లో దూకమన్నా నేను సిద్ధమే! అలాంటిది ఆఫ్టరాల్ ఒక్క ఏడాది మౌనంగా వుండలేనా?"

రాజుకన్నా మొండివాడు బలవంతుడని వూరికే అన్నారా? మరీ అంతలా బిగుసుకుపో యిన గౌతమ్‌ని ఎలా దారికి తేవాలో అర్థం కాలేదు సుబ్బారావ్‌కి. "నీ ఇష్టం వొచ్చినట్టు ఏడువ్" అనేశాడు చిరాకుగా.

* * *

ఆరోజు అంటే దీక్ష ప్రారంభమైన రెండో రోజు ఆఫీసుకెళ్ళగానే గబగబా ఓ కాగితాన్ని

తీస్కుని దానిమీద "నేను మౌనదీక్షలో వున్నాను. కాబట్టి దయచేసి నన్నెవ్వరూ మాట్లాడించకండి ఇట్లు గౌతమ్" అని రాసి ఆ తర్వాత ఆ కాగితాన్ని టేబుల్ మీద పెట్టి, దానిపై పేపర్ వెయిట్ పెట్టాడు గౌతమ్.

"ఏంటోయ్ అది?" అడిగాడు పక్కసీటు రాంబాబు- ఏంటబ్బా రాగానే బరబరా బరుకుతున్నాడూ అన్న కుతూహలంతో.

గౌతమ్ బదులివ్వకుండా ఎదుటి సీటు వైపు చూశాడు. అంతే అనూహ్య సీటువైపు అన్నమాట! ఇతని వైపే చూసీ చూడనట్టుగా చూస్తూ వుందామె.

ఒకరిద్దరు తప్ప అప్పటికి దాదాపు స్టాఫంతా ప్రజంటయ్యారు.

'చదివి చూడు నీకే తెలుస్తుంది' అన్నట్టుగా సైగచేశాడు గౌతమ్ రాంబాబుకి.

'సైగలు దేనికి- నోటితో చెప్పొచ్చుగా?' అనుకుంటూనే గౌతమ్ టేబుల్ మీదనుంచి ఆ కాగితాన్ని తీసుకుని అందులోకి దృష్టిసారించిన రాంబాబు ఆశ్చర్యపోయాడు. "మౌనదీక్షా?! దేనికి?!!"

'తగినంత కారణముందిలే గాని నేనిప్పుడు చెప్పలేను' అన్నట్టు సైగచేశాడు గౌతమ్. నొసలు చిట్లించి అతని వైపు అదోలా చూశాడు రాంబాబు.

తన సైగ అతనికి అర్థం కాలేదని గ్రహించి కాగితం మీద రాసి చూపించాడు గౌతమ్.

"కారణం అడగొద్దు... చాలా బలమైన కారణమే వుందిగాని పైకి మాత్రం చెప్పలేను"

చంకల కింద చేతులు పెట్టి కితకితలు పెట్టినట్టేనవ్వాడు రాంబాబు.

లేకపోతే ఏంటి? మౌనదీక్ష... పైకి చెప్పలేని కారణంవల్ల మౌనదీక్ష?! అసలు బుద్ధీ జ్ఞానం వున్న వాడెవడైనా చేస్తాడా మౌనదీక్ష?

"ఉమ్మెత్తకాయల రసంగాని పుచ్చుకున్నావా ఏంటి గురూ?" నవ్వునాపుకోవడానికి విశ్వప్రయత్నం చేస్తూ అడిగాడు రాంబాబు.

లేదన్నట్టు అడ్డంగా తలాడించాడు గౌతమ్.

"మరి?"

గౌతమ్ బదులివ్వలేదు.

అంతలో 'ఏంటిగురూ! ఏంటి విశేషం?" అంటూ అక్కడికొచ్చాడు పావనమూర్తి.

"గౌతమ్ మౌనదీక్ష పూనేట్ట?!" ఘొల్లున నవ్వుతూ చెప్పాడు రాంబాబు.

"మౌనదీక్షా? మౌనదీక్షేంటి?!"

"అంటే మాట్లాడకుండా వుండటం!" పగలబడి నవ్వుతూ గౌతమ్ రాసిన కాగితాల్ని పావనమూర్తికి చూపించాడు రాంబాబు.

"ఇదేం పిచ్చి?" అంటూ పావనమూర్తి కూడా పగలబడి నవ్వాడు.

అడవిలో ఓ మూల అగ్గిరాజుకుంటే అది రాజుకున్న చోటే వుండిపోదు కదా, రాజుకున్న ఆ అగ్గి కార్చిచ్చయి అడవంతా వ్యాపించిపోవడానికి కొద్ది క్షణాలు చాలు.

గౌతమ్ మౌనదీక్ష విషయంలోనూ అదే జరిగింది. నేల మీద ఒలికి చెల్లా చెదురైపోయిన పాదరసంలా అయిదు నిముషాల్లో ఆఫీసంతా స్ప్రెడ్ అయిపోయింది ఆ వార్త!

'జూ'లోని జంతువైపోయాడు గౌతమ్. అందరూ కుతూహలంగా అతని దగ్గరికి రావడం, విచిత్రంగా చూడ్డం, ఏమిటి సంగతని ప్రశ్నించడం.

'ఏమీ లేదులే' అన్నట్టు చేతులు తిప్పుతూ కూర్చున్నాడే తప్ప నోరు మాత్రం విప్పలేదు గౌతమ్.

అదంతా చూస్తూ కూర్చున్న అనూహ్యకి పొట్టచెక్కలయ్యేంత నవ్వొచ్చిందిగాని, అతి బలవంతాన్న ఎలాగో నిగ్రహించుకొంది.

అనూహ్య ఒక్కదానికే కాదు గౌతమ్ పరిస్థితికి అక్కడున్నవారిలో చాలా మందికి నవ్వొచ్చింది.

ముసిముసిగా కొందరు.... లోపల్లోపల కొందరు.. గట్టిగా కొందరు... మెల్లగా కొందరు.. ఎవరికి తోచినట్టు వాళ్ళు నవ్వేశారు గౌతమ్‌ని చూసి.

అనూహ్యలా నిగ్రహించుకోవాల్సిన అవసరం వాళ్ళకు లేదుకదా?! అనూహ్యంటే అసలు కారణం ఎరిగిన మనిషికాబట్టి తను నవ్వితే అతను ఉడుక్కు చస్తాడని నిగ్రహించుకుంది. అదీగాక అంతమంది మగ పురుగుల మధ్య బిడియం గట్రా లేకుండా




తాను నవ్వడం బావుండదు కదా అన్నది మరో కారణం.

అందరూ తనకేసి అలా వింతమృగాన్ని చూసినట్టు చూడ్డం... పగలబడి నవ్వడం... గౌతమ్‌కి ఏడుపొచ్చినంత పనైంది!

కానీ ఏం చేయగలడు?

అనుభవించాలి- తప్పదు- ప్రేమకోసం!

ఆ నవ్వుల ప్రహసనం అలా ఓ పావుగంట సాగేక ఏ క్షణంలోనైనా మేనేజర్ రావచ్చునన్న భయంతో స్టాఫంతా వారి వారి సీట్లలోకి వెళ్లి కూర్చున్నారు. కానీ సంభాషణ మాత్రం ఆ విషయం మీదే!

కారణం ఏమయ్యుంటుందా అన్నది అందరికీ అంతుచిక్కని ప్రశ్నైపోయింది.

అంతలో అరివీర భయంకరుడిలా రానే వచ్చాడు మేనేజరు.

ఆయన తన ఛాంబర్‌లోకి వెళ్లి కూర్చున్న వెంటనే ఏదో వంకతో ఆయన దగ్గరకు వెళ్లి ఆ మాటా ఈ మాటా చెబుతూ గౌతమ్ మౌనదీక్ష గురించి ఊదేశాడు పావనమూర్తి.

ముందు ఆశ్చర్యపోయి ఆ తర్వాత ఆగ్రహంతో మండిపడ్డాడు మేనేజరు.

"ఇది ఆఫీసనుకుంటున్నాడా, అడవనుకుంటున్నాడా ముక్కు మూస్కొని తపస్సు చేసినా కుదరడానికి!? ఆఫీసులో మౌనదీక్షేంటి? నాన్‌సెన్స్!... అంతసరదాగా వుంటే ఉద్యోగం మానేసి ఏ టాంక్‌బండ్ మీదో ఏడవమను. అయ్ డోంట్ అలౌదిస్ టైప్ ఆఫ్ నేస్టీథింగ్స్ ఇన్ మై ఆఫీస్. ఏడి? ఎక్కడ?... అతన్ని వెంటనే నా దగ్గరికి రమ్మను" అనరుస్తూ ఆవేశంగా బెల్ మ్రోగించాడు.

బెల్ మోతకి ప్యూన్ రావడం, ఆదేశాన్నందుకుని అతను బైటికి వెళ్ళడం, ఆ దరిమిలా గౌతమ్ భయం భయంగా పిల్లిలా ఆ ఛాంబర్‌లో కాలుపెట్టడం ఒకదాని వెంబడి ఒకటి జరిగిపోయాయి.

"ఏంటోయ్? ఏదో మౌనదీక్ష చేస్తున్నావంట?"

'అవున్సార్' అన్నట్టు నిలువుగా తలాడించాడు గౌతమ్.

"వాట్ ఫర్?" గర్జించాడు మేనేజర్.

గుడ్లు మిటకరించి చూశాడే తప్ప బదులివ్వలేదు గౌతమ్. స్లిప్ మీద రాసి చూపిద్దామనుకున్నాడు గాని ధైర్యం చాల్లేదు.

"నిన్నే అడుగుతూంట! ఏం మాట్లాడవేం?" ఈసారి గాండ్రించాడు మేనేజరు.

"ఎలా మాట్లాడగల్ను సార్? నేను మౌనదీక్షలో వున్నాను. కదా?" అనే అర్థం వచ్చేలా చేతులు తిప్పాడు గౌతమ్.

"ఏంటా భరతనాట్యం చేయడం?!" గర్జింపునూ, గాండ్రింపునూ మిళితం చేసి అరిచాడు మేనేజరు.

'నీ మదర్ కడుపు మాడా! ఇది భరతనాట్యమట్రా? చేతులు తిప్పితే అర్థం చేసుకోలేని ఛండాలపు వెధవ' అని మనసులో కసిగా తిట్టుకుని "అబ్బే లేస్సార్! ఇది భరతనాట్యంకాదు" అనే అర్థం వచ్చేలా చేతులు తిప్పాడు గౌతమ్.

అంతే! ఒళ్లు భగభగా మండిపోయింది మేనేజర్‌కి.

"స్టుపిడ్ నా ముందే డాన్స్ చేస్తావా? చూడు నిన్నేం చేస్తానో" అంటూ సీట్లోంచి దిగ్గున లేచాడు.

పరిస్థితి విషమించిందని గ్రహించిన గౌతమ్ రెప్పపాటు కాలంలో అక్కడి నుంచి మాయమై తన సీట్లో కొచ్చి పడ్డాడు.

మేనేజర్ ఛాంబర్‌లోంచి పరుగెత్తుకుంటూ వచ్చి సీట్లో కూలబడిన అతని కేసి ఆశ్చర్యంగా చూస్తూ అడిగాడు రాంబాబు- "ఏమైంది గురూ?"

"నేను మౌనదీక్షలో వున్నానని తెలిసి కూడా మేనేజర్ ఏంటేంటో వాగుతున్నాడు" అని ఓ కాగితం మీద బరబరా రాసి దాన్ని రాంబాబు కందించాడు గౌతమ్.

అంతలో తన ఆగ్రహాన్ని ఖాతరు చేయకుండా మెరుపులా మాయమైపోయిన గౌతమ్‌ని వెతుక్కుంటూ వినవిసా అక్కడికొచ్చేశాడు మేనేజరు.

"ఇడియట్! ఒక పక్క నేను మాట్లాడుతోంటే మంచీ మర్యాదా లేకుండా నీ ఇష్టానుసారం బైటికొచ్చేస్తావా? సుపీరియర్‌కి రెస్పెక్ట్ ఇచ్చే విధానం ఇదేనా? అసలేంటి నీ ఉద్దే

శ్యం?'' నిప్పుల గ్రక్కుతూ చూశాడు గౌతమ్ కేసి.

గౌతమ్ తల పాతాళంలోకి కృంగిపోయింది. అంతమంది ముందు అంత అవమానకరంగా మాట్లాడుతున్నా పెదవి విప్పలేని పరిస్థితి.

ఎంతయినా పక్క సీటాయె! కొద్దిగొప్పో అభిమానం వుండటం కద్దు! గౌతమ్ పరిస్థితికి జాలేసి అతని తరుపున తను నోరువిప్పాడు రాంబాబు.

''అతన్ని మాట్లాడించకండి సార్! అతను మౌనదీక్షలో వున్నాడు''

రాంబాబుకేసి తినేసేలా చూశాడు మేనేజరు.

''షటప్! నిన్ను కాదు నేనడుగుతూంట!''

మేనేజరు హుంకరింపుతో రాంబాబులోని ధైర్యం నీరుగారిపోయింది. అంతే కాకుండా 'నీకెందుకు నువ్ నోర్మూసుకో' అని అతని అంతరాత్మ అతన్ని గద్దించింది కూడా. దాంతో అతను కుక్కిన పేనైపోయాడు.

ఆ దరిమిలా అక్కడ చాలా పెద్ద న్యూసెన్సే జరిగిపోయింది. 'మేనేజర్ అరవడం గౌతమ్ మాట్లాడకపోవడం, మేనేజరు అరవడం గౌతమ్ మాట్లాడకపోవడం మేనేజరు అరవడం గౌతమ్ మాట్లాడకపోవడం' ఇదేతంతు రిపీటెడ్‌గా ఓ పది పన్నెండు సార్లు జరిగాక ఇంక సహనం చచ్చి, ''గెటవుట్ ఫ్రమ్ మై ఆఫీస్! నీ దిక్కుమాలిన దీక్ష ముగిసేవరకూ మళ్ళీ ఈ ఆఫీసులో కాలు పెట్టబాకు! అయామ్ గివింగ్ యు వన్ వీక్‌టైమ్! నీ దీక్ష మానేసి మళ్ళీ ఎప్పట్లా వచ్చి పని చేసుకుంటావో లేక రిజైన్ చేసి వెళ్ళి పోతావో నిర్ణయించుకో. లేకపోతే నీ వ్యవహారం మేనేజ్‌మెంట్‌కి రిపోర్ట్ చేసి నేనే నిన్ను డిస్మిస్ చేయించేస్తాను! ఆఁ...'' అని సిన్సియర్‌గా వార్నింగిచ్చి రగులుతున్న అగ్ని పర్వతానికి కాళ్ళొచ్చి నడుస్తున్నట్టుగా తన ఛాంబర్‌లోకి తిరిగి వెళ్లిపోయాడు మేనేజరు.

'పాపం' అనుకుందనూహ్యా గౌతమ్ దుస్థితికి జాలిపడి. మళ్ళ అంతలోనే 'పాపమేమిట్లే పాపం? అంతే కావాలి అలాంటి వాళ్లకి!' అనుకుంది కసిగా.

ఆ ఆఫీసులోని ప్రతి ఒక్కరూ ఎప్పుడో ఒకప్పుడు గౌతమ్ చేత బాధింపబడ్డవారే కావడం వల్ల, అంత జరిగినా కూడా ఏ ఒక్కరికీ అతని మీద కనికరం కలగలేదు. పైగా బైటికి వ్యక్తం చేయకపోయినా అందరూ లోలోన చంకలు గుద్దుకున్నారు.

'కాకుల గుంపులో హంసలా అయిపోయింది తన పరిస్థితి' అనిపించింది గౌతమ్‌కి. ఆ సమయంలో అతని మనసు బాగోకపోవడం వల్ల ఆ ఉపమానం నిజంగా తనకు అన్వయిస్తుందా లేదా అని ఆలోచించలేక పోయాడతను. అందరూ తనకేసి హేళనగా చూస్తుంటే వాళ్ళంతా తనను పొడుచుకు తింటానికి సిద్ధంగా వున్న కాకుల్లాగే అనిపించారతనికి. మరొక్క క్షణం కూడా అక్కడుండబుద్ధి కాక, ఎవ్వరితోనూ ఏమీ మాట్లాడకుండా తలదించుకుని ఆఫీసులోంచి బైటికి నడిచాడు.

అతనలా గడపదాటాడో లేదో ఆఫీసంతా నవ్వులతో మారుమ్రోగిపోయింది.



''వద్దురా బాబూ అని నేను చెప్తే విన్నావా?'' అన్నాడు సుబ్బారావ్- గౌతమ్ ఆఫీసులో తానెదుర్కొన్న విషమ పరిస్థితిని ఓ కాగితం మీద రాసి చూపించగా దాన్ని చదివాక.

''సరే! ఇంతకీ ఇప్పుడు గండాన్ని ఎలా దాటాలనుకుంటున్నావ్?''

'నువ్వే ఏదయినా మార్గం చూపి పుణ్యం గట్టుకో' అన్నట్టుగా సైగ చేశాడు గౌతమ్.

సుబ్బారావ్‌కిపుడు గౌతమ్ సైగల భాష కొన్త బాగానే అర్థమవుతోంది.

''సరే! ప్రస్తుతానికి ఒక పనిచెయ్యి. సిక్‌లీవ్

పెట్టు ఓ నెల. ఆ తర్వాత ఏదోఒక ఉపాయం ఆలోచిద్దాం!''

సుబ్బారావ్ సలహా క్షేమగ్గా వుందని పించింది గౌతమ్‌కి. దాన్ని ఆచరణలో పెట్టడా నికే నిశ్చయించుకున్నాడు.

ఆ మర్నాడే అతను తన ఆఫీసుకి సిక్ ఇంటిమేషన్ లెటర్ పంపించాడు.

ఆవిధంగా అతనికి మేనేజర్ పీడయితే తప్పిందిగాని మనసుకి మాత్రం శాంతి అనేది లేకుండా పోయింది.

ఎలా వుంటుంది? ఆఫీసులో అయితే ఎంచక్కా ఎదుటి సీట్లోవుండే అనూహ్యని పొద్దస్తమానం చూస్తూ కూర్చోవచ్చు. ఇప్పుడు ఆ అవకాశంలేదుగా!

ఆమె ఆఫీసుకు వెళ్ళేటప్పుడూ వచ్చేటప్పుడూ పిచ్చివాడిలా దార్లో కాపుకాయడం, ఒళ్లంతా కళ్లు చేస్కుని ఆమెను తనివితీరా చూస్కోవడం, మిగతావేళల్లో రూమ్‌లో కూర్చుని గోళ్లు గిల్లుకోవడం. ఇలా ఓ వారంరోజులు చాలా భారంగా, భారాతిభారంగా గడిచాయి. ఈ వారంరోజుల్లో వ్రతభంగం కలక్కుండా వుండడానికి ఎన్ని జాగ్రత్తలు తీస్కోవాలో అన్ని జాగ్రత్తలూ తీసుకున్నాడు గౌతమ్. జాగ్రత్తలంటే జాగ్రత్తలని కాదు, మనసును అంత దృఢంగా వుంచుకున్నాడన్నమాట.

''ఈ అర్ధరాత్రివేళలో నువ్ మాట్లాడుకున్నదీ లేన్దీ ఆవిడగారేవన్నా చెక్ చేయబోయిందా? మూర్ఖత్వం చాలించి కాసేపు నోరువిప్పి హాయిగా మాట్లాడరా'' ఓరోజు రాత్రి పన్నెండు దాటాక సుబ్బారావ్ గౌతమ్‌ని టెంప్ట్ చేస్తూ అన్నాడు- ''అదీగాక నువ్విలా మాట్లాడకుండా చాలాకాలం గనక వుండిపోతే కొన్నాళ్లకి నీ కంఠనాళం పూర్తిగా మూసుకుపోయి శాశ్వతంగా మూగవాడివైపోయే ప్రమాదం కూడా ఉంది'' అంటూ బెదిరించడానికి కూడా ప్రయత్నించాడు.

అయినప్పటికీ గౌతమ్ ఏమాత్రం టెంప్ట్ కాలేదు. ఏ కొంచెం కూడా బెదరలేదు. అంతగా తలకెక్కిపోయింది- అతనికి ప్రేమోన్మాదం.

అర్ధరాత్రి పన్నెండు గంటల వేళప్పుడు కూడా సుబ్బారావ్ మిత్రుణ్ణి మార్చడానికి ప్రయత్నించాడూ అంటే మిగతా సమయాల్లో అతనెంతగా మొత్తుకునుంటాడో ఊహించటం సులభమేకదా?

ఈ వారంరోజుల్లో గౌతమ్ నోటివెంబటి ఏదైనా ధ్వని బైటికొచ్చిందీ అంటే అది అతనికి తుమ్మొచ్చిన ఒకేఒక్క సందర్భంలో మాత్రమే. అంత స్ట్రిక్ట్‌గా పాటించేస్తున్నాడతను తన మౌనవ్రతాన్ని.

మొదట్లో సుబ్బారావ్ అనుకోలేదు మిత్రుడు సదరు దీక్షని అంత స్ట్రిక్ట్‌గా ఆచరించేస్తాడని. మహాఅయితే ఓ మూడ్రోజులుంటాడేమోలే అనుకున్నాడు. అలాంటిది నిండా వారంరోజులు గడిచిపోయినా అతగాడి వైఖరిలో మార్పు రాకపోవడంతో ప్రాణం బేజారెత్తిపోయింది సుబ్బారావ్‌కి.

ఇంక ఉపేక్షిస్తే లాభం లేదనిపించి ఎనిమిదోనాడు జోగారావుకో ఉత్తరం రాసిపారేశాడు, అయ్యా మీ సుపుత్రుడు మతి చెడగొట్టుకుని అఘోరిస్తున్నాడిక్కడ. కాబట్టి మీరు వెంటనే వచ్చి తగుచర్య తీసుకోవటం మంచిదంటూ.

భుజస్కంధాల మీద బాధ్యతంటూ ఒకటి మోపబడ్డాక ఆమాత్రం ముందుచూపుతో వ్యవహరించడం సబబేకదా? అయినా కాకపోయినా మిత్రుడు చెడిపోతుంటే చూస్తూ చూస్తూ ఎవరూరుకోగలరు?

ఆ ఉత్తరం జోగారావ్‌కి అందేక ఏం జరుగుతుందన్నది ఆ దేవుడికే ఎరుక.

అది అలావుంచి మళ్లీ వెనక్కి గనక వస్తే-

తన మౌనవ్రతంవల్ల గౌతమ్ ఈ వారంరోజుల్లో ఎదుర్కొన్న ఇబ్బందులూ అగచాట్లూ ఇన్నీ అన్నీ కావు. మొత్తం అన్నిట్నీ ఏకరువు పెట్టడం చాలా కష్టం కాబట్టి మచ్చుకు కొన్ని ఉదాహరణలు.

వ్రతం ప్రారంభమైన మూడోనాడు గౌతమ్ వాళ్ల వరండామీద వాలుకుర్చీలో కూర్చుని ఏదో వీక్లీ తిరగేస్తుండగా జరిగిందా సంఘటన. అందులోని ముఖ్య పాత్రధారి డుంబూ.

అవును డుంబూనే. వాడు ఆరోజు ఓ కొత్త బొంగరాన్ని కొనుక్కున్నాడు. బొంగరం కొత్తది గనక దాన్ని అందరికీ చూపించాలన్న తపన కలిగిందో ఏమో మరి, వరండా ఖాళీగానే





వున్నా కిందికిదిగి నడిరోడ్డుమీద ఆడ్డం ప్రారంభించాడు దాన్తో.

అది రోడ్డుపక్కగా వున్నఇల్లు. వరండామెట్లు దిగితే రోడ్డే.

డుంబూ అలా ఆడుతుండగా ఎక్కణ్ణించో ఓ ఆంబోతు పరిగెత్తుకుంటూ రావడం కనిపించింది గౌతమ్‌కి. అది పిచ్చిపట్టిందానికిమల్లే కన్నూమిన్నూ కానకుండా డుంబూవైపే పరిగెత్తుకుంటూ వస్తోంది. అయితే బొంగరం ధ్యాసలో వున్న డుంబూ అది గమనించుకోలేదు.

ఆంబోతు డుంబూని సమీపించేస్తోంది.

వాణ్ణి గట్టిగా కేకేసి హెచ్చరిద్దామా అంటే మౌనవ్రతం ఒకటి ఏడ్చిందాయె. అంచేత ఆ కంగార్లో ఏంచెయ్యాలో పాలుపోక వాలుకుర్చీలోంచే వింత విన్యాసం ప్రారంభించాడు గౌతమ్. అంటే నెత్తిబాదుకోవడం, రేయ్ డుంబూ ఆంబోతురా అని అరుస్తున్నట్టుగా సైగ చెయ్యడం, ఎట్సెట్రా ఎట్సెట్రా అన్నమాట.

సరిగ్గా అదే సమయానికి వరండా మీదకొచ్చిన పావని కంటపడిందా దృశ్యం.

ఆమె పరుగుపరుగున డుంబూ దగ్గరికెళ్లి వాణ్ణి చటుక్కున ఇవతలికి లాగింది. దాంతో చాలా పెద్దప్రమాదం తృటిలో తప్పిపోయింది. ఆమే గనక డుంబూని అలా లాక్కపోయివుంటే వాడు ఆ ఆంబోతు కాళ్లకిందపడి నజ్జునజ్జు అయిపోయేవాడే.

అచ్చాసి గౌతమ్ మనసులో 'అమ్మయ్య' అనుకుంటుండగా ఉప్పెనపొంగులా అతని మీద విరుచుకుపడింది పావని.

అతను మౌనదీక్షలో వున్నాడని సుబ్బారావ్ ద్వారా అప్పటికే విని వున్నదామె. అయినాసరే తల్లడిల్లిన తల్లి ప్రాణం కోపాన్ని అణుచుకోలేకపోయింది.

"నీ మౌనదీక్ష మంటెట్టా. ఒకపక్క పిల్లాణ్ణి ఆంబోతు కుమ్మడానికొస్తుంటే నెత్తి బాదుకుంటూ ఇక్కడ డాన్స్ చేస్తూ కూర్చుంటావా? ఒక నిండు ప్రాణంకన్నా నీ దిక్కుమాలిన దీక్షే ఎక్కువయిపోయిందా నీకు? సమయానికి నేను రాబట్టి సరిపోయింది. లేకపోతే నా బిడ్డ ఏమైపోయి వుండేవాడు? అక్కా నక్కా అంటూ దొంగప్రేమ కురిపించగానే సరిపోయిందా? అదే నిజంగా నీ అక్క బిడ్డడే అయితే ఇలాగే చేస్తావా? ఒరేయ్ ఆంబోతురా ఆంబోతురా అని గట్టిగా అరవ్వా? లేదూ పరిగెత్తుకుంటూ వెళ్ళి పోనీ రక్షించడానికైనా ప్రయత్నించవా?'' అంటూ ప్రారంభించి గుక్కయినా తిప్పుకోకుండా తిట్టిపోసింది గౌతమ్‌ని. అతను సైగల భాషద్వారా ఏమిటేమిటో చెప్పడానికి ప్రయత్నించాడుగాని అదేం పట్టించుకోకుండా దులపరించి పారేసిందామె.

తను తిట్టింది చాలక శ్రీరామ్మూర్తి వచ్చాక అతనిక్కూడా విషయం చెప్పి అతనితో కూడా తిట్టించింది గౌతమ్‌ని.

మళ్లీ వ్యవహారం మొదటికే వచ్చేసింది, ఇల్లు ఖాళీ చేసేయమని మళ్లీ పోరుపెట్టడం ప్రారంభిస్తారేమో అని హడిలిపోయాడు గౌతమ్.

కానీ సుబ్బారావ్ వచ్చి జరిగిన విషయం తెలుసుకుని ఆ దంపతులిద్దరికీ దీనాతిదీనంగా నచ్చజెప్పడంతో వాళ్లు కాస్త చల్లబడ్డారు. అందువల్ల అంత ఉపద్రవం ముంచుకురాలేదు. దానికితోడు ఆ సాయంత్రం గౌతమ్ ఓ క్షమాపణ ఉత్తరాన్ని రాసి, దానికో గాంధీ టెక్స్ కాటన్ శారీని జతచేసి, దేవతలాంటి అక్కయ్యకి తమ్ముడి అనురాగపూరిత కానుకంటూ సమర్పించుకోవడం కూడా జరగడంవల్ల ఆ గొడవ అంతటితో పూర్తిగా అణగారిపోయింది.

ఆ మర్నాటి రాత్రి సుబ్బారావ్ వంటచేస్తుంటే గౌతమ్ మంచంమీద కూర్చుని వుండగా జరిగిందింకో సంఘటన.

సుబ్బారావ్ స్టవ్‌వేపు ముఖం పెట్టుకూర్చుని దోసకాయ చెక్కు తీస్తున్నాడు. అంటే గౌతమ్‌కి వీపు చూపుతూ అన్నమాట.

అట్టి తరుణంలో రంగప్రవేశం చేసిందొక వయ్యారిభామ. వయ్యారిభామ అంటే అందమైన ఆడపిల్ల అని కాదు. గోడమీద బొమ్మ. గోలుసుల బొమ్మ. వచ్చేపోయేవారికి వడ్డించే బొమ్మ. అంటే అర్థమయ్యిందికదా? తేలు. స్కార్పియన్.

సదరు తేలు సుబ్బారావ్ పాదాన్ని సమీపిస్తుండగా గౌతమ్ దాన్ని చూడ్డం జరిగింది. కానీ పాపం అతను మౌనదీక్షలో వుండటంవల్ల

నోరు తెరిచి మిత్రుణ్ణి హెచ్చరించలేకపోయాడు. అలాగని కుడితే కుట్టింది లెద్దూ అని వూరుకున్నాడని కాదు. దాన్ని చావగొట్టడం కోసం ఛెంగున మంచంమీంచి దూకి చెప్పు కోసం పరుగుతీశాడు. కానైతే ఆ తేలే అంతవరకూ ఆగలేకపోయింది. అతను చెప్పుతో తిరిగొచ్చేలోగా దాని పనికాస్తా అది కానిచ్చేసింది. అంటే కుట్టేసిందన్నమాట సుబ్బారావ్ పాదాన్ని.

దాంతో సుబ్బారావ్ బాధతో లబోదిబోమనడం, గౌతమ్ అతన్ని హాస్పిటల్‌కి తీస్కెళ్లి ఏదో ఇంజక్షన్ చేయించడం, అయినా సరే బాధ తగ్గక సుబ్బారావ్ ఆ రాత్రంతా బాధపడుతూనే వుండటం వగైరా వగైరా జరిగిపోయాక... తగుదునమ్మా అంటూ తన తప్పిదాన్ని గౌతమ్ కాగితంమీద రాసి చూపించాడు సుబ్బారావ్‌కి- "సారీరా మౌనదీక్షవల్ల ఆ తేలుని చూసి కూడా ముందుగా నిన్ను హెచ్చరించలేకపోయాను. వెధవముండ చెప్పు తెచ్చేదాకా కూడా ఆగకుండా నిన్ను కుట్టేసింది. అయామ్ వెరీ వెరీ సారీ" అని.

చెప్పుచ్చుక్కొట్టి సారీ అంటే ఎవరికైనా సరే ఎంత ఒళ్లు మండిపోతుందో అంత ఒళ్లు మండిపోయింది సుబ్బారావ్‌కి. మండదా మరి? తేలు కుడితే కలిగే బాధ కుట్టించుకున్న వాడికి తెలుస్తుంది.

సహజంగానే గౌతమ్‌మీద విరుచుకు పడ్డాడు సుబ్బారావ్- "నీ మొహం తగలెయ్యా! నీ దిక్కుమాలిన మౌనదీక్ష నాశనమైపోనూ. నీ ప్రేమని పక్షులెత్తుకుపోనూ" అంటూ శాపనార్థాలతో ప్రారంభించి- "నన్ను తేలు కుట్టడంకన్నా నీ బోడిప్రేమే ముఖ్యమైపోయిందన్నమాట నీకు? నన్ను తేలు కుడుతుంటే చూస్తూ ఊరుకున్నావూ అంటే- ఛీ...నువ్ నా స్నేహితుడివని చెప్పుకోవడానికే సిగ్గుగా వుంది. నేనే గనక నీ స్థానంలో వుంటే అలా చూస్తూ ఊరుకోగలిగేవాడినా? ఛీ... విశ్వాసఘాతకుడా" అంటూ నోటికెంతమాటొస్తే అంత మాటంటూ తిట్టిపోశాడు. అంత ఘాటుగా, అంత సిన్సియర్‌గా, అంత గాఢంగా సుబ్బారావ్ గౌతమ్‌ని తిట్టిపోయడం అన్ని సంవత్సరాల వాళ్ల స్నేహంలో అదే మొదటిసారి.

పరిస్థితి మరీ అంతలా వికటించినందుకు గౌతమ్‌కి ఏడుపొచ్చినంతపనైంది.

కానీ ఏం చేయగలడు? నోరువిప్పి సారీ అయినా చెప్పుకోలేని పరిస్థితి. అందువల్ల మౌనంగా బాధను దిగమింగుకుంటూ సుబ్బారావ్ తిట్టిన తిట్లన్నింటినీ ఓపిగ్గా భరించాడు పాపం.

అఫ్‌కోర్స్ వాళ్ల స్నేహం అచంచలమైనది కాబట్టి మరోగంట తర్వాత సుబ్బారావ్ జరిగిందంతా మర్చిపోయి మిత్రుడితో మళ్లీ ఎప్పటిలా మాట్లాడగలిగాడు. అది వేరేసంగతి. మొత్తానికి అనర్థమైతే జరిగిపోయిందికదా?

ఇంకోరోజు... ఎలాగో ఇంట్లోనే వుంటున్నాను కదా, సుబ్బారావ్‌గాడొచ్చేసరికి వంట చేసేసి వాణ్ణి ఆశ్చర్యంలో ముంచేద్దాం అనిపించి, బియ్యం కడిగి స్టవ్‌మీద పడేశాడు గౌతమ్.

ఓ పదినిమిషాల తర్వాత అన్నం వుడికిపోయింది. గరిటతో కాస్త బైటికి తీసి మెతుకు నొక్కిచూసి అన్నం వార్చడానికుపక్రమించిన గౌతమ్ పెద్దగా అలవాటులేనిపని కావడంవల్ల అన్నం గిన్నెని చేతిమీద జారవిడిచేసుకున్నాడు. ఫలితంగా వేడివేడి అన్నమూ, గంజీ చేతులమీద పడిపోవడంవల్ల కైలాసం కనిపించిందతనికి. బాధతో కెవ్వుమని అరవబోయాడుగాని, ఆ స్థితిలో కూడా దీక్ష సంగతి గుర్తొచ్చి పళ్లు బిగువున బాధ అణచిపెట్టుకున్నాడే తప్ప కిక్కురుమనలేదు. ఉష్ అంటానికి లేదు, అమ్మా అంటానికి లేదు, అబ్బా అంటానికి లేదు. చేతులేమో భగభగా మండిపోతున్నాయి. ప్రాణం కక్కటిల్లిపోతోంది. నిజంగా అదొక నరకయాతన. పగవాడిక్కూడా వద్దనిపించేటంత బాధాకరమైన పరిస్థితి అది. ఆ సమయంలో అతననుభవించిన బాధ నిజంగా వర్ణనాతీతం. అలాంటి స్థితిలో కూడా వ్రతానికి కట్టుబడి వుండటం నిస్సందేహంగా అనితరసాధ్యమే.

నిజంగా అనూహ్యా గనక ఆ సన్నివేశాన్ని చూడ్డం జరిగితే, చూడ్డానికి అవకాశమే లేదు, అది వేరే సంగతి. కాని ఒకవేళ జరిగితే మాత్రం ఆమె మనసు తప్పకుండా కరిగిపోయి వుండేదే.

ప్రేమకోసం చేతులు కాల్చుకున్నప్పుడు




కూడా కిక్కురుమనకుండా వుండగలగటం సామాన్యమా మరి?

మరో రోజు...

అనూహ్యా ఆఫీసుకు వెళ్లే టైములో ఇంటి దగ్గర్నుండి బస్టాప్‌వరకూ ఆమెను ఫాలో అవుతూ వెళ్లిన గౌతమ్, ఆమె బస్సెక్కి వెళ్లిపోయాక ఇంటికి తిరుగుముఖం పట్టాడు.

అతను నడుస్తూండగా జేబులోంచి అతని పర్సు జారి రోడ్డుమీద పడిపోయింది.

సరిగ్గా అదే సమయానికి ఆ పక్కనే వున్న చెత్తకుండీ దగ్గర చిత్తుకాగితాలేరుకుంటున్న ఓ పధ్నాలుగేళ్ల కుర్రాడు దాన్ని కాస్తా లటుక్కున అందుకుని తూనీగలా పరుగు ప్రారంభించాడు.

జరిగిందేమిటో గ్రహించిన గౌతమ్- ''దొంగ... దొంగ'' అనరవబోయాడుగాని- వ్రతం సంగతి గుర్తొచ్చి నోరు మూసేసుకున్నాడు. ఆ కుర్రవెధవ కళ్లముందే కనుమరుగైపోతుంటే వెర్రివాజమ్మలా పాపం అలా చూస్తూ నించుండిపోయాడు.

ఆ పర్సులో వున్నది అయిదో పదో కాదు. అక్షరాలా అయిదువందలు. పైగా మరికాస్త చిల్లర .

ప్రేమకోసం పలుకునే త్యజించినవాడికి పైకం ఒకలెక్కా? అంటే కాకపోవచ్చుగాని, మొత్తానికి నష్టం నష్టమేకదా!?

ఇలా చెప్పుకుంటూపోతే ఇంకా ఎన్నెన్నో వున్నాయ్ గౌతమ్ ఈ వారంరోజుల్లో అనుభవించిన బాధలు.

★ ★ ★

సుబ్బారావ్ రాసిన ఉత్తరాన్ని చూసి నిప్పు తొక్కిన కోతిలా చిందులేశాడు జోగారావ్. ''ఒసేవ్... చూశావా... చూశావా నీ కొడుకుగారి నిర్వాకం?'' భార్యను పిలిచి చేతిలోని ఉత్తరాన్ని ఆమె ముఖంపైకి విసిరికొట్టాడు ఒకపక్క పళ్లు నూరుతూ.

''ఏం జరిగిందండీ?'' కంగారుపడింది రామసీత.

సుబ్బారావ్ టూకీగా కాకుండా విషయమంతా పూసగుచ్చినట్టే రాశాడు ఉత్తరంలో.

ఒక్క అక్షరమైనా పొల్లుపోకుండా ఆ ఉత్తరంలోని సంగతులన్నీ భార్యకు బోధపరిచాడు జోగారావ్.

రామసీత నిర్ఘాంతపోయింది.

కొడుకు ఆకతాయి అంటే ఆమె ఒప్పుకుంటుందేగాని, మరీ బొత్తిగా ఇలా ప్రేమించడాలూ, అందుకోసం నోరు కుట్టేసుకోవడాలూ చేస్తున్నాడంటే నమ్మలేకపోయింది.

కాకిపిల్ల కాకికి ముద్దు.

ఏ తల్లికైనా ఆమె తనయుడు బంగారుకొండే!

''ఇదంతా వాడి పుర్రెనపుట్టిన బుద్ధి అయ్యుండదండీ పాపం! ఆ అనహ్యా వాడికేదో మందుపెట్టి అలా ఆడిస్తూండుంటుంది'' అప్రయత్నంగా కొడుకును వెనకేసుకొచ్చిందామె.

''అనహ్యా కాదు... అనూహ్యా'' కరెక్ట్ చేశాడు జోగారావ్.

''ఎవతో ఒకతి. మొత్తానికి ఆ టక్కులాడే...''

''ఆ అమ్మాయి టక్కులాడో లేక నీ సుపుత్రుడే తిక్కలోడో, ఇక్కడుండి ఊహాగానాలు చేస్తే ఏం తెలుస్తుంది మనకి! అసలు మొన్నా రాస్కెల్ ఆ శివరామకృష్ణయ్య కూతుర్ని నచ్చలేదన్నప్పుడే కళ్ళు తెరిచుండాల్సింది మనం. పిల్లికి ఎలక సాక్ష్యం అన్నట్లు ఆ సుబ్బిగాడొకడు ఏవేవో మాయమాటలు చెప్పి మభ్యపెట్టేశాడు ఆరోజు. సర్లే సర్లే... బట్టలూ గట్రా సర్దు. వెంటనే వెళ్ళి సంగతేంటో తేల్చుకొందాం'' భార్య మాట పూర్తికాకముందే అందుకుని హడావుడి చేసేశాడు జోగారావ్.

''మధ్యలో ఆ సుబ్బారావ్ననుకోవడం దేనికిలెండి! అతనే గనక మరోలాంటి మనిషైతే ఇప్పుడీ విషయం మనకి రాసేవాడే కాదుగా?'' ఏదో ఒకటి మాట్లాడాలి కాబట్టి మాట్లాడినట్టుగా అనేసి అక్కడినుంచి లోనికి వెళ్ళిపోయింది రామసీత. అంటే ఇంకా అక్కడుండటం





ఇష్టంలేక అని కాదు. నిజంగానే బట్టలు సర్దడానికి వెళ్ళిందామె.

భర్త సంగతి ఆమెకి బాగా తెలుసు. ఆయన ప్రయాణం అన్నాడంటే ప్రయాణమే! - లేడికి లేచిందే పరుగు బాపతు మనిషాయన!

★ ★ ★

చెప్పా చెయ్యకుండా అకస్మాత్తుగా ఊడిపడ్డ అమ్మానాన్నల్ని చూసి బిక్కచచ్చిపోయాడు గౌతమ్.

'బాగున్నారా?' అని పలకరించడానికి లేదు. 'ఎప్పుడొచ్చారు?' అని అడగడానికి లేదు. మౌనవ్రతం! మౌనవ్రతం ఒకటే డ్పిందిగా మరి!

అంచేత నవ్వీ నవ్వనట్టుగా నవ్వి వూరుకున్నాడు వాళ్లను చూడగానే. అదైనా చాలా కష్టంమీద.

"ఏరా బాగున్నావా?" లోపలికి ప్రవేశిస్తూ ఆప్యాయంగా అడిగింది రామసీత ఎంతైనా తల్లిప్రాణమాయె!

"బాగానే వున్నానమ్మా!" అన్నట్టు నిలువుగా తలాడించాడు గౌతమ్.

జోగారావ్ అతనికేసి ఎగాదిగా చూస్తూ అడిగాడు - "ఈ టైంలో ఇంట్లో వున్నావేంటి? ఏం ఇవ్వాళ ఆఫీసుకు వెళ్ళలేదూ?"

లేదన్నట్టు అడ్డంగా తలాడించాడు గౌతమ్.

"ఎందుకని?" తెలిసుండే ప్రశ్నించాడు జోగారావ్. గౌతమ్ సిక్ లీవ్ పెట్టి ఇంట్లోనే అఘోరిస్తున్న సంగతి సుబ్బారావ్ రాసిన ఉత్తరంలో లేకపోతేకదా?

"ఏరా ఒంట్లోగాని బాగుండలేదా?" అసలు సంగతి రామసీతకి తెలిసిందే అయినా మన సూరుకోక ఆదుర్దాగా అడిగిందామె.

'మరే' అన్నట్టు నిలువుగా తలాడించాడు గౌతమ్.

చిర్రెత్తుకొచ్చింది జోగారావ్‌కి. రాదామరి? అన్నిటికీ తల వూపులే సమాధానంగా లభిస్తూండటం బట్టి సుబ్బారావ్ రాసిందంతా అక్షరసత్యమని అప్పటికే కన్‌ఫర్మ్ చేసేసుకోగలిగాడు ఆయన. "అలాగా నాయనా? ఏం - ఏరోగమొచ్చిందీ?" అన్నాడు వ్యంగ్యంగా.

ఆ వ్యంగ్యం గౌతమ్‌లో సందేహాన్ని రేపింది. ఇదేంటి ఇలా అడుగుతున్నాడీయన? వంట్లో బాగోలేదంటే ఆందోళన చెందాల్సింది పోయి వ్యంగ్యం ఒలికిస్తున్నాడూ అంటే...?

కొంపదీసి సుబ్బిగాడు గాని రాసేశాడా?

సందేహం ఏముంది? - రాసేసేవుంటాడు గాడిద!

అలా అనుకోగానే గుండె జారి అరిచేతిలో పడ్డట్లయింది గౌతమ్‌కి.

'మిత్రద్రోహీ!' అనుకున్నాడు సుబ్బారావ్‌ను ద్దేశించి కసిగా మనసులో.

కింకర్తవ్యం?!

ఏం చేయాలో పాలుపోక ఆలోచనలో పడ్డాడు పాపం!

అంతలో ఖంగున మ్రోగింది జోగారావ్ కంఠం. "ఏరా మాట్లాడవేం?"

"... ... ..."

"నిన్నే అడుగుతూంట. ఏం నోరుగాని పడిపోయిందా ఏంటి?"

కంగారుపడిపోయిన గౌతమ్ 'అవును నాన్నా' అన్నట్టు నిలువుగా తలాడించేశాడు.

జోగారావ్‌కి ఇంక కోపం ఆగలేదు.

"సోమ్మయ్ బడుద్దాయ్ వెధవా! నోరు పడిపోవడం కాదురా, నీకు బుర్ర చెడిపోయింది. నీ నిర్వాకం అంతా సుబ్బారావ్ నాకు వివరంగా రాశాడు. ఎవతిరా అది? అదెవత్తె కోసమో నువ్ నోరు కుట్టేసుకోవడం ఏంట్రా బుర్రతక్కువ వెధవా?" కోపాన్ని చేతిలోని సూట్‌కేస్‌మీద చూపెడుతూ దాన్ని దభీమని నేల మీద కుదేసి హూంకరిస్తూ అడిగాడాయన.

"సంగతేంటో తెలుసుకోకుండా ఎందుకు వాడిమీద అలా విరుచుకుపడతారు?" అంది రామసీత ఒకింత బాధగా. ఆమెకు లోలోన ఏమూలనో ఒకింత ఆశగా వుంది, ఒకవేళ సుబ్బారావ్ రాసిందంతా అబద్ధమేనేమో అని.

"ఇంకా ఏంటే తెలియాల్సింది, ఒకపక్క ఇంత స్పష్టంగా కనిపిస్తూంటేనూ?" భార్యను కసిరి పుత్రరత్నంమీద మళ్ళీ ధ్వజమెత్తాడు జోగారావ్.

"నీకు తలకాయలో మెదడుందా లేక

మట్టుందా ఏంటీ పిచ్చితుగ్లక్ పని? ఎవడు చెప్పేడ్రా నీకిదంతా? ఆఫ్టరాల్ ఒక ఆడదాని కోసం భగవంతుడిచ్చిన నాలుకను కోసేనుకుంటారట్రా ఎవరైనా?''

గౌతమ్ పెదవులు తడుపుకోవడానికి నాలుకని బైటికి చాపి అటూ ఇటూ ఆడించాడు.

అసలే కోపంలో వున్న జోగారావ్ ఆ నాలుకూవడాన్ని మరోలా అర్థం చేసుకున్నాడు.

"నాలుక కోసేనుకోలేదని చూపెడుతున్నావా పైగా? సంతోషించాంలే బోడి తెలివితేటలకి! నాలుక కోసేనుకోవడం అంటే నిజంగా కోసేనుకోవడం అని కాదు. బుర్రా బుద్ధీ లేకుండా ఇలా మౌనదీక్ష పూనడం!''

గౌతమ్ మూగహృదయం మూగగా రోదించింది తండ్రి అలా రెచ్చిపోయి మాట్లాడుతుంటే.

కానీ చేయగలిగింది ఏముంది?

"అను నాన్నా అను! నేను మౌనదీక్షలో వున్నాను కాబట్టి సరిపోయింది. లేకపోతే నా ప్రియమైన అనూని ఆఫ్టరాల్ ఆడదీ, అదీ ఇదీ అన్నందుకు నీకెలా బుద్ధిచెప్పాలో అలాగే చెప్పుండే వాడ్ని'' అనుకున్నాడు ఆవేదనగా.

ఆ పరిస్థితిలో వేరే పరిష్కారమార్గం



అంటూ ఏదీ లేకపోవడంచేత కలాన్నీ కాగితా న్నీ ఆశ్రయించక తప్పలేదు గౌతమ్‌కి.

"సుబ్బారావ్ అంతా రాశాడంటున్నారుగా? అది అంతా నిజమే! దయచేసి నా మౌనదీక్షకి భంగం కలిగించబాకండి! అనూహ్యకోసం జీవి తాంతం ఇలా మూగవాడిగా వుండిపోవడానికి కూడా నేను సిద్ధమే! మీరు నన్ను రక్షించదలు చుకుంటే ఎలాగోలా అనూహ్యతో నా పెళ్ళి జరిగేలా చూడండి! ఇట్లు- మీ పుత్రుడు, గౌతమ్"

-కాగితాన్ని తండ్రిచేతిలో కుక్కిన గౌతమ్ మరొక్క క్షణం కూడా అక్కడుండటానికి ముఖం చెల్లక చకచకా బైటికి వెళ్ళిపోయాడు.

★ ★ ★

ఆ సాయంత్రం సుబ్బారావ్ ఆఫీసునుండి రాగానే జోగారావ్ దంపతులు అతని సమ క్షంలో ఎవరినెత్తి వారు బాదుకున్నారు.

"నిన్ను నమ్మి కుర్రాణ్ణి నీవెంట పంపిస్తే వ్యవహారం ఇంత ముదిరిపోయేదాకా ఎలా వూరుకున్నావయ్యా?" అంటూ నిందించాడు జోగారావ్.

"ఆ మాయలాడెవతోగాని దాన్నిలా లాక్కురా నాయనా! వాడి బాధని చూడలేకపో తున్నాను. ఏం చేస్తాం? ఆ మహాతల్లి చేతులో కాళ్ళో పుచ్చుకుని నేనైనా బ్రతిమాలుకుంటా ను" అంది రామసీత గుడ్లనీరు కుక్కు కుంటూ.

శ్లేష్మంలో పడ్డ ఈగ చందమైంది సుబ్బా రావ్ పరిస్థితి.

ఆ దంపతులు అలా మాట్లాడ్డం సబబేనని అతనికి అనిపించింది. 'నిజమే మరి, వాళ్ళ బాధ వాళ్ళది' అనుకున్నాడు జాలిగా.

జరిగిన అనర్థంలో తనపాలూ ప్రమేయమూ ఎంతో కొంత ఉండడమైతే వున్నాయి కాబట్టి ఆ సమయంలో తల దించుకోవాల్సి రావడం తప్పనిసరే అయ్యింది అతనికి.

ఉద్రేకాలూ అవీ ఒకింత సద్దుమణిగాక... నిష్ఠూరాలూ గట్రా ఒకింత నెమ్మదించాక...

"సరే జరిగిందేదో జరిగిపోయింది. ప్రజంట్ సిట్యుయేషన్‌లో మనం చేయాల్సిందేమిటో అది ఆలోచించుకుందాం ముందు" అంటూ ప్రతిపాదించాడు సుబ్బారావ్.

ఆ సమయంలో గౌతమ్ అక్కడ లేడు. అసలా మధ్యాహ్నం తండ్రి చేతిలో ఆ కాగితా న్ని కుక్కి బైటికి వెళ్ళిపోయిన దరిమిలా అత నింకా ఇంటికి తిరిగిరానేలేదు.

"ఈ వ్యవహారం గురించి మాకన్నా నీకే బాగా తెలుసు. కాబట్టి నువ్వే చెప్పు ఏం చేస్తే బాగుంటుందో" భారం మళ్ళీ సుబ్బారావ్‌మీదే మోపాడు జోగారావ్.

"అవున్నాయనా! నువ్వే ఏదో ఒకటాలో చించు" అంటూ భర్తకు వంతపాడింది రామ సీత.

"ఆ అనూహ్యా వాళ్ళది మన ఎదురిల్లే. మనం వెళ్ళి వాళ్ళ అన్నయ్యగారితో మాట్లాడితే బాగుంటుందేమో?" నీళ్ళు నములుతూ అన్నాడు సుబ్బారావ్.

"ఏమని?" అడిగాడు జోగారావ్.

"మీరు మరోలా అనుకోబాకండి..."

"అనుకోంలే చెప్పు నాయనా!" సుబ్బారావ్ ఇంకా నీళ్ళు నముల్తుంటే అభయం ఇస్తున్న దానికిమల్లే అంది రామసీత.

దాంతో ధైర్యాన్ని పుంజుకుని తన ఉద్దేశాన్ని బయటపెట్టాడు సుబ్బారావ్.

"మరేం లేదండీ! గౌతమ్ ఆ అమ్మాయి విషయంలో చాలా పట్టుదలగా వున్నాడు. ఎలాగైనాసరే ఆ అమ్మాయిని పెళ్ళి చేసుకోవాల నుకుంటున్నాడు. వాడామెని ఎంత డీప్‌గా లవ్ చేస్తున్నాడో వాడి మౌనదీక్షే చెబుతోంది కదా? కాబట్టి మీరు పెద్ద మనసు చేస్కుని ఆ అనూహ్యవాళ్ళ పెద్దలతో మాట్లాడి మనవాడికి ఆ సంబంధాన్ని గనక ఖాయం చేయగలిగితే ప్రాబ్లెం సాల్వ్ అయిపోతుంది. మీరు వెళ్ళి అడిగితే వాళ్ళు కాదంటారని నేను అనుకోవట్లే దు. కానీ వాళ్ళది మీ కులం కాదు. కాబట్టి ఈ విషయంలో మీరు కాస్త కాంప్రమైజ్ కావాల్సి వుంటుంది మరి! వెనుకటిరోజులు కావు. ఇవ్వా ళ్ళ రేపూ కులాంతర వివాహాల్ని గురించి గొప్పగా చెప్పుకుంటున్నారే తప్ప ఎవ్వరూ ఆక్షే పించడంలేదు. అందువల్ల ఆ విషయంలో కూడా మీరు పెద్దగా వర్రీ కావాల్సిన అవసరం లేదనుకుంటాను"





చెప్పడం ముగించి ఎటో చూస్తూండిపోయా డు సుబ్బారావ్. పెద్దవాళ్ళతో వ్యవహారంకదా! అతని గుండె వేగంగా కొట్టుకోసాగింది.

అయితే అతను భయపడినంత ఉపద్రవం ఏమీ ముంచుకురాలేదు. "అయితే వాళ్ళది మనకులం కాదన్నమాట!" అని ఏదో మాటవ రసకి అన్నట్టుగా అన్నారే తప్ప, ఆ దంపతుల్లో ఏ ఒక్కరూ దాన్ని పెద్ద సీరియస్ విషయంగా పరిగణించి రాద్ధాంతం చేయలేదు.

మారుతున్న కాలంతో మనుషులూ మారు తున్నారనిపించింది సుబ్బారావ్‌కి.

మొత్తానికి ఓ అరగంటసేపు తర్జనభర్జనలు పడ్డాక "సరే అలాగే చేద్దాం! రేపే వెళ్ళి వాళ్ళ అన్నయ్యతో మాట్లాడదాం" అంటూ గ్రీన్ సిగ్నల్ ఇచ్చేశాడు జోగారావ్, సుబ్బారావ్ ప్రతి పాదనకి.

"గౌతమ్‌గా... యు ఆర్ ఎ లక్కీ బాయ్!" అనుకున్నాడు సుబ్బారావ్ మనసులో ఆనందంగా.

మరో అరగంట తర్వాత గౌతమ్ భయపడు తూ భయపడుతూ పిల్లిలా ఇంట్లోకి రాగా అతన్ని మళ్ళీ బైటికి లాక్కుపోయి సుబ్బారావ్ అతని చెవిలో ఆ శుభవార్త వేశాడు. అంటే తన ప్రతిపాదన, దానికి జోగారావ్ దంపతులు గ్రీన్ సిగ్నల్ ఇవ్వడం, వగైరా వగైరా వివరంగా చెప్పాడన్నమాట.

గౌతమ్ చంకలు గుద్దుకుంటాడనుకున్నా డు సుబ్బారావ్.

మరంతే కదా?

కానీ తద్విరుద్ధంగా ప్రవర్తించాడు గౌతమ్.

అసహనంగా నుదురు చిట్లించాడు.

అదోలా ముఖం పెట్టాడు.

అందుక్కారణం-

'మీరు నన్ను రక్షించదలుచుకుంటే ఎలా గోలా అనూహ్యతో నా పెళ్ళి జరిగేలా చూడండి' అని అతనంతకుముందు తండ్రికి రాసిన చీటీలో ఏదో మాటవరసకి రాసేడే తప్ప నిజాని కి అతనికి ఈ విషయంలో పెద్దల ప్రమేయం అంతగా ఇష్టంలేదు. ప్రేయసి మనసుని తనంతట తానుగా గెల్చుకోవడంలో వుండే ఆనందం పెద్దలు జోక్యం చేసుకుని పెళ్ళి జరిపించేస్తే వుండదుకదా? అదియునూ గాక అప్పుడది అరేంజ్డ్ మ్యారేజ్ అవుతుందే తప్ప ప్రేమవివాహం అవ్వదుకదా?

సైగలద్వారా ఈ భావాలన్నిటినీ వ్యక్తం చే యడం సాధ్యం కాదు కాబట్టి అదోలా ముఖం పెట్టిన తర్వాత అలాగా అన్నట్టు తల పంకించి వూరుకుండిపోయాడు గౌతమ్.

సుబ్బారావ్‌కి సహజంగానే ఆశ్చర్యంగా అని పించింది.

"ఏంటబ్బా వీడు ఎగిరి గంతేయడం లేదు? మౌనదీక్షవల్ల అసలే చెడిపోయివున్న మతికాస్తా పూర్తిగా చెడిపోయిందా ఏంటి?" అనుకున్నాడు అయోమయంగా.



అనుకున్నట్టుగానే ఆ మర్నాడు జోగారావూ, సుబ్బారావూ కలిసి అనూహ్య అన్నగారితో మాట్లాడ్డానికెళ్ళారు.

వీళ్ళని చూసి ఒకింత ఆశ్చర్యపోయాడు రాజశేఖరం.

"రండ్రండి... ఏంటిలా వచ్చారు?" సుబ్బా రావుది రోజూ చూసే మొహమే కాబట్టి గుర్తుప ట్టి మర్యాదగానే లోనికాహ్వానించాడు.

"మీతో ఒక విషయం గురించి చాలా సీరియస్‌గా మాట్లాడాలి. వీలవుతుందా? ఐ మీన్ మీరు తీరుబాటుగానే వున్నారా, లేక ఏదైనా అర్జంటుపని...?" లోపలికెళ్ళి సోఫాలో కూర్చున్నాక అడిగాడు సుబ్బారావ్.

"ఖాళీగానే వున్నాను. ఫర్వాలేదు చె ప్పండి" అతిథులు కూర్చున్న సోఫాకెదురుగా వున్న మరో కుర్చీలో కూర్చుంటూ అన్నాడు

రాజశేఖరం.

"వీరు జోగారావుగారు. మా రూమ్మేట్ గౌతమ్ తెలుసుగా, వాళ్ళ ఫాదరు"

"నమస్తే!"

"ఈయన రాజశేఖరంగారు. అనూహ్యావాళ్ళ అన్నయ్య"

"మంచిది" రాజశేఖరానికి ప్రతినమస్కారం చేస్తూ అన్నాడు జోగారావ్.

రాజశేఖరం మనసులో ప్రశ్నార్థకం మెరిసింది.

తనని అనూహ్యా అన్నయ్యగా పరిచయం చేస్తున్నాడూ అంటే ఆ పెద్దాయనకి అనూహ్యా ఇంతకుముందే తెలుసా?!

ఆమాటే అడుగుదామనుకుంటుండగా సుబ్బారావ్ రంగంలోకిదిగి స్ట్రెయిట్ ఫార్వార్డ్‌గా చల్లకొచ్చి ముంతదాచే తతంగం ఏదీ లేకుండా గౌతమ్ ప్రేమాయణం గురించీ, అది మౌనదీక్షకు దారితీసిన పరిస్థితుల్ని గురించీ క్లుప్తంగానే అయినా వివరంగా చెప్పాడు రాజశేఖరానికి.

రాజశేఖరం స్వతహాగా నెమ్మదస్థుడు. సుబ్బారావ్ చెబుతున్నప్పుడు ఎదురు ప్రశ్నలేమీ వెయ్యకుండా అసాంతం శ్రద్ధగా ఆలకించి కూలంకషంగా ఆకళింపు చేసుకున్నాడు విషయాన్ని.

ఇటీజ్ వెరీ స్ట్రేంజ్ అండ్ పెక్యూలియర్! మా అనూహ్యా చిన్నపిల్లేంకాదు! తొందరపాటు మనిషి అంతకన్నా కాదు. మీ ముందే తనని పిల్చి అడుగుతాను. తనేం చెబుతుందో అది కూడా విని దాన్నిబట్టి ఎలా ప్రొసీడవ్వాలో ఆలోచించుకుందాం" ఏవంటారన్నట్టుగా ఇద్దరికేసి మార్చిమార్చి చూస్తూ అడిగాడు.

సరే అన్నట్టుగా తల వంకించాడు జోగారావ్.

"ఇట్సాల్‌రైట్!" ప్రసన్నంగా నవ్వుతూ అన్నాడు సుబ్బారావ్.

రాజశేఖరం లేచి లోపలికెళ్ళి ఓ మూడు నిముషాల్లో అనూహ్యాని వెంటబెట్టుకొచ్చాడు. దాన్నిబట్టి లోపలతను చెల్లెలితో రహస్యమంత నాలేమీ చెయ్యలేదని గ్రహించగలిగారు జోగారావూ, సుబ్బారావులు.

ఆ విషయాన్ని నిర్ధారణ చేస్తూ వీళ్ళ ముందే- "ఇలాగిలాగ జరిగిందట కదా, నిజమేనా, సుబ్బారావుగారు చెబుతున్నారు" అంటూ చెల్లెల్ని ప్రశ్నించాడు రాజశేఖరం.

అనూహ్యా బెదిరిపోలేదు. కంగారూ పడలేదు. అవునన్నట్టు తలాడించింది తాపీగా.

"చేసిందంతా చేసి జపాను బొమ్మలా ఎంత చక్కగా తలాడిస్తున్నావు తల్లీ!" కోపంతో మనసు రగిలిపోతుండగా లోలోన కసిగా అనుకున్నాడు జోగారావ్.

ఆమె ధైర్యానికి సుబ్బారావ్‌కి ఆశ్చర్యంవేసింది. అన్నగారి ముందు తొణుకూ బెణుకూ లేకుండా ఎంత ధైర్యంగా నిలబడిందీ పిల్ల? మొత్తానికి ఘటికురాలే!

ఓఅరనిముషంపాటు మౌనం రాజ్యమేలిందా గదిలో.

"అతనితో ఎందుకు పందెం కాశావలా? అసలతనిమీద నీ అభిప్రాయం ఏంటి?!" మౌనాన్ని భగ్నంచేస్తూ రాజశేఖరం సూటిగా అడిగాడు అనూహ్యాని.

"అతనిమీద నాకే కాదు, అతన్ని గురించి తెలిసిన ఏ ఒక్కరికీ మంచి అభిప్రాయం వుండదు" ఎవరేమనుకుంటే నాకేం అన్నంత ధీమాగా, కుండబ్రద్దలు కొట్టినట్టు చెప్పింది అనూహ్యా.

సుబ్బారావ్‌మాటెలా వున్నా జోగారావ్‌కి సహజంగానే మనస్తాపాన్ని కలిగించాయామె మాటలు. ఎంతైనా తండ్రి! ఏం తల్లీ వాడిలో ఏంచూశావని మరీ అంత పోరంబోకు కింద లెక్కగట్టి మాట్లాడుతున్నావని నిలదీసి అడగాలని కూడా అనిపించిందాయనకి. కానీ ఎలాగో నిగ్రహించుకున్నాడు.

ఆయన ముఖంలో రంగులు మారడాన్ని గుర్తించి చెల్లెలి దుడుకుతనానికి లోలోన నొచ్చుకున్నాడు రాజశేఖరం.

"మరతనిమీద సదభిప్రాయం లేనిదానివి అతన్తో అలా బెట్ కాయడం దేనికి?"

"నేనేం బెట్ కాయలేదు. ముందు అతనే అలా లెటర్ రాశాడు" నిర్భయంగానే చెప్పింది అనూహ్యా.





''మరి ఈ విషయం నాకు ఎందుకు చెప్పలేదు?''

''నీతో చెప్పి నీ కోపానికి అతన్ని గురిచెయ్యడం ఇష్టంలేక''

''అంటే వాడి మీద కొద్దోగొప్పో మీకు ఎఫెక్షన్‌లాంటిదేదో వున్నట్టే కదా?'' మధ్యలో తల దూరుస్తూ అన్నాడు సుబ్బారావు.

''యు హావ్ టోటల్లీ మిస్టేకెన్! ఎఫెక్షన్ కాదది- జాలి...'' స్థిరంగా పలికింది అనూహ్య.

''మరలాంటప్పుడు వాడి లెటర్ని చింపేసూరుకోకుండా సంవత్సరం వుండగలరా రెండు సంవత్సరాలుండగలరా అంటూ వాడ్ని రెచ్చగొట్టడం దేనికి?!''

సుబ్బారావు మాటల్లో 'సబబు' వుండటంవల్ల అతను తన చెల్లెల్ని అలా నిగ్గదీస్తున్నా అడ్డు పడలేకపోయాడు రాజశేఖరం.

జోగారావుకి ముళ్ళమీదున్నట్టనిపించింది. ఏంటో ఈ మాయదారి సంతనుకున్నాడు అసహనంగా.

అనూహ్య సుబ్బారావు వైపు పెడసరంగా చూసింది.

''అతను మీ ఫ్రెండు కదాని నెత్తిమీద పెట్టుకు మాట్లాడకండి. ప్రేమాగీమా అంటూ అతను నా చుట్టూ తిరుగుతుంటే పీడొదిలించుకోవడానికలా అన్నానంతే! నేనింకా మంచిదాన్ని కాబట్టి అతన్ని స్పేర్‌చేశాను. నా స్థానంలో కనక వేరే ఎవరైనా వుంటే వెంటనే ఆ ఉత్తరాన్ని తీస్కెళ్ళి మా మేనేజర్‌కిచ్చేసుండేవాళ్ళు! నేనూ అలాగే చేసుంటే అతని గతేమయ్యేదేది?''

''ఏమయ్యుండేది, మహా ఐతే ఉద్యోగం లోంచి పీకేసుండేవాడు మీ మేనేజరు. అంతే తప్ప ఇంత క్షోభ వుండేది కాదు గదా? చిత్తశుద్ధి లేకుండా మీరు కాసిన పందానికి పాపం ఆ అమాయకుడు నోరు కుట్టేసుకుని నానా అగచాట్లూ పడ్తున్నాడు. వాడి పీడ వదిలించుకోవడమే మీ ఉద్దేశమైతే దానికి బోలెడన్ని మార్గాలున్నాయి. అంతే తప్ప వాణ్ణిలా ఉచ్చులో బిగించి గిజగిజలాడిపోయేలా చేయడం ఎందుకు? ఇలా ఆడించడానికి వాడికన్నా వెర్రినాగన్న ఎవరూ దొరకలేదా మీకు?'' కోపం ఎగదన్నుకొస్తుండగా మనిషి రవంత కంపిస్తూ అడిగాడు సుబ్బారావు.

''అవునమ్మా అతనిమీద నీకు బొత్తిగా మంచి అభిప్రాయం లేనప్పుడు విషయాన్ని మొగ్గలోనే తుంచేసుండాల్సింది. ఈ న్యూసెన్సంతా దేనికి? ఒకవేళతను దృఢంగా పట్టుదలగా నిలబడి నీ పందెంలో గెలిచాడే అనుకో. అప్పుడు నీ పరిస్థితిఏంటి? ఇచ్చిన మాటకి కట్టుబడి ఇష్టంలేకపోయినా అతన్ని పెళ్ళిచేసుకోగలవా? లేదు కదా? మరలాంటప్పుడు ...'' సుబ్బారావు పక్షమే వహిస్తున్న ధోరణిలో రాజశేఖరం ఇంకా ఏదో చెప్పబోతుంటే మధ్యలో అడ్డుపడింది అనూహ్య.

''అతను నిజంగా గెలవాలేగాని అతన్ని ఇష్టపూర్తిగానే పెళ్ళిచేసుకుంటానన్నయ్యా. కానీ గెలవడు- నాకా నమ్మకం వుంది!''

''గౌతమ్ గెలుస్తాడు- నాకా నమ్మకం వుంది'' సుబ్బారావు రోషంగా అన్నాడు. ''ఇంతమంది ముందు ఒప్పుకున్నారు మీరు. తీరా వాడు గెలిచాక మళ్ళీ మాట తప్పకూడదు''

''తప్పను... దమ్ముంటే మీ ఫ్రెండ్‌ని గెలవమనండి చూద్దాం'' సవాలు చేసింది అనూహ్య.

అంతవరకూ తన పెద్దరికానికేమాత్రం విలువివ్వకుండా తన ముందే ఆ పిల్లకాకులలా ఇష్టానుసారం రొదచేస్తుంటే సహిస్తూ వచ్చిన జోగారావు ఇంకూరుకోలేకపోయాడు.

సహనానికైనా హద్దుంటుంది మరి.

''బాగుందమ్మా బాగుంది...నీ అర్థంపర్థంలేని పందెంలో వాడు గెలిస్తే అప్పుడు వాణ్ణి చేసుకోగలవుగాని, ఇప్పుడు మాత్రం ఏమీ చెప్పలేవన్నమాట! పెద్ద తరహాలో పెద్దల ప్రమేయంతో గౌరవప్రదంగా పెళ్ళి జరిపిస్తే అది నీకు నచ్చదన్నమాట'' అనూహ్యకేసి కొరకొరా చూస్తూ వెటకారంగా అన్నాడు.

అనూహ్య ఏదో అనబోతుంటే రాజశేఖరం కలగజేసుకున్నాడు- ''నరేనండీ! ఇంతకీ మీరనేదేంటి?''

''ఇంత జరిగేక అనేందుకు వేరే ఏముంది? గెలిస్తే చేసుకునే మాట నిజమే అయినప్పుడు తలాతోకా లేకుండా ఈ మౌనవ్రతాలూ ఇవన్నీ దేనికి?! మీ చెల్లెల్ని ఊఁ అనమను. నేను వెళ్ళి

మీ అమ్మానాన్నల్తో మాట్లాడ్తాను''

"అవును రాజశేఖరంగారూ... లెటజ్ సాల్వ్‌ది ప్రాబ్లమ్ ఇన్ ఎ పీస్‌ఫుల్ మానర్! మీ సిస్టర్ మనసు మార్చుకుంటే చాలు అంతా సవ్యంగా జరిగిపోతుంది'' జోగారావుకి సపోర్టింగ్‌గా అన్నాడు సుబ్బారావు. "అసలు దీన్ని గురించి మీరింతగా ఆలోచించాల్సిన అవసరమేలేదు. మా గౌతమ్‌గాడు అప్పుడప్పుడూ కాస్త ఆకతాయి పనులు చేస్తుంటాడన్నమాటే గాని, మిగతా అన్ని విషయాల్లోను బుద్ధిమంతుడే! పోతే ఆస్తిపాస్తుల గురించి మీకు మొదటే చెప్పాను''

రాజశేఖరానికి ఏం మాట్లాడాలో పాలుపోలేదు. విషయం చెప్పి, అన్నీ అనుకూలిస్తే మీతో సంబంధం కలుపుకోవడానికే వచ్చామంటూ సుబ్బారావు మొదట్లో గౌతమ్ వాళ్ల స్థితిగతుల్ని గురించి చెప్పినప్పుడే అనిపించిందతనికి ఇదేం తీసిపారేయదగ్గ సంబంధంకాదని. అందువల్ల ఇప్పుడు కూడా మనసు 'ఊ' అనడం వైపే మొగ్గుచూపసాగింది.

కానీ చెల్లెలు?

అన్నిటికన్నా ముఖ్యం ఆమె ఇష్టాఇష్టాలే కదా?

అందుకే ఆమెనే అడిగాడు- "విన్నావుగా అనూహ్యా! జోగారావుగారు పెద్దవారు. వార్ని ఎక్కువగా ఇబ్బంది పెట్టడం మంచిదికాదు. నీ ఉద్దేశం ఏంటో స్ట్రెయిట్‌గా చెప్పెసెయ్! మన అమ్మనాన్నల్తో మాట్లాడి ఈ సంబంధం ఖాయం చేసేట్లయితే అతన్ని చేసుకోవడం నీకిష్టమేనా?''

అనూహ్య ఒకటి రెండు క్షణాలు తటపటాయించి అడ్డంగా తలాడించింది.

"అతని స్వభావం మంచిది కాదు. అందర్నీ ఏడిపించి వినోదిస్తుంటాడు. మోరార్ లెస్ హి ఈజ్ ఎ శాడిస్ట్!''

"మరైతే పందెంలో గెలిస్తే అతన్ని చేసుకుంటానని ఎలా అంటున్నావు?''

"అది వేరు... తెలిసో తెలియకో అతన్ని రెచ్చగొట్టాను కాబట్టి అతను గెలిస్తే గనక నా మాట నిలుపుకుంటాను...''

'ఆడపిల్లకి మరీ ఇంత మొండిపట్టుదలా' అనిపించి సుబ్బారావుకి ఒళ్ళు మండిపోయింది.

"సరే...అదేమాటమీదుండండైతే'' కోపంగా అనేసి "వెళ్దాం లేవండి సార్'' అంటూ జోగారావుని కూడా లేవదీశాడు.

వాళ్ళు వెళ్ళిపోతుంటే రాజశేఖరం అచేతనంగా నిలబడిపోయాడు.

ఆ పరిస్థిలో అంతకన్నా ఏంచేయాలో అర్థంకాలేదతనికి.

అంతసేపూ ప్రక్కగదిలో వుండి ఇదంతా ఆలకించిన అతని భార్యక్కూడా అంతా అయోమయంగానే అనిపించింది.

ఆడపడుచు పోకడ వెర్రిపోకడగా కూడా అనిపించింది.

అనూహ్య అన్నావదినలతో ఏం మాట్లాడకుండా తల దించుకుని పెరట్లోకి వెళ్ళిపోయింది.

ఆమె మనసులో ఏముందో ఆమెకే తెలియాలి!

★ ★ ★

రాజశేఖరం ఇంట్లో తనకు జరిగిన దాన్ని పరాభవంగానే భావించిన జోగారావు "ఏమైందండీ?'' అంటూ రామసీత అడగ్గానే కొడుకుమీద ఒంటికాలితో లేచాడు.

"ఏమవుతుంది...ఈ త్రాష్టుడు చేసిన పనికి నేననవసరంగా అవమానాన్ని దిగమింగాల్సొచ్చింది. ఆ పిల్ల చూస్తే మీదపడి కుమ్మబోయే పోట్లగిత్తలా వుంది! మరి ఈ సన్నాసి మొహానికి ఆ పిల్లెలా నచ్చిందో ఏం పాడో! సిగ్గులేని వెధవ! సిగ్గులేని వెధవ!''

అక్కడే వున్న గౌతమ్- 'అనునాన్నా అను- అంతా నా ఖర్మ' అనుకున్నాడు బాధగా.

"అమ్మాయి బాగాలేదా?'' నుదురు చిట్లిస్తూ అడిగింది రామసీత- "కుందనపు బొమ్మలా వుంటుందని సుబ్బారావు కూడా అన్నాడుగా!? మరి పోట్లగిత్తలా వుందంటున్నారేంటి?''

"ఎర్రగా బుర్రగా వుండగానే సరా? గుణం మంచిది కావద్దూ!? ఎంత తలబిరుసు పిల్లో తెలుసా? ఛీఛీ! ఆడపిల్లలకి మరీ అంత తెంపరితనం పనికిరాదు. ఆ బోడిపందెంలో ఈ వాజమ్మ గెలిస్తేనే తప్ప వీణ్ణి చేసుకునే




ప్రసక్తేలేదని తెగేసి చెప్పింది మహాతల్లి!" వళ్ళు నూరుతూ చెప్పాడు జోగారావు.

అయ్యో నా మౌనదీక్ష నాసరాగా చేస్కుని ఎంతలేసి మాటలనేస్తున్నారు నన్నూ నా దేవినీ అనుకున్నాడు గౌతమ్ ఆవేదనగా.

"సుబ్బారావూ... ఈయన సరిగ్గా చెప్పరులే గాని, అక్కడేం జరిగిందో, ఏమేం మాట్లాడుకున్నారో కాస్త వివరంగా చెప్పు నాయనా!" సుబ్బారావ్‌నడిగింది రామసీత.

"చెప్పునాయనా డొప్పచెవుల్తో ఆలకిస్తుందీ విడగారు" కోపంగా అనేసి విసురుగా బైటికి నడిచాడు జోగారావు.

"మరీ అంత తెగేసినట్టు చెప్పిందా?" ఆఖర్న అడిగింది రామసీత.

"అవును..."

"నా దేవి మొత్తానికి భలే పట్టుదలగల మనిషి!" గర్వంగా అనుకున్నాడు గౌతమ్. అనుకోక ఏంచేస్తాడు రోజురోజుకీ ప్రేమపిచ్చి ముదిరిపోతుంటే.

"విన్నావుగా బాబూ... అలాంటి మొండి పిల్లతో నీకెందుకుచెప్పు? నా మాట విని ఈ వెధవదీక్షా అదీ మానేసెయ్! దానికన్నా వెయ్యిరెట్లు అందమైన పిల్లని వెదికి చేసే బాధ్యత నాది- సరేనా?" కొడుక్కి నచ్చజెప్పబోయింది రామసీత.

ఆ సంభాషణే ఇష్టంలేదన్నట్టుగా వినవిసా అక్కడినుంచి వెళ్ళిపోయాడు గౌతమ్.

"నువ్వయినా వాడికి నచ్చజెప్పు నాయనా!" గుడ్లనీరు కుక్కుకుంటూ నోరు కొట్టుకుంటూ అంది రామసీత సుబ్బారావుతో.

"లాభం లేదమ్మా... ఆ వెధవ మన చెయ్యి దాటిపోయాడు" అనేశాడు సుబ్బారావు నిస్సహాయంగా.

ఆ రాత్రి జోగారావూ, రామసీతా కొడుక్కి చెరోప్రక్కనా కూర్చుని చెవుల్లో కీచురాళ్ళ కన్నా ఎక్కువగా రొద చేశారు.

అనూహ్యని మర్చిపొమ్మనీ, మౌనదీక్ష మానెయ్యమనీ చెప్పడంలో ఎన్ని విధాలైతే వున్నాయో అన్నివిధాలుగానూ చెప్పిచూశారు.

కానీ ఫలితం లేకపోయింది. దాంతో చేయగలిగింది లేక ఆ మర్నాడే వాళ్ళిద్దరూ తిరుగు ప్రయాణమయ్యారు.

ఆ సరిస్థితి అలాంటిది.

* * *

రోజులు భారంగా గడిచిపోతున్నాయి.

అంటే అందరికీ అని కాదు, గౌతమ్‌కి.

మౌనవ్రతంవల్ల ప్రతిరోజూ ఎన్నెన్నో ఇబ్బందుల్ని ఎదుర్కోవాల్సి వస్తున్నా కూడా అతనిలోని పట్టుదల కొంచెం కూడా సడలక పోగా పైగా నానాటికీ గట్టిపడసాగింది.

ఎలాగైనా గెలవాలి. అనూహ్యని గెలుచుకోవాలి. నించున్నా కూచున్నా పడుకున్నా ఎక్కడైనా, ఏ సమయంలోనైనా అదే ధ్యాస, అదే దీక్ష.

తను... అనూహ్య... తన ప్రేమ- ఇవి మాత్రమే నిజాలు; మిగతాదంతా మిథ్య! అన్నట్టుగా తయారైంది అతని పరిస్థితి.

ఊరికెళ్లాక జోగారావ్ కొల్లేటి చాంతాడంత ఉత్తరం రాశాడు- గౌతమ్‌ని మనసు మార్చుకోమంటూ పలువిధాలుగా అభ్యర్థిస్తూ. సుబ్బారావ్ చెవిలో ఇల్లు గట్టుకుపోరడం ఎలాగూ వున్నదేనాయె.

అయితే అటు తండ్రి ఉత్తరంగానీ, ఇటు మిత్రుడి పోరుగానీ గౌతమ్‌లో ఏ కొంచెం కూడా కదలికను కలిగించలేదు.

ప్రేమ గురించి తెలియనివాళ్లు ఏవేవో చెబుతుంటారు. వాటన్నిట్నీ పట్టించుకుంటే ఎలా? అనుకున్నాడు చాలా తేలిగ్గా.

ఏతావాతా పరిస్థితి ఎంతవరకొచ్చిందంటే గౌతమ్ పెట్టిన సిక్‌లీవ్ అయిపోవడం, ఇంకా ఎక్స్‌టెండ్ చేద్దామంటే ప్రావిజన్ లేకపోవడం, స్పెషల్‌కేస్‌గా ట్రీట్ చేయమని అర్జీ పెట్టుకుంటే మేనేజర్ దానిమీద ఆడ్వర్స్ రిమార్క్స్ రాసి పైకి పంపించడం, తత్ఫలితంగా అతని ఉద్యోగం వూడిపోవడం వరసగా జరిగిపోయాయి.

అన్ని అనర్థాలు జరిగిపోతున్నా పక్కనే వుండి కూడా పాపం సుబ్బారావ్ ఏమీ చెయ్యలేకపోయాడు.

ఏం చెప్పినా తలకెక్కించుకుంటేకదా?





'ఇదీ పరిస్థితి, ఇలాగిలాగా జరుగుతోంది'అని అతను జోగారావుకుత్తరం రాయగా, 'వాడి ఇష్టానుసారం అఘోరించనివ్వు' అంటూ ఐదు లిచ్చాడాయన. అంత ప్రాణం విసిగిపో యిందాయనకి.

ప్రాణం విసిగిపోయినా ఒక్కగానొక్క కొడుకు ను కాదనుకోగలిగిన పరిస్థితి కాదాయె. అందు చేత గౌతమ్ ఖర్చులకోసం నెలనెలా ఠంచ నుగా డబ్బు మాత్రం పంపించసాగాడాయన.

నిజానికాయన డబ్బు పంపకపోయినా ఇక్కడ గౌతమ్‌కొచ్చిన ఇబ్బందేంలేదు. ప్రాణా నికి ప్రాణంలాంటి సుబ్బారావ్ అండగా వున్నా డు కాబట్టి, కాకపోతే తండ్రిగా ఆయన బాధ్యతా యన నిర్వర్తిస్తున్నాడంతే.

గౌతమ్‌కి భారంగా గడుస్తున్నంత మాత్రాన్న జరిగేకాలం జరక్కుండా ఆగిపోదు కదా?

కుట్టేసుకున్న గౌతమ్ నోరు కుట్టేసుకున్నట్టే వుంది. చూస్తుండగానే ఓ పదినెలలు గడిచిపో యాయి.

గౌతమ్ తన పందెం, లేదూ మౌనవ్రతంలో గెలవడానికి ఇంకా ఓ రెండు నెలలు మాత్రమే వ్యవధి వుంది.

ఇంతకాలం నెగ్గుకుంటూ వచ్చిన వాణ్ణి ఇంకా ఓ రెండునెలలు గడపలేకపోతానా అని గౌతమ్ ధీమా!

సుబ్బారావుక్కూడా అలాగే అనిపించింది.

వీడు గెలవడం ఖాయం.

కానీ తీరాచేసి ఆ అనూహ్యా ప్లేటు ఫిరా యించేస్తే?

ఈనగాచి నక్కలపాలైనట్టయిపోదూ?

అందుకని ఎందుకైనా మంచిదని అతని మధ్యకాలంలో నాలుగైదుసార్లు అనూహ్యని కలిసి హెచ్చరించాడు- "మావాడు విజయప థంలో ముందుకు దూసుకెళ్ళిపోతున్నాడు. తీరా గడువు ముగిశాక మీరు గనక హేండిచ్చే ట్టయితే బావుండదు సుమా" అంటూ.

"మీకంలాటి భయమేం అక్కర్లేదు. ముందతన్ని గెలవనివ్వండి" అంటూ అభయ మిచ్చింది అనూహ్యా.

ఆ విషయంలో ఆమె సిన్సియారిటీని శంకించాల్సిన పనిలేదు. ఎందుకంటే ఇప్పు డామె మునుపటి అనూహ్యా కాదు.

మొదట్లో అతని అంతా యితనాన్ని ఆమె అస హ్యించుకున్నమాట నిజమే. అయినా తన కోసం... తన ప్రేమకోసం... పదినెలలపాటు నోరు కుట్టేసుకున్న అతని దృఢచిత్తం మీద, సంకల్పబలం మీద ఇప్పుడామెకు చాలా సద భిప్రాయం ఏర్పడిపోయింది. గౌతమ్ పడుతు న్న అవస్థలకి వివిధ సందర్భాలలో అతనిమీద జాలి కూడా వేసింది.

అలాగని ఆమె కూడా మనసు మార్చుకుని అతన్ని ప్రేమించసాగిందా అంటే కాదు.

కాకపోతే మనసు బాగా మెత్తబడిందంతే.

స్వతహాగా ఆమెది ఓటమిని అంగీకరించగ లిగే మనస్తత్వం కాదు. ఎలాగైనాసరే గౌతమ్ ఓడిపోతే బాగుండునని ఆమెకిప్పటికీ చాలా బలీయమైన కోరికే వుంది.

చూస్తుండగానే మరి కొన్ని రోజులు ముందుకు వెళ్లిపోయాయి.

వ్యవధి పదిరోజుల్లో కొచ్చేసింది.

జస్ట్ టెన్ డేస్. అంతే!

గౌతమ్ మనసులో చెలరేగిపోతున్న ఉత్సా హానికి ఓ అంతూపొంతూ లేదు.

అమ్మయ్య... ఇంకో పదిరోజులు ఓపికపడితే ఇంచక్కా నోరుతెరిచి అన్నీ మాట్లాడేసెయ్యొ చ్చు తను... మాటల్లేమందిలేగాని... అనూ హ్యా... తన అనూహ్యా... ప్రియాతిప్రియమైన తన అనూహ్యా... తనదైపోయింది పదిరోజుల తర్వాత.

ఎంత కష్టపడి గెలుచుకుంటున్నాడామెని?

ఇంకా వ్యవధి వుంది కాబట్టిగాని లేకపోతే గళంవిప్పి జగం అదిరిపోయేలా పిచ్చి పిచ్చి పాటలన్నీ పాడేసుకోవాలన్నంత ఆనందంగా అనిపించసాగిందతనికి.

ఆ ఆనందానికి ఆనకట్ట పడేరోజు అతిచేరు వలోనే ఉందని అతనికేం తెలుసు పాపం?

★ ★ ★

ఆరోజు...

గౌతమ్ పాలిట నిజంగా అది చాలా దు ర్దినం.

అప్పటికి వ్యవధి ఇంకా ఆర్రోజులు

మాత్రమే వుంది.

తన విజయం దాదాపు ఖాయమే అని తెలిసిపోవడంవల్ల... తెలిసిపోవడం కాదు, అనిపించడంవల్ల... వీర ఉత్సాహంతో వున్న గౌతమ్, అనూహ్య ఇంటినుండి ఆఫీసుకు బయలుదేరగా ఆమెను వెన్నంటి వెళ్లసాగాడు.

అదతనికిది కొత్తేం కాదు. ఇంచుమించు సంవత్సరంనుంచి రోజూ చేస్తున్న పనే!

అవును... ప్రతిరోజూ ఆమె ఆఫీసుకెళ్లేటప్పుడు ఇంటినుండి బస్టాప్‌దాకా వెనకాలే వెళ్లి మౌనంగా వీడ్కోలు పలకడం అతని దినచర్యల్లో ఒకటి.

రోజూ వుండే తతంగమే కాబట్టి వెనకాలే వస్తున్న గౌతమ్‌నేమాత్రం పట్టించుకోకుండా రోడ్డుమీద వడివడిగా నడుస్తోందనూహ్య...

ఆమె... ఆమె వెనుక గౌతమ్.

బస్టాప్‌ని సమీపించారు.

ఎందుకోగాని బస్టాప్‌లో జనం పల్చగా వున్నారు. బహుశా అంతకుముందే వరసగా ఏ నాలుగైదు బస్సులో వచ్చి వెళ్లిపోయి వుండొచ్చు.

బస్టాప్‌లో షెల్టర్‌కింద ఓ ఇద్దరు యువకులు. ఇద్దరివీ లేతముఖాలే. ఇద్దరిలో ఏ ఒక్కరికీ ఇరవైఏళ్లకు మించి వుండడానికి ఆస్కారమే లేదు. ఎందుకంటే ఇద్దర్లో ఏ ఒక్కరికీ ఇంకా మీసమైనా చిక్కబడలేదు. అయితే అవతారాలు మాత్రం... అంటే వస్త్రధారణా గట్రా... చూడ్డానికి జులాయిల్లా వున్నారు.

అనూహ్య వెళ్ళి వాళ్లకి ఒకింత ఎడంగా నిలబడింది.

అనూహ్య పక్కన మరో అమ్మాయెవరో వచ్చి నిలబడ్డంతో అక్కడ చోటులేక గౌతమ్ ఆ కుర్రాళ్లిద్దరికీ ఇవతలివైపు నిలబడ్డాడు.

ఆ కుర్రాళ్లలో ఒకింత లావుగా వున్నవాడు కాస్త బక్కపల్చగా వున్నవాడితో అంటున్నాడు-

"ఎవతిరా ఇది, రోజూ ఈ మూగవాణ్ణి బాడీగార్డులా వెంటబెట్టుకొచ్చుద్దీ?"

"ఏమోరా ఆ బ్యాగూ అదీ చూస్తుంటే మొత్తానికి వర్కింగ్‌గాళ్‌లా వుంది..."- బక్కపల్చటివాడి జవాబు.

"అది సరే...ఈ నోరులేని వెధవెవడు? వీడామెలవ్వరా?"

"లవ్వరా పాడా? నక్కకీ నాగలోకానికీ లింకేట్రా నీ బొంద. అంత అందగత్తె చూస్తూ చూస్తూ ఈ ఏబ్రాసి మొహాన్నెందుకు ప్రేమించుద్ది?" వెకిలిగా నవ్వుతూ అన్నాడు బక్కపల్చటివాడు.

వాళ్లు కాస్త నెమ్మదిగానే మాట్లాడుకుంటున్నా ఆ మాటలన్నీ గౌతమ్‌కి స్పష్టంగానే వినిపిస్తున్నాయి.

'ఛీఛీ... సంస్కారం లేని వెధవలు.' అనుకున్నాడు మనసులో ఏవగింపుగా.

వాళ్ళు తనని ఏబ్రాసిమొహం అన్నందుక్కాదుగానీ, అనూహ్యని అదీ ఇదీ అంటూ నీచంగా మాట్లాడుకున్నందుకు... వాళ్లిద్దర్నీ పీకలు పిసికి చంపెయ్యాలన్నంత ఆగ్రహం వచ్చిందతనికి.

కానీ ఎలాగో నిగ్రహించుకున్నాడు.

'చూడబోతే చదువుకున్నవాళ్లలాగే వున్నారు, ఇంత నీచంగా ఎలా మాట్లాడగలుగుతున్నారో?' అనుకుంటూ... వద్దనుకుంటూనే చెవులు రిక్కించాడు.

బక్కపల్చటివాడు ఇకిలిస్తూ అంటున్నాడు...

"నాకు వర్కింగ్‌గాళ్స్ మీద మంచి అభిప్రాయంలేదు గురూ. సంపాదనకోసం ఉద్యోగం చేసే ఆడాళ్లు ఎంతకైనా తెగిస్తారు. దాని మొహం దానికి ప్రేమేంటి? ఎవడు నాలుగు డబ్బులిస్తే వాడే ప్రియుడు..."

కారుకూత కూసింది చాలక ఏదో పెద్ద జోక్ వేసినవాడిలా బక్కపల్చటివాడు విరగబడి నవ్వుతుంటే గౌతమ్ సహించలేకపోయాడు.

తన ఫియాన్సీ గురించి అలా హేయంగా మాట్లాడుతుంటే దమ్మున్న ఏ మగవాడు మాత్రం సహించగలుగుతాడు?

గౌతమ్ కూడా టాలరేట్ చెయ్యలేకపోయాడు.

"స్కౌండ్రల్... ఏం కూశావురా?" అంటూ... అనటం కాదు భీకరంగా అరుస్తూ బక్కవాడిమీదకు దూకి ఠక్కున వాడి కాలర్ పుచ్చుకున్నాడు.

"వదులు... నువ్వెవడివిరా...? ఎవని గురించో మేం ఏదో అనుకుంటే నీకెందుకురా?" గౌతమ్ చేతిని విదిలిస్తూ అరిచాడు బక్కకుర్రాడు.

"నోర్ముయ్ ఇడియట్. ఆమె ఎవరనుకుంటున్నావ్‌రా...?" ఆవేశంతో ఊగిపోతూ కొట్టడానికి చెయ్యి పైకి లేపాడు గౌతమ్.

అనూహ్య మొదట్నుంచీ అదంతా గమనిస్తూనే వుంది ఓ కంట.

గౌతమ్ చెయ్యి లేవగానే లావుకుర్రాడు ఆ చేతిని ఒడిసి పట్టుకున్నాడు... "ఏంటిబే? మా దోస్త్‌మీద చెయ్యి లేపుతున్నావ్?" అంటూ.

"చెయ్యి లేపటంకాదు... నాలుక చీరేస్తాను వెధవని..." లావుకుర్రాణ్ణి విదిలించి కొడ్తూ రౌద్రంగా అరిచాడు గౌతమ్.

అంతలో ఊహించని విధంగా చటుక్కున వాళ్ళిద్దరి మధ్యకి వచ్చి నిలబడింది అనూహ్య.

"ఏంటి గౌతమ్‌గారూ? ఏంటీ గొడవ?" అంది ఆందోళనగా చూస్తూ.

"ఆ వెధవ మీ గురించి చాలా అసభ్యంగా మాట్లాడుతున్నాడనూహ్యగారూ..." రొప్పుతూ గౌతమ్ ఇంకా ఏదో చెప్పబోతుంటే

"ఏయ్ మిస్టర్... వెధవలూ గిదవలూ అన్నావంటే మర్యాదగా వుండదు. మేం ఆవిడ గురించేం మాట్లాడుకోవటంలేదు. మా సొంత విషయాలు మాట్లాడుకుంటున్నాం..." బుకాయింపుగా అంటూ గౌతమ్ మీదికి రాబోయాడు లావుకుర్రాడు.

వుండడానికి వీళ్లేగాక ఆ బస్టాప్‌లో ఇంకా చాలామందే వున్నా ఎందుకొచ్చిన గొడవ లెమ్మని చోద్యం చూస్తూ నిలబడ్డారే తప్ప ఎవ్వరూ జోక్యం చేసుకోలేదు.

"డోంట్ బ్లఫ్..." అరిచాడు గౌతమ్.

"ప్లీజ్ బీ క్వయిట్ గౌతమ్‌గారూ..." అతన్ని వెనక్కి గుంజుతూ అంది అనూహ్య. అనవసరంగా ఎందుకొచ్చిన గొడవలివి?"

"అదేంటనూహ్యగారూ అలా అంటారు? వాళ్లు మీ గురించి..." రొప్పు ఇంకా తగ్గకపోవటంవల్ల మాట పూర్తి చెయ్యలేకపోయాడు గౌతమ్.

"నా గురించి కాదంటున్నారుగా? ప్లీజ్... ఊరుకోండి... మీరు మరొక్కమాటగాని మాట్లాడారంటే నామీద ఒట్టే" అతని చేతిని లాగి తలమీద పెట్టుకుంటూ అంది అనూహ్య.

అంతే...

మంత్రించబడిన నాగుపాములా చప్పున అణగారిపోయాడు గౌతమ్.

ఆ అవకాశాన్నామె సద్వినియోగం చేసుకుంది. "అలా నడుస్తూ మాట్లాడుకుందాం, మీరు నాతో రండి..." అంటూ అక్కడున్న వేరెవ్వర్నీ పట్టించుకోకుండా గబగబా అతన్ని అవతలికి లాక్కెళ్ళిపోయింది.

బస్టాప్‌ని దాటి ఆరేడు అడుగులు వేశాక ఇంకా తగ్గని ఆవేశంతో అన్నాడు గౌతమ్- "మీరు అడ్డుపడబట్టే ఊరుకున్నానుగాని, లేకపోతే ఆ రాస్కెల్‌ని పచ్చడిపచ్చడి కింద చిదగ్గొట్టేసుండేవాణ్ణే"

నడుస్తూనే అడిగింది అనూహ్య "ఎందుకని?"

"ఎందుకంటారేంటండీ? ఆ కోన్‌కిస్కాగాడు మీమీద ఎంత చెడ్డగా..."

"నోటి దురదకొద్దీ ఏదో వాగుంటాడు. అయితే మీకేంటి నష్టం?" గౌతమ్ మాటకి మధ్యలోనే అడ్డుతగిలి అడిగింది అనూహ్య.

'ఇదేం ప్రశ్న?' అన్నట్టుగా తెల్లబోయి చూశాడు గౌతమ్.

అప్పుడు...

సరిగ్గా అప్పుడు పేల్చింది అనూహ్య ఓ బాంబు.

"గడువింకా అయిదారు రోజులుండగానే మీరు మాట్లాడేశారు. అంటే ఓడిపోయారు. కాబట్టి నేనింక మిమ్మల్ని చేస్కోవడం అన్నది జరగనిమాట. అలాంటప్పుడు ఎవరో నా గురించి ఏదో అంటే మీకెందుకు బాధ?"

అంతే... గౌతమ్ నిర్ఘాంతపోయాడు.

ఆమె అలా గుర్తు చేసేవరకూ అతనికావిషయం తోచనేలేదు.

అన్నినెలల మౌనదీక్షని బూడిదలో పోసిన పన్నీరు చేసేస్తూ ఆవేశంలో తను ఒళ్ళు మర్చి మాట్లాడేశాడన్న సంగతి... నిజంగా...నిజ్జంగా





ఆమె అలా గుర్తు చేశాగ్గాని స్ఫురించలేదు అతనికి.

ఆ షాక్‌నుండి తేరుకోవడానికి అతనికి చాలాసేపు పట్టింది.

ఈలోగా మళ్ళీ మౌనవ్రతం పూనినవాడిలా నోరు విప్పకుండా ఆమెతోపాటే నడుస్తూ ఒకింతదూరం వెళ్ళాడు.

మైకందిగి షాక్‌నుండి పూర్తిగా తేరుకున్నాక నూతిలోంచి మాట్లాడుతున్నవాడిలా పీల కంఠంతో అన్నాడు.

"నిజమే అనూహ్యగారూ... నేనోడిపోయాను..."

అనూహ్య గర్వంగా నవ్వి నొక్కి పలుకుతూ అంది - "అవును... ఓడిపోయారు!"

గౌతమ్ ఆమె ముఖంలోకి ఆశగా చూశాడు.

"నిజమే అనూహ్యగారూ... కానీ ఆ సిట్యుయేషన్‌లో ఎవరికైనా కోపం రావడం సహజమే కదా?..." స్వరంలోనూ ఆశ తొంగిచూసింది.

కాని అనూహ్య దాన్ని పట్టించుకోలేదు.

"అదంతా నాకనవసరం. సిట్యుయేషన్ ఏదైనా కానీండి. ఓటమి ఓటమే!" అంది తలెగరేస్తూ.

"గెలుపుకోసం మీ గురించి ఎవరైనా చెడ్డగా మాట్లాడుతున్నా నేను సహించాలా?!" రోషంగా చూశాడు. తన ప్రశ్న లాజిక్‌కి నిలబడదని అతనికీ తెలుసు. కానీ అంతకన్నా బాగా అడగటం అతనికి చేతకాలేదు.

"పట్టుదలుంటే దేన్నయినా సహించొచ్చు. మీలో అది లేదని రుజువైపోయింది!" నుదుటిమీద జీరాడుతున్న ముంగురుల్ని కుడిచేత్తో పైకెగదోసుకుంటూ అదోలా నవ్వింది అనూహ్య.

గౌతమ్ ఉక్రోషంగా చూశాడు.

"పట్టుదల లేకపోతే మీ ప్రేమకోసం ఇన్ని నెలలు మాట్లాడకుండా వుండగలిగేవాడినా? ఇన్నాళ్ళూ ఎన్ని బాధలకోర్చి నా మౌనవ్రతాన్ని కంటిన్యూ చేస్తూ వచ్చానో నాకు తెలుసు, ఆ భగవంతుడికి తెలుసు. ప్రేమించిన అమ్మాయి గురించి ఎదుటివ్యక్తి నీచంగా మాట్లాడుతుంటే తట్టుకోలేకపోవడం పట్టుదల లేకపోవడం కాదు. ఆ సమయంలో పట్టుదలకు పోయి నేను గనక మాట్లాడకపోయుంటే ఆ వెధవలింకా రెచ్చిపోయి నానా కారుకూతలూ కూసుండేవాళ్ళు. అది మీకు బాగుండేదా?"

"అఫ్‌కోర్స్ అది వేరే విషయం. అయినా డొంకతిరుగుడు వాదనలొద్దు. మీరు మన పందెంలో ఓడిపోయారా లేదా? అది ఒప్పుకోండి ముందు..." పెడసరంగా అంది అనూహ్య.

"ఆ విషయం ఇంతకుముందే ఒప్పుకున్నాను. బట్..." గౌతమ్ ఇంకా ఏదో చెప్పబోతుంటే అడ్డుతగిలింది అనూహ్య.

"ఒప్పుకున్నారుకదా! అది చాలు. ఇంక ఆర్గ్యుమెంట్స్ అనవసరం. మీలో ఏమాత్రం సిన్సియారిటీ వున్నా ఈ క్షణంనుండి నా జోలికి రావడం మానేసెయ్యండి. అందుకు విరుద్ధంగా ప్రవర్తిస్తే మర్యాదగా వుండదు..."

"అనూహ్యగారూ..." గౌతమ్ దీనంగా ఏదో అనబోయాడు.

"చెప్పేది మీకే! నన్నింక విసిగించబాకండి! వెళ్ళండి... వెళ్ళండిక్కణ్ణుంచి..." దులపరించి పారేస్తూ నడక వేగాన్ని హెచ్చించింది అనూహ్య.

ఆమెతోపాటే తనూ నడక వేగాన్ని పెంచి 'అంతేనా?' అన్నట్టు మరింత దీనంగా చూశాడు గౌతమ్ ఆమె కళ్ళలోకి.

'సిగ్గూ, శెరం, చీమూ, నెత్తురూ అలాంటివేం లేవా?' అన్నట్టుగా కళ్ళు చికిలించిందనూహ్య.

అయినా ఆశను చంపుకోలేక అడిగాడు గౌతమ్.

"మీ నిర్ణయం మారదా అనూహ్యగారూ?"

"మారదు... మార్చుకోవాల్సిన అవసరం కూడా లేదు. అయినా ఇదేం కొత్తగా తీసుకున్న నిర్ణయం కాదుగదా? మన ఒప్పందం ప్రకారం నేను ధర్మంగానే ప్రవర్తిస్తున్నాను..." స్థిరంగా పలికింది అనూహ్య.

ఆమె అలా అంటుంటే గుండెను నిలువుగా చీలుస్తున్నట్టే అనిపించింది గౌతమ్‌కి.

ఏమూలనో ఇంకా కొంచెం ఆశ రెపరెపలాడుతుండగా మరోమారు ఆశగా చూశాడామె

వైపు.

ఆ ఆశను సమూలంగా నాశనం చేస్తూ మరింత స్థిరంగా అంది అనూహ్య.

"మంచిమనిషికో మాట... మంచి గొడ్డుకో దెబ్బ! మీలో ఏమాత్రం పౌరుషం వున్నా ఇకమీదట నావైపు కన్నెత్తి కూడా చూడరంతే!"

తెగేసి చెప్పి ఆమె విసవిసా ముందుకెళ్ళిపోతుంటే ఒంట్లోని రక్తమంతా ఆవిరైపోతున్నట్టుగా నీరసం కమ్ముకొచ్చేసింది గౌతమ్‌కి.

చేష్టలుడిగి శిలా విగ్రహంలా నుంచుండిపోయాడక్కడ!



"ఏంట్రా? ఏమైంది? ఎందుకలా వున్నావ్?!" ప్రపంచంలోని విషాదమంతా ముఖంలో తాండవిస్తుండగా మంచంమీద వెల్లకిలా పడుకుని రూఫ్‌కేసి శూన్యథృక్కులు చూస్తూవున్న గౌతమ్‌ని ఆందోళనగా ప్రశ్నించాడు సుబ్బారావ్.

గౌతమ్ మాట్లాడలేదు.

"నిన్నేరా అడుగుతూంట..."

గౌతమ్ కనీసం దృష్టయినా మరల్చలేదు.

"రేయ్ నిన్నే..." జబ్బుమీద చరుస్తూ అన్నాడు సుబ్బారావ్. "ఎందుకలా వున్నావ్? ఇంకా అయిదారు రోజుల్లో గడువు పూర్తవ్వబోతున్న ఈ శుభసమయంలో ఉత్సాహంతో చిందులు వెయ్యాల్సింది పోయి ఇలా దిగులుగా పడుకున్నావేం? పెన్నూ కాయితం తీస్కొస్తా, ఏం జరిగిందో రాసి చూపించు. లే... లేచి కూర్చో..."

సుబ్బారావు అలా అంటుంటే అంతవరకూ బలవంతంగా అణుచుకోవడానికి ప్రయత్నించిన దుఃఖాన్ని ఇంక ఆపుకోవడం గౌతమ్ వల్ల కాలేదు.

అలాగని బావురుమని ఏడవనూలేకపోయాడు, ఎంతయినా పాపం మగవాడు మరి!

శక్తంతా కూడగట్టుకుని ఎంతో కష్టంమీద లేస్తున్నవాడిలా లేచి కూర్చుని అప్పటికే తన మీదకు ఒంగివున్న సుబ్బారావ్ భుజంమీద తల వాలుస్తూ... "వద్దురా ఇప్పుడింక ఆ అవసరం లేదు" అన్నాడు ఎంతో బాధగా.

సుబ్బారావ్ తన చెవుల్ని తానే నమ్మలేకపోయాడు!

ఏంటిది? ఏమైంది వీడికి? గడువు పూర్తవ్వకముందే మాట్లాడేస్తోంది చాలక 'ఆ అవసరం లేదురా' అని ఇంత నిరాశగా మాట్లాడుతున్నాడూ అంటే...!

దేర్ మస్ట్‌బి నమ్‌థింగ్ రాంగ్!... ఏదో జరక్కూడనిది జరిగిపోయుండాలి!

"ఏంట్రా గౌతమ్... ఏమైంది? ఇన్ని రోజులూ ఓపికపట్టి చివర్లో ఇలా ఓడిపోవడమేంటి? ఎవరు? ఎవరు నీ వ్రతానికి భంగం కలిగించింది?" ఒకవైపు గౌతమ్ వెన్నుమీద ఆప్యాయంగా నిమురుతూనే కంగారుగా, ఆదుర్దాగా ప్రశ్నించాడు సుబ్బారావ్.

"అంతా నా ఖర్మ" సుబ్బారావ్ భుజంమీంచి తల పైకెత్తకుండానే మూలిగినట్టుగా అన్నాడు గౌతమ్.

"ఖర్మేంట్రా? సరిగా చెప్పు..." గౌతమ్‌ని భుజంమీంచి లేపి అతని ముఖాన్ని తనవైపు తిప్పుకుంటూ అడిగాడు సుబ్బారావ్.

నిస్తేజంగా వున్న గౌతమ్ కళ్ళలో స్పష్టాతిస్పష్టంగా తడి.

"ఏంజరిగిందిరా? ఇన్నాళ్ళ నీ కఠోర దీక్షని ఇలా మంటగలిపిందెవరు?" ప్రశ్నిస్తోంటే సుబ్బారావ్ కంఠం బాధతో వణికింది.

"అంతా నా ఖర్మ..." మళ్ళీ అదే మాటన్నాడు గౌతమ్ విరక్తిగా జుట్టు పీక్కుంటూ.

"ఏదైనా కర్మానుసారమే జరుగుతుందిలే గాని... అసలేం జరిగిందో ఎలా జరిగిందో కాస్త వివరంగా బోధపడేలా చెప్పు..."

సుబ్బారావ్ చాలాసేపు బుజ్జగింపుగా రొ

క్కించి రొక్కించి అడిగినమీదట నెమ్మది నెమ్మదిగా విషయమంతా చెప్పుకొచ్చాడు గౌతమ్!

అంతా విని అమితంగా నొచ్చుకున్నాడు సుబ్బారావ్. "ఛీ! ఎంత దయలేని ఆడదిరా ఆ అమ్మాయి? అలాంటి పరిస్థితిలో ప్రతాన్ని సైతం లెక్కచెయ్యకుండా నువ్ నోరు విప్పినందుకు మరో ఆడదైతే ఎంతగానో నిన్నభినందించుండేది! ఒకవేళ అప్పటివరకూ తనకు నీమీద ప్రేమ లేకపోయినా ఆ క్షణాన్నే తన మనసు నీకర్పించేసుండేది! అలాంటిది ఆమె అంత మూర్ఖంగా మాట్లాడగలిగిందీ అంటే... అనలామెను మనిషనుకోవాలో ఇంకే మనుకోవాలో నాకర్థంకావట్లేదు" అన్నాడు ఏహ్యత నిండిన కంఠంతో.

"పోనీలే వూర్కోరా..." అంత జరిగినా కూడా సుబ్బారావ్ అనూహ్యనలా నిందించటం గౌతమ్‌కి రుచించలేదు. రుద్ధ కంఠంతో అన్నాడు- "అనవసరంగా ఆమెనను కోవడం దేనికి? కారణం ఏదైనాగానీ మొత్తానికి నేనోడిపోయాను. గెలిచుంటే ఆమె నన్ను తిరస్కరించేది కాదేమోలే!"

"నీ బొంద నీ మొహం. నీ తలకాయ్! ఇంకా ఆ మాయలాడిని సమర్థిస్తూ మాట్లాడ్తున్నావంటే నిన్నెలా అర్థం చేస్కోవాలో తెలీడంలేదు. అలాంటి మనిషి నువ్ గెలిచినాసరే ఏదోకరకంగా టోకరా ఇచ్చుండేది! నో... దీన్నింత తేలిగ్గా వదలకూడదు మనం! ఇన్నాళ్ళూ నిన్నిలా ముప్పుతిప్పలుపెట్టి చివరికిలా చేస్తుంటే... హుఁ ఆమెన్నువ్ క్షమించినా, నేను మాత్రం క్షమించి వూరుకోను. కుక్క కాటుకి చెప్పుదెబ్బన్నట్టుగా ఏదోకరకంగా ఆమెకి తగిన శాస్తి చేసితీర్తాను" కుపితుడౌతూ అన్నాడు సుబ్బారావ్. మిత్రుడికి జరిగిన అన్యాయాన్ని తల్చుకుంటున్నకొద్దీ అతనికి కడుపు మండిపోసాగింది.

సుబ్బారావ్‌లోని ఆవేశాన్ని చూసి ఆశ్చర్యపోయాడు గౌతమ్!... ఎంత ప్రేమ వీడికి నేనంటే!

వీడి వాలకం అదీ చూస్తుంటే నిజంగానే అనూహ్యకి ఏదో ఒక అపకారం తలపెట్టేలాగా వున్నాడు.

ప్రతీకారాన్ని కోరే ప్రేమ కూడా ఒక ప్రేమేనా?

నో... చూస్తూ చూస్తూ అనూహ్యకి అపకారాన్ని జరగనిచ్చేట్టయితే ఇక తన ప్రేమకి విలువేముందసలు!

ఆమె తనకి దక్కకపోయినా ఫర్వాలేదు. కానీ ఆమెమాత్రం ఎప్పటికీ సుఖంగానే వుండాలి.

గౌతమ్‌ది నిజమైన ప్రేమే కాబట్టి నిజమైన ప్రేమికుడికుండాల్సిన లక్షణాలన్నీ అతనిలోనూ పుష్కలంగా వున్నాయి. అందుచేత అలా ఆలోచించి ఠక్కున సుబ్బారావ్ చేతిని లాక్కుని తన తలమీద పెట్టుకుంటూ గాద్గదికంగా అన్నాడు.

"ప్లీజ్ సుబ్బారావ్... జరిగిందేదో జరిగిపోయింది. నామీద అభిమానంకొద్దీ నువ్ అనూహ్యకేదైనా అపకారం తలపెడితే నామీదొట్టే! ఆమెని పల్లెత్తు మాట కూడా అనొద్దు"

గౌతమ్ అలా అంటుంటే అతనిమీద జాలి పడాలో లేక ఏడ్వాలో అర్థంకాలేదు సుబ్బారావ్‌కి.

నిజంగా వీడిలాంటి మంచి వ్యక్తిని కాదని కాలదన్నుకుంటోన్న ఆ అనూహ్య ఎంత దురదృష్టవంతురాలో కదా? అనిపించిందోక్షణం.

ఇంత గాఢంగా ప్రేమిస్తున్న వ్యక్తిని తిరస్కరించి ఏం బావుకుందామనుకుంటుందో ఆ మహాతల్లి!

ఆమె పొగరు ఆ భగవంతుడే అణుస్తాడు.

ఏ అప్రాచ్యపు వెధవో భర్తగా లభిస్తేతప్ప రోగం కుదరదు అలాంటి తలబిరుసు ఆడవాళ్ళ‌కి.

అందంగా వుండగానే సరిపోయిందా? ఆ అందానికి తగ్గ అందమైన మనసు లేనప్పుడు ఆ అందం వుంటేనేం వూడితేనేం?

మనసు కుతకుతలాడిపోతున్నా మిత్రుణ్ణి నొప్పించడం ఇష్టంలేక 'అలాగే లేరా' అన్నట్టు తలాడించాడు సుబ్బారావ్.

"తలూపడం కాదు. ఈ విషయం గురించి ఆమెతో ఒక్క మాట కూడా మాట్లాడనని ప్రామిస్ చెయ్యి" చెయ్యి చాపుతూ అన్నాడు గౌతమ్.



'పిచ్చి వెధవా' అని మనసులో జాలిగా అనుకుని... ''ప్రామిస్'' అన్నాడు సుబ్బారావ్ గౌతమ్‌చేతిలో చెయ్యేస్తూ.

ఇక్కడిలా వుండగా-

సరిగ్గా ఆ సమయంలో అక్కడ అనూహ్యావాళ్ళింట్లో...

''ఏమైందమ్మా? ఎందుకు నీలో నువ్వే అలా నవ్వుకుంటున్నావు?'' రాజశేఖరం అడిగాడు అనూహ్యని.

''పొద్దున భలే తమాషా జరిగిందన్నయ్యా!... నీతో వీరప్రగల్భాలు పలికిన ఆ గౌతమ్ లేడూ... పాపం ఇవ్వాళ చిత్తుగా ఓడిపోయాడు'' విరగబడి నవ్వుతూ అంది అనూహ్య. ''ఇవ్వాళ్టితో అతని మౌనదీక్షకాస్తా అటకెక్కేసింది''

''నిజంగానా?'' ఆశ్చర్యంగా చూశాడు రాజశేఖరం.

''ఎట్టెట్టా?'' అంది అక్కడే వున్న అతని భార్య బుగ్గలు నొక్కుకుంటూ.

క్లుప్తంగా జరిగిన విషయం చెప్పింది అనూహ్య.

''ఎవరమ్మా ఆ బడుద్ధాయి వెధవలు? వాళ్ళని మెత్తగా తన్నునివ్వకుండా అతనికి నువ్వెందుకడ్డుపడ్డావ్? అసలు నువ్వే చెప్పుతీసి నాలుగు వాయించుండాల్సింది స్కౌండ్రల్స్‌ని...'' కోపంగా అన్నాడు రాజశేఖరం.

''అవునవును... అతను ఓడిపోయాడన్న ఆనందమే తప్ప, ఆ రాస్కెల్సెవరో నిన్నలాంటి మాటలన్నందుకు నీకు వాళ్ళమీద కోపమే రాలేదా? ఎందుకొదిలేశావ్ వాళ్ళని?'' అంది అనూహ్యా వదిన రాజశేఖరానికి వంతపాడుతూ.

అనూహ్యా అన్నావదినలిద్దరివేపూ మార్చి మార్చి చూసి ఆ వెంటనే ఫకాలున నవ్వింది.

ఆ సందర్భంలో అలా నవ్వాల్సిన అవసరమేమిటో అర్ధంగాక వాళ్ళిద్దరూ బిత్తరపోయారు.

''ఏంటమ్మా? ఎందుకలా నవ్వుతున్నావ్... నువ్వేదో దాస్తున్నావ్... అసలేం జరిగిందో చెప్పు'' తేరుకున్నాక అడిగాడు రాజశేఖరం.

''చెప్పానుగా అన్నయ్యా! జరిగింది మాత్రం అక్షరాలా అంతే! కానైతే ఆ జులాయి వెధవలుమాత్రం నిజంగా జులాయి వెధవలు కారు...''

''ఆఁ?!'' అంటూ మరోసారి నోళ్ళు వెళ్ళబెట్టారు శ్రోతలిద్దరూ.

ఈసారి భర్తకన్నా ముందుగా అనూహ్యా వదిన తేరుకుంది.

''ఏంటమ్మా నస్పెన్సు రచయిత్రిలా ఈ ఊరింపు! కాస్త అర్ధమయ్యేలా చెప్పవమ్మా తల్లీ'' అంది ఆసక్తిగా చూస్తూ.

అప్పుడు...

అప్పుడు చెప్పిందనూహ్య, ఆ జులాయి వెధవలెవరో.

అంతే!

మరోమారు ఆశ్చర్యానికి లోనయ్యారు ఆ దంపతులు.

''వాట్వాట్వాట్?'' అంటూ ముక్కుమీద వేలేసుకున్నాడు రాజశేఖరం.

★ ★ ★

ఆ మర్నాడు-

పొద్దున్నే లేచి గౌతమ్ సూట్‌కేస్‌లో బట్టలూ అవీ సర్దుకుంటుంటే ఆశ్చర్యంగా అడిగాడు సుబ్బారావ్-

''బట్టలు సర్దుతున్నావ్... ఎక్కడికిరా?''

''ఇంటికి'' పొడిగా చెప్పాడు గౌతమ్.

''ఇంటికా?''

''అవున్రా! ఇంత జరిగాక అనూహ్యాకి నా మొహాన్నింకా చూపుతూ ఇక్కడే వుండటం ఇక నావల్ల కాదు. ఆమె మనసులో నాకు చీమ తలకాయంతైనా చోటు లేదని స్పష్టమైపోయింది. అలాంటప్పుడు ఇంకా నేనిక్కడే వుండటంవల్ల వుపయోగమేమిటి?'' బాధగా కణతలు రుద్దుకుంటూ అన్నాడు గౌతమ్. ''అదీగాక ఆమె నాకళ్ళముందు కనిపిస్తున్నంతకాలం నా ఈ ఓటమి తాలూకు బాధ నన్ను తినేస్తుంటుంది. ఇక్కడ నేనింక ఏమాత్రం మనశ్శాంతిగా బతకలేను. అందుకే మనూరికి వెళ్ళిపోదామని నిశ్చయించుకున్నాను...''

సుబ్బారావ్ బాధగా అన్నాడు





"ఎవర్నడిగి నిశ్చయించుకున్నావ్‌రా? ఆ టక్కులాడి ఒక్కతేనేంటి లోకంలో? నేనూ, నా స్నేహం నీకింక అవసరం లేదా?... అంతగా ఆ మహాతల్లి మొహం చూడ్డం ఇష్టం లేకపోతే వేరే ఇంటికి మారిపోదాం..."

"అది కాదురా! కొన్నాళ్ళపాటు ఈ పరిసరాలు వదిలి వెళ్తే కాస్త రిలీఫ్‌గా వుంటుందికదా అని..." నసిగాడు గౌతమ్. ముఖ కవళికల్నిబట్టి సుబ్బారావ్ ఎంత బాధపడుతున్నాడో గ్రహించగలిగాడు అతను. అయినా మనసు మార్చుకోవాలన్పించలేదు. నిజంగానే అక్కడ వుండటం కంటకప్రాయంగా అనిపిస్తోందతనికి.

అనూహ్య తనది కావటం కల్ల అని అంత స్పష్టంగా తెల్సిపోయాక తనింకా ఎందుకుండాలిక్కడ?

ఉండి సాధించగలిగిందేముంది?

అసలే పచ్చిపుండులా తయారైన మనసుని దబ్బనంతో కెలికినట్టే అవుతుంది అనూహ్య కంటబడినప్పుడల్లా. సుబ్బారావు చెప్పినట్టు ఇల్లు మారిపోయినా ఏదోఒక బలహీనపు ఘడియలో ఆమెను చూడాలని మనసు తహతహలాడకుండా వుంటుందా? ఇంపాసిబుల్! ఇక్కడేవుంటూ ఆమెను మర్చిపోవడం అంటే అది తనవల్ల జరిగే పనికాదు!

ఆమెనుండి దూరంగా వెళ్ళిపోవడమే అన్నివిధాలా శ్రేయస్కరం.

సుబ్బారావు ఎంత బ్రతిమాలినా సరే మనసు మార్చుకోకూడదని గట్టిగా నిర్ణయించుకున్నాడు గౌతమ్.

ఆ ప్రకారమే సుబ్బారావు ఎన్ని విధాలుగా నచ్చజెప్పడానికి ప్రయత్నించినా వినిపించుకోకుండా మరో గంట తర్వాత అతను తన స్వగ్రామానికి ప్రయాణమయ్యాడు.

ఒక రంగుల కల చెదిరిపోయింది.

ఒక దురదృష్టవంతుడు మీటిన ప్రేమవీణ అపశృతి పలికింది.

★ ★ ★

"దాని బ్రతుకు బుగ్గయిపోను! నిన్నొక వెర్రివాజమ్మని చేసి చివరికిలా తప్పించుకుందన్నమాట! హుఁ... అంతకంతా అనుభవిస్తుంది-" మెటికలు విరుస్తూ అనూహ్యని శాపనార్థాలు పెట్టింది రామసీత.

కొడుక్కంత 'పరాభవం' జరిగితే ఏ తల్లి మాత్రం సహించగలుగుతుంది?

అప్పటికది రెండోరోజు గౌతమ్ మూటా ముల్లెతోసహా ఇంటికొచ్చేసి-

మొదటిరోజంతా నోరు విప్పకుండా మౌనంగా వుండిపోతే వీడింకా దీక్షలోనే వున్నాడు కాబోలనుకున్నారు అతని అమ్మానాన్నలు. వచ్చిన కారణమేవిటో వాడే రాసిచూపిస్తాళ్ళే అని ప్రశ్నలతో విసిగించకుండా వూరుకున్నారారోజు.

మర్నాడు... ఎప్పటికైనా చెప్పకతప్పదు కదాని. గౌతమ్ తనంతటతానే చెప్పేశాడు తల్లితో విషయమంతా.

తల్లి మనసు తల్లడిల్లిపోయింది.

చెట్టంత తనయుణ్ణి ఆఫ్టరాల్ ఒక ఆడపిల్ల అన్ని అవస్థల పాలుచేసి కరివేపాకులా తీసిపారేయడం... ఆమెకు చాలా తీవ్రమైన మనస్తాపాన్ని కలిగించింది.

ఎదురుగా లేదుగానీ, వుండుంటే అనూహ్యని ఆ చెంపా ఈ చెంపా వాయించెయ్యాలన్నంత కోపం వచ్చిందామెకు.

తత్ఫలితమే ఆ శాపనార్థాలు.

"ఊరుకోమ్మా... ఆ అమ్మాయిని అలా అనకు" చింత చచ్చినా పులుపు చావలేదన్నట్టు ప్రేయసి అన్ని అగచాట్లు పాలు చేసి తిరస్కరించి పంపినా మనసు లోతుల్లో ఇంకా ఏ మూలనో కొనవూపిరితో కొట్టుకులాడుతున్న ప్రేమ గౌతమ్‌చేత అలా అనిపించింది.

" నోర్మూయ్యరా తింగర నాగన్నా! నువ్వింత అమాయకుడివి కాబట్టే ఆ వన్నెల విసనకర్ర నిన్ను తోలుబొమ్మని చేసి ఇంత అధ్వాన్నంగా ఆడించగలిగింది" కసిగా అంది రామసీత. "ఎవరు చేసిన పాపం వాళ్లనే కట్టికుడుపుతుంది. నీ వుసురూ నా వుసురూ తగిలి ఆమె సర్వనాశనమైపోకపోతే చూడు."

శాపాలు ఫలించే రోజులు కావని తెలిసినా చెవులు మూసుకోకుండా వుండలేకపోయాడు గౌతమ్.

తల్లిని శాంతింపజెయ్యాలన్న ఉద్దేశంతో మళ్ళీ ఏదో అనబోయాడు. కానీ అంతలోనే ఆవిడీసారి శాపనార్థాలని ఓ దండకంలా చదవడం ప్రారంభించేసింది.

తల్లి అనూహ్యనలా శపిస్తుంటే చెవుల్లో తూటాలు పేలుతున్నట్టనిపించింది గౌతమ్‌కి.

ఆ సమయంలో అతనికెంత బాధ కలిగిందంటే అందుబాటులో సైనైడ్ గుళికేదైనా వుంటే దాన్ని మింగేయ్యాలన్నంత.

కానీ అందుబాటులో సైనైడ్ గుళికలూ గట్రా వుండటానికి అతనేం ఆత్మహత్యాదళానికి చెందిన తీవ్రవాది కాదు కాబట్టి, తల్లి 'శాపాలు' ఆలకించలేక ఏదో గుర్తుకొచ్చినవాడిలా గబగబా అక్కడినుంచి వెళ్ళిపోయాడు.

రామసీత ద్వారా జోగారావుకీ తెలిసిపోయింది విషయం.

బాధ పడటం మినహా ఆయన మాత్రం చెయ్యగలిగిందేముంది?

"సరే... ఇంతకీ ఇప్పుడేమంటున్నాడు నీ సుపుత్రుడు?" అన్నాడాయన పైకి ఏ భావమూ వ్యక్తంచెయ్యకుండా. ఎంత లేదనుకున్నా ఆ ప్రశ్నలో అంతర్గతంగా ఎంతో కొంత వ్యంగ్యం లేకపోలేదు.

కొడుకు దీనపరిస్థితికి ఆయనేమాత్రం సానుభూతి వ్యక్తం చెయ్యకుండా అలా అడగటం రామసీతకి బొత్తిగా నచ్చలేదు.

"వాడిమీద మీకేమాత్రం జాలి కలగటంలేదా?" అడిగింది బాధగా.

"ఎందుక్కలగట్లేదూ? కానైతే అంతోటి అందగత్తె కోడలు కాకపోయెనే అని కాదు. నీ సుపుత్రుడి అప్రయోజకత్వంమీద జాలేస్తోందంతే" అనేసి ఆ విషయాన్నింక పొడిగించకుండా సిగరెట్ ముట్టించి వాలుకుర్చీలో కూలబడిపోయాడాయన.

మాట్లాడించినకొద్దీ కొడుకును దుయ్యబట్టడమే తప్ప ఈయనగారు చెయ్యగలిగిందేమీ లేదనిపించి, తను కూడా మరేమీ మాట్లాడకుండా వంటింట్లోకి వెళ్ళిపోయింది రామసీత.

ఒంటరిగా మిగిలిపోయిన జోగారావు పరిపరివిధాల ఆలోచించాడు.

ఈ సమస్యకేదైనా పరిష్కారముందా అని-కానీ ఏముంటుంది?

కొడుకు మోజుపడ్డంతమాత్రాన్న సరిపోతుందా? ఆ పిల్లకంత ఇష్టం లేనప్పుడు ఎవరు మాత్రం ఏం చెయ్యగలరు?

ఆ పిల్ల తిరస్కరించిందన్న బాధతో గౌతమ్ ఏ దేవదాసుగానో మారిపోకుండా చూస్కోగలిగితే అదే పదివేలు.

వాణ్ణి ప్రతిక్షణం ఓ కంట కనిపెడుతుండాలి.

అలా అనిపించగానే వెంటనే భార్య దగ్గరికెళ్ళి ఆమెతో అదేమాట చెప్పాడాయన.

చేతిలో సారాసీసాతో గౌతమ్ రూపం కళ్ళ ముందు మెదిలి కకావికలమైపోయింది రామసీత మనసు.

నిజమే... అసలే పిచ్చి సన్నాసి... ఈ బాధని దిగమింగుకోలేక ఏంచేస్తాడో ఏమో?!

"అవునండీ... ఆమెని రెక్కలు విరిచికట్టి తెచ్చి వాడికి కట్టబెట్టడం మనకెలాగూ సాధ్యంకాదు. మీరన్నట్టు వాణ్ణి చాలా జాగ్రత్తగా కనిపెట్టుకోవాలి మనం. అయ్యిందేదో అయ్యింది. మీరు కూడా ఈ విషయంలో వాణ్ణింకేం సూటీపోటి మాటలనకండి..." భర్తతో ఏకీభవిస్తూనే ఆయనకి సుద్దులు చెప్పబోయింది రామసీత.

"నాకామాత్రం తెలియదా ఏమిటీ! ముందు ఎలాగోలా వాడా అమ్మాయిని మర్చిపోయేలా చెయ్యగలిగితే, ఆ తర్వాత మంచి సంబంధమేదైనా చూసి ముడిపెట్టెయ్యొచ్చు. అసలప్పట్లోనే పొరపాటు చేసేశాం మనం. బెదిరించో భయపెట్టో ఆ శివరామకృష్ణయ్య కూతుర్ని చేసేసుంటే ఈ గొడవలన్నీ వుండేవేకావు"

"ఇప్పుడదంతా తవ్వుకోవడం దేనికి లెండి. పెళ్ళి చేసేస్తే వాడు కుదుటపడేమాట నిజమే గాని, ఇప్పట్లో ఆ వూసు తెస్తే కస్సుమంటాడు!

"నేనన్నదీ అదేనే... ముందు వాడా అమ్మాయిని మర్చిపోవడం ముఖ్యం. ఆ తర్వాతే పెళ్ళిచేసినా మరోటి చేసినా"

అలా చాలాసేపు చర్చించుకున్నారా దంపతులు.

చివర్లో పెళ్ళిచేస్తేగానీ పిచ్చికుదరదూ,



పిచ్చికుదిరితేనేగాని పెళ్ళిజరగదూ అన్న సామెత గుర్తొచ్చిందిద్దరికీ.

అవును మరి.

గౌతమ్ అనూహ్యని మర్చిపోగలగాలీ అంటే అతనికి వేరే అమ్మాయితో పెళ్ళిచెయ్యాలి.

వేరే అమ్మాయితో పెళ్ళి చెయ్యగలగాలీ అంటే ముందతను అనూహ్యని మర్చిపోవాలి!

కాలం మాత్రమే పరిష్కరించగలిగే సమస్య అది.

అందుకే భారం దేవుడి మీద వదిలెయ్యడం తప్ప మరో మార్గాంతరం తోచలేదు వాళ్ళిద్దరికీ.

★ ★ ★

"అక్కలాంటిదానివన్నాడు అదన్నాడు ఇదన్నాడు చివరికి నాకు మాటమాత్రంగానైనా చెప్పకుండా వూరెళ్ళిపోవడమేంటి మీ గౌతమ్? ఇదేనా అక్కమీద చూపించాల్సిన ప్రేమ?" గౌతమ్ వెళ్ళిపోయిన నాటిసాయంత్రం సుబ్బారావుతో నిష్ఠూరంగా అంది పావని.

డుంబూని అంబోతు పొడవబోయిన్నాడు కాస్త రగడ జరిగిందన్నమాటే గానీ, ఆ తర్వాత్త ర్వాత ఈ ఏడాదిపాటూ గౌతమ్ మౌన వ్రతానికి ఓ అక్కలా తన వంతు సహకారాన్ని తానందిస్తూనే వచ్చిందామె. అడ్డమైన ప్రశ్నలూవేసి గౌతమ్ మౌనవ్రతానికి డుంబూ ఎక్కడ భంగం కలిగిస్తాడోనన్న ఉద్దేశంతో వాణ్ణి సుబ్బారావు వాళ్ళ పోర్షన్‌లోకి వెళ్ళకుండా కట్టడి చేస్తూ వచ్చిందిన్నాళ్ళూ. అంత కోపరేట్ చేసిన తనకి ఒక్క ముక్కైనా చెప్పకుండా గౌతమ్ అలా వెళ్ళిపోవడం ఆమెకు సహజంగానే బాధ కలిగించింది.

"ఓటమి వాడి మనసుని అస్తవ్యస్తం చేసేసిందండీ! వెళ్ళేముందు నాతో కూడా సరిగా మనసు విప్పి మాట్లాడిన పాపాన పోలేదు. వాడి గెలుపు ఖాయమని నాతోపాటు మీరూ అనుకున్నదేగా?... అలాంటిది అన్‌ఫార్చ్యునేట్‌గా అంతా తలక్రిందులై చివరికిలా అయిపోవడంతో వాడికి తన మొహం మీకు చూపించడానికి మనస్కరించివుండదు పాపం" అంటూ ప్రారంభించి- గౌతమ్ ఓటమి ఎలా సంభవించిందో అనూహ్య ఆ పరిస్థితుల్లో అతన్నెంత నిర్దయగా తిరస్కరించిందో, ఫలితంగా గౌతమ్ ఎంత బాధపడ్డాడో అదంతా సుబ్బారావు సవివరంగా చెప్పాడామెకు.

పావని చాలా నొచ్చుకుంది- "వెళ్ళేముందు ఇలాగిలాగ జరిగిందని నాతో గనక ఒక్క ముక్క చెప్పుంటే నేను వెళ్ళి దాన్ని జుట్టుపట్టి ఈడ్చుకొచ్చి గౌతమ్ కాళ్ళమీద పడేసుండేదాన్నే! తనకోసం ఉద్యోగం కూడా పోగొట్టుకుని, ఏడాదిపాటు మౌనవ్రతాన్ని పూని, శ్లేష్మంలోపడ్డ ఈగ చందాన గిజగిజలాడిపోయిన ఆ అమాయకుణ్ణి చివరికింత ఘోరంగా తోసిపారేస్తుందా... ఇప్పటికైనా మించిపోయిందేమీ లేదు నేను వెళ్ళి అమీ తుమీ తేల్చుకొస్తానాగు" అంది ఆగ్రహంగా.

"నేనూ మీలాగే కోపగించుకుంటే అమె జోలికి వెళ్ళొద్దని నాతో ఒట్టేయించుకున్నాడండీ" ఆ విషయం కూడా వివరంగా చెప్పాడు సుబ్బారావు.

"ఒట్టేయించుకున్నది నీతో గానీ నాతో కాదుగా నేను మాత్రం వెళ్ళేది ఖాయం, ఆ అనూహ్యని బొమ్మిడాయిని తోమినట్టు తోమేది ఖాయం! ఎదుటి వ్యక్తి మనసంటే బంతో బొమ్మో అనుకుంటుందా ఆడుకుని విసిరి పారెయ్యడానికి? ఆ పొగరుబోతు మన గౌతమ్‌ని ఎలా చేసుకోదో నేను చూస్తాను" అంది పావని. నోరారా అక్క అని పిలిచిన వ్యక్తి మీద ఏడాది వ్యవధిలో ఆపాటి అభిమానం ఏర్పడ్డం సహజమే కదా!

"సరే...మీ ఇష్టం" అన్నట్టుగా తల తాటించి వూరుకున్నాడు సుబ్బారావు.

అదే రోజు సాయంత్రం భార్య చెప్పగా శ్రీరామ్మూర్తి క్కూడా తెలిసింది గౌతమ్ భగ్న ప్రేమోదంతం.

అతని క్కూడా అయ్యోపాపం అనిపించింది.

అంతెందుకూ, అదే సమయంలో అక్కడే వుండి వాళ్ళ సంభాషణద్వారా విషయం కొంచెం కొంచెంగా అర్థంచేస్కున్న డుంబూగాడి పసి హృదయానిక్కూడా అర్థమైపోయింది.

గౌతమ్ అంకుల్ వెళ్ళిపోవడానిక్కారణం ఎదురింటి అనూహ్యేనన్న సంగతి.





ప్రేమ, మౌనవ్రతం, పందెం, గెలుపు, ఓటమి ఇత్యాదిపదాలన్నీ అర్థంకాకపోయినా మొత్తానికి అనూహ్యవల్ల గౌతమంకుల్‌కేదో అపార నష్టం జరిగిపోయిందని గ్రహించి- "పాడనూహ్యా... ఏం చేసినా పాపం లేదు" అని అనూహ్యని తిట్టుకోకుండా వుండలేకపోయాడు వాడు కూడా.

ఆ చిన్నబుర్రలో కూడా కసితో కూడుకున్న ఓ ఆలోచన -'ఆ శ్యాంబాబుగాణ్ణి మెత్తగా తన్ని ఆ అనూహ్యకి కోపం తెప్పిస్తే బావుంటుంది కదా!' అని ఎదురుబొదురిళ్ళే కావడాన వాడికీ శ్యాంబాబుగాడికీ చాలాకాలం క్రిందటే స్నేహమేర్పడిపోయింది. కానైతే శ్యాంబాబుకి మాటలు రాకపోవడంవల్ల వాడితో వీడెక్కువటైమ్ స్పెండ్ చేయడు.

పావని భర్త దగ్గర కూడా మళ్ళీ అదే అభిప్రాయాన్ని వ్యక్తంచేసింది "ఆ అనూహ్యని నిగ్గదీసి కాస్త గడ్డిపెట్టి రావాలనిపిస్తోందండీ" అంటూ.

"నోరుపారేసుకోవద్దులే గాని... కాస్త నెమ్మదిగా నచ్చజెప్పి చూడు... పాపం ఆ గౌతమ్ అదృష్టం బాగుంటే ఆ అమ్మాయి మనసు మారినా మారొచ్చు"ఎంకరేజింగ్‌గా అన్నాడు శ్రీరామ్మూర్తి.

ఆ మర్నాడు...

అనుకున్నట్టుగానే పావని అనూహ్యా దగ్గరికెళ్ళింది.

లక్కీగా ఈమె వెళ్ళేసరికి అనూహ్యా వదిన ఇంట్లో లేదు.

ఒంటరిగా దొరికిన అనూహ్యని నానామాటలూ అనకపోయినా ఇంచుమించు నిలదీసినట్టే అడిగింది పావని.

"ఇలా చెయ్యడం నీకు ధర్మమేనా? పాపం నీ కోసం అన్ని అవస్థలు పడ్డ ఆ కుర్రాణ్ణి ఇలా ఏడిపించడం ఏవన్నా బాగుందా?" వగైరా వగైరా మాటలంటూ-

"ఏం ఆ గౌతమ్ మిమ్మల్ని రాయబారానికి పంపాడా?" అదోలా నవ్వుతూ అడిగింది అనూహ్యా.

"రాయబారాలూ గట్రా పంపడానికి అసలు అతనిక్కడుంటేగా? నీ పుణ్యమా అని మనసు విరిగి ఏకంగా వూరేవిడిచి వెళ్ళిపోయాడు"

"మరైతే మీరెందుకొచ్చినట్టో?"

ఓసి నీవ్యంగ్యం మండిపోనూ అని లోలోన తిట్టుకుని- "అతను నా తమ్ముడి లాంటివాడు. అతని జీవితం నాశనమై పోతుంటే చూస్తూ వూర్కోలేక వచ్చాను" అంది కోపంగా పావని.

అలా ప్రారంభమైన వాళ్ళ సంభాషణ అదే ధోరణిలో మరో పదినిముషాలపాటు సాగి ఆ తర్వాత ఓ విచిత్రమైన మలుపు తిరిగింది.

దరిమిలా పావని మరో పావుగంటసేపు అనూహ్యతో ఉత్సాహంగా కబుర్లాడి ఆ మీదట ఇంటి ముఖంపట్టింది.

"ఏమైంది? ఏమందా అమ్మాయి?" భార్య రాగానే ఆత్రంగా అడిగాడు శ్రీరామ్మూర్తి.

చెప్పింది పావని తామిద్దరి మధ్యా జరిగిన సంభాషణంతా.

"నిజంగానా?!"స్టన్నైపోతూ అడిగాడు శ్రీరామ్మూర్తి.

"నిజం! త్వరలో వాళ్ళ అన్నయ్యగారు వెళ్తున్నారట అక్కడికి"

"వండ్రఫుల్! వెరీగుడ్! వెరీవెరీ గుడ్!" అన్నాడు శ్రీరామ్మూర్తి సంతోషంగా.



ఎంత వద్దనుకున్నా అనూహ్యా గురించి ఆలోచించకుండా వుండలేకపోతున్నాడు గౌతమ్.

ఆ విషయంలో మనసుకు పగ్గాలు

వెయ్యడం అతనికి బొత్తిగా సాధ్యంకావడం లేదు.

చెట్టును చూడబోతే అందులో అనూహ్యా... చేమను చూడబోతే అందులో అనూహ్యా... గుట్ట ను చూడబోతే అందులోనూ అనూహ్యే... మిట్ట ను చూడబోతే అందులోనూ అనూహ్యే.

ఒకరోజా, రెండు రోజులా? ఏడాదిపాటు అనుక్షణం ఆమె నామాన్ని జపిస్తూ, మనోనే త్రంలో నిరంతరం ఆమె రూపానే తిలకిస్తూ, ఆమెకోసం పడరానిపాట్లు పడుతూ, తుదివి జయం తనదేనన్న ధీమాతో ఎన్ని బాధలైనా భరిస్తూ, అదోరకమైన 'ట్రాన్స్'లాంటి స్థితిలో బ్రతికేస్తూ వచ్చిన అతనికి పరిస్థితులు వికటించాయి కదా అని చెప్పి ఇప్పుడకస్మాత్తుగా ఆమెన్ను మర్చిపోవడమంటే ఎలా సాధ్యమది?

అక్కడికీ పాపం చిత్తశుద్ధితోనే ప్రయత్నిస్తూ న్నాడు మనసునదుపులో పెట్టుకోవడానికి.

కానీ మనసు మాట వింటేగా?

మనసాడించినట్టల్లా ఆడేవాడే మనిషి. తానే మనసు నాడించగలిగేవాడు లేదా శాసించగలిగేవాడు రుషి.

మనవాడు పాపం మనిషే గాని రుషికాడు కదా?!

నిద్రాహారాలమీద కూడా సరిగ్గా ధ్యాస వుండటంలేదు. తల్లిపోరు భరించలేక నాలు గు మెతుకులు కొరకడం, మంచమంటూ ఎక్కాక ఏఝామునో కాస్తంతయినా కునుకు రావడం సహజం గనక దాంతోనే సరిపెట్టుకుని రేయి తెల్లవార్చేయడం.

ఇలా ఓ వారం రోజులు భారాతిభారంగా గడిచాయి.

ఏడు రోజులకే మనిషి చాలా డీలా పడిపోయాడు గౌతమ్.

లోతుకెళ్ళిపోయిన కళ్ళు, శూన్యదృక్కులు, మాసిపోయిన గెడ్డం. మౌనదీక్ష మంట గలిసిపోయినా సరే ఇంకా దీక్షలోనే వున్నట్టు ఎవ్వరితోనూ మాట్లాడకపోవడం , పొద్దుపోవడానికన్న ట్టు ఏదో నాలుగు పుస్తకాలు ముందేసుక్కూర్చుంటాడన్న మాటేగానీ చదివిన పాపాన పోకపోవడం.

కొడుకునా స్థితిలో చూస్తుంటే జోగారావ్ దంపతులకి ఏం చెయ్యాలో పాలుపోయేదికాదు.

ఓదార్పుగా నాలుగు మాటలు చెబుదామా అంటే భయం- తాము కూడా గుర్తు చేసినట్టవుతుందేమోననీ, దానివల్ల అతను మరింత దుఃఖపడ్తాడేమోననీ...

ఎందుకురా ఎప్పుడూ అలా మునగదీసు క్కూర్చుంటావ్? కాసేపలా బైటికెళ్ళి స్నేహితులతో గడిపి రారాదూ? అని గదమాయిద్దామన్నా భయమే- పరిస్థితి తెలిసుండి కూడా సతాయిస్తున్నందుకు నొచ్చుకుంటాడేమోనని.

ఆరోజు ఊర్మిళ ఇంటికిరాగా ఆమెతో గౌతమ్ పరిస్థితంతా చెప్పుకుని బాధపడింది రామసీత.

"ఇంత జరుగుతున్నా మా బావెలా వూరుకున్నాడాంటీ? రానీండి నిలదీసి అడుగుతాను" అంది ఊర్మిళ. ఏదో ఆ తల్లి నోదార్చడానికి అలా అన్నదే గానీ, నిజానికామెకీ విషయమంతా ఎప్పుడో తెలును. సుబ్బారావ్ ఆ సంగతులన్నీ ఎప్పటికప్పుడు ఆమెకు రాసే ఉత్తరాల్లో తెలియజేస్తూనే వుండేవాడు.

"పాపం సుబ్బారావ్ దేముందమ్మా? వ్యవహారం శృతిమించిందని అనిపించగానే బిడ్డ మాకు కబురు చేశాడు. మేం వెళ్ళి మాత్రం ఏం చెయ్యగలిగాం? తాను పట్టిన కుందేటికి మూడే కాళ్ళన్నట్టు మొండిపట్టు పట్టుక్కూర్చున్నాడే తప్ప, మా మాట విన్నాడా?... ఆ తిప్పులాడి ఎర్రగా బుర్రగా కాస్త బాగానే వుంటుందిలే. అందుకని ఈ నాగన్న దాని మాయలో పడిపోయాడు. లక్షణమైన బిడ్డని పిచ్చివాణ్ణి చేసేసిందా మహాతల్లి. నా ఉసురు దానికి తగలకపోతుందా..." అనూహ్యామీద ఆగ్రహాన్ని వెళ్ళగక్కింది రామసీత.

"పోనీ గౌతమన్నయ్యకి నన్ను చెప్పి చూడమంటావా?"

"ఏమని?"

"అదేఆంటీ, ఆ అమ్మాయిని మర్చిపొమ్మని..."

నిర్లిప్తంగా అంది రామసీత-

"మేం చెప్పకుండానే వున్నామంటావా? ఏం చెప్పినా ఈ చెవితో విని ఆ చెవులోంచి వదిలే




స్తున్నాడు. నీ మాటెందుక్కాదనాలీ, పోనీ ప్రయత్నించి చూడు''

ఊర్మిళకీ తెలుసు అందువల్ల ప్రయోజనమేమీ వుండదని. అయినా "అలాగే ఆంటీ" అనేసి అక్కణ్ణుంచి గౌతమ్ రూమ్‌లోకి వెళ్లింది.

"ఏం అన్నయ్యా బాగున్నావా?" ముందుగా ఊర్మిళే పలకరించింది గౌతమ్‌ని.

ఈమె వెళ్ళేసరికి అతను మంచం మీద బాసింపట్టు వేసుక్కూర్చుని కిటికీలోంచి ఎటో చూస్తున్నాడు.

ఊర్మిళ పలకరింపుతో ఈ లోకంలోకొస్తూ అన్నాడు-

"ఆ... రామ్మా... రా బాగున్నావా? సుబ్బారావ్ ఉత్తరాలు రాస్తున్నాడా?"

తప్పదుగనక చిన్న చిరునవ్వు లాంటిది ముఖం మీదకి తెచ్చి పెట్టుకున్నాడు.

"ఆ రాస్తున్నాడన్నయ్యా! నువ్వొచ్చి వారమయ్యిందనుకుంటాగా? ఏం నీకు రాయలేదా?"

"నేను రాస్తే రిప్లయ్ యిచ్చుండేవాడే. కానీ నేనే రాయలేదు"

"ఎందుకని?"

"ఏం లేదమ్మా.. అశ్రద్ధ" పొడిగా అని ప్రక్కనే టీపాయ్ మీదున్న ఏదో వీక్లీని చేతిలోకి తీసుకున్నాడు.

ఊర్మిళ గౌతమ్ వైపు ఒకింత పరిశీలనగా చూసింది. మొహమూ గట్రా పీక్కుపోయి జబ్బుపడిన వాడిలా అనిపించాడు.

"అంతేనా లేక మనసు బావుండలేదా?" గుచ్చి చూస్తూ అడిగింది.

"అబ్బే అలాంటిదేం లేదమ్మా" మళ్ళీ దృష్టిని కిటికీ గుండా బైటికి సారించేస్తూ అన్నాడు.

ఊర్మిళ వదిలిపెట్టలేదు.

"ఎందుకన్నయ్యా బొంకుతావు? నాకు నీ సంగతంతా తెలుసు... ప్రేమించడం తప్పు కాదు. కానీ రెండు చేతులూ కలవందే చప్పట్లు కావు కదా? ఒన్ సైడెడ్ లవ్ వల్ల ప్రయోజనమేమిటి? నువ్ అన్నం నీళ్ళూ కూడా ముట్టడం లేదని ఆంటీ బాధ పడుతోంది. నీఫ్రెండ్ కూడా నీ గురించి ఎంతో బాధపడుతూ ఉత్తరం రాశాడు. ఆమెకోసం మిగతా అందర్నీ ఇలా కష్టపెట్టడం నీకు భావ్యమా? దయచేసి ఆ అమ్మాయిని మర్చిపో అన్నయ్యా!" అంది ఓ కుర్చీని మంచం దగ్గరికిలాక్కుని కూర్చుంటూ.

గౌతమ్ ఆమెకి కొత్తవాడేం కాదు. బాల్యంలో ఆమె మిత్రద్వయంతోపాటు ఆటలాడిన మనిషి. సుబ్బారావుక్కాబోయే భార్యగా గౌతమ్ కామె మీద సోదర వాత్సల్యమూ వుంది.

"లేదమ్మా! అమ్మ నీతో అలా అనుంటుందంతేగానీ జరిగిపోయిందాన్ని గురించి నేనేం బాధపడట్లేదు.." ముఖాన్నామె వైపు తిప్పినా ఆడుతున్నది అబద్ధం కావడం వల్ల ఆమె వైపు సూటిగా చూడలేకపోయాడు గౌతమ్.

"నిజంగా నువ్ బాధపడ్డం లేదా?"

"లేదు"

"మరైతే ఆ వాలకమేంటి? నిన్ను నువ్వోసారి అద్దంలో చూసుకో. ఇంతకు ముందెప్పుడైనా ఇలా వున్నావా? నేనాపాటి గ్రహించలేననుకోకు. నా మాట విను అన్నయ్యా..." అంటూ ఇంకా ఏదో చెప్పబోయింది ఊర్మిళ. కానీ హాల్లోంచి ఎవరిదో కొత్త వ్యక్తి కంఠం వినిపించడంతో ఆగిపోయింది.

ఇదేంటి రాజశేఖరం గొంతులా వుందనుకున్నాడు గౌతమ్ కూడా ఆ స్వరాన్నాలకించి.

అలా వుండటం కాదు. ఆ గొంతు రాజశేఖరందే! వచ్చింది అతనే!!

ఎందుకు వచ్చివుంటాడు ఆయనిక్కడికి?

జవాబు స్ట్రయిక్ కాలేదు.

కుతూహలాన్ని అణచుకోలేక గభాల్న కిందకు దిగి చకచకా తలుపు దగ్గరికెళ్ళి నిలబడ్డాడు గౌతమ్.

ఊర్మిళ కూడా వచ్చి అతనికొకింత ఎడంగా నిలబడింది.

తలుపు చాటునే నిలబడి హాల్లోకి తొంగి చూసిన గౌతమ్‌కి సందేహం పూర్తిగా తీరిపోయింది.

వచ్చింది రాజశేఖరమే.

"అయితే జోగారావుగారింట్లో లేరాండీ?"





రామసీతతో అంటున్నాడు రాజశేఖరం.

"లేరు... మా అబ్బాయున్నాడు పిలవ మంటారా?"

"పిలవండి"

తల్లి పిలవకముందే గౌతమ్ తనంతట తానే ప్రవేశించాడు హాల్లోకి.

"హలో.... నమస్కారం" చేతులు జోడిస్తూ అన్నాడు రాజశేఖరం.

"నమస్కారం... ఏంటిలా వచ్చారు? కూర్చోండి?" ప్రతి నమస్కారం చేసి అతనికి కుర్చీ చూపించాడు గౌతమ్.

ఈలోగా ఊర్మిళ కూడా వచ్చి రామసీత సరసన నిలబడింది. 'ఎవరాంటీ' అన్నట్టు కళ్లతో ప్రశ్నించింది.

రాజశేఖరం అనూహ్య వాళ్ల అన్నయ్య అని రామసీతకి తెలుసు. పరిచయం అంటూ లేక పోయినా ఇంతకుముందు హైద్రాబాద్‌లో చూసేవుంది అతన్ని. అదీగాక రాగానే అతను తనను తాను పరిచయం చేసుకున్నాడు. గౌతమ్‌కీ ఊర్మిళకీ అతని స్వరం వినిపించిందా సమయంలోనే.

అయితే అతనెందుకొచ్చుంటాడా అన్నది రామసీతకి అర్థం కావడం లేదు.

గౌతమ్‌దీ అదే పరిస్థితి.

వచ్చిన మనిషిని ముందు కూర్చోమనడం సభ్యత గనుక అలా అన్నాడే తప్ప లేకపోతే నించోబెట్టి ప్రశ్నల వర్షం కురిపించేసి వుండే వాడే!

కూర్చున్నాక కర్చీఫ్‌తో ముఖం తుడుచుకుంటూ గౌతమ్‌తో అన్నాడు రాజశేఖరం...

"మీ ఫాదర్ కూడా వుండుంటే బావుండేది. మళ్ళీ మళ్ళీ చెప్పాల్సిన పనిలేకుండా విషయం ఒకేసారి మాట్లాడేసుకో గలిగేవాళ్ళం."

వచ్చిన విషయం చూచాయగానైనా చెప్పకుండా అతనిలా పూరించడం గౌతమ్‌కి నచ్చలేదు. రామసీతకీ నచ్చలేదు.

ఊర్మిళ పరిస్థితివేరు- అసలు వచ్చిందెవరో కూడా తెలీదు కాబట్టి ఆమె మామూలుగానే వుండగలిగింది.

'అనూహ్య కులాసాగా వుందా?' నాలుక చివరిదాకా వచ్చిన ప్రశ్నని బలవంతాన లోపలికి దిగమింగేసుకున్నాడు గౌతమ్.

"ఆయన రావడానికి మరో అరగంట పడుతుంది. ఇంతకీ మీరొచ్చిన పనేమిటో చెబితే..." చెప్పండి అని ఆదేశించకపోయినా అదే అర్థం వచ్చేలా అంది రామసీత.

"అవును రాజశేఖరంగారూ! కావాలంటే నాన్నొచ్చాక మళ్ళీ మాట్లాడుకోవచ్చు..." గౌతమ్ కూడా అదే ఉద్దేశ్యాన్ని వ్యక్తం చేశాడు.

రాజశేఖరం చిరునవ్వు నవ్వి అన్నాడు "అలాగే బావగారూ!"

బావగారు...

గౌతమ్ ఆశ్చర్యపోయాడు ఆ పిలుపుకి.

అది గమనించి ఇంకా నవ్వుతూనే అన్నాడు రాజశేఖరం... "ఎందుకు బావగారూ అలా ఆశ్చర్యపోతారు? మా అనూహ్యని చేసుకున్నాక మీరు నాకు బావగారే కదా అవుతారు?"

"నేను... నేను అనూహ్యని చేసుకోవడ మేంటి?... నేనోడిపోయాను కదా? తను నామొహం చూడ్డానికి కూడా ఇష్టపడ్డం లేదు కదా?..." బుర్రగోక్కుంటూ అయోమయంగా చూశాడు గౌతమ్.

"అదంతా వుత్తుత్తికే!" కుర్చీలోంచి లేచి గౌతమ్‌ని సమీపించి అతని భుజం మీద చేతులువేస్తూ గట్టిగా నవ్వేశాడు రాజశేఖరం.

"ఉత్తుత్తికేనా? అంటే?" అన్నాడు గౌతమ్.

"ఏంటి బాబూ ఇదంతా? ఇప్పటి దాకా వాడితో ఆడుకున్నది చాలదా? మీకు నవ్వులాటగా వుందా?" అప్పుడప్పుడే తేరుకుంటున్న రామసీత ఆశ్చర్యంలోనే కోపాన్ని మేళవిస్తూ అడిగింది.

"నవ్వులాట కాదండీ... అసలేం జరిగిందంటే..." వెళ్ళి తన సీట్లో కూర్చున్నాక చెప్పడం ప్రారంభించాడు రాజశేఖరం.

అతను చెప్పడం ముగించే సరికి గౌతమ్ ముఖంలో ప్రపంచంలోవున్న సంతోషం అంతా గూడు కట్టేసుకుంది.

రామసీత ఆనందం వర్ణనాతీతం. ఆమె నేత్రద్వయంలో కనీకనిపించకుండా ఆనందాశ్రువులు.

అయినా అనుమానం చావక అడిగిందామె- ''ఇదంతా నిజమేనా లేకపోతే ఇదీ ఒక నాటక మేనా?''

'నాటకమేనా' అనే అయిదు అక్షరాలన్నీ ఒత్తిపలికిందామె. ఎందుకంటే అంతకు ముందు రాజశేఖరం చెప్పిన మాటల్లో 'నాటకం' అనే పదం ఆరేడుసార్లు దొర్లింది కాబట్టి.

''లేదండీ! నేను చెప్పిందంతా నిజమే! జోగారావుగారు రావడమే ఆలస్యం, మనం మిగతా అన్ని విషయాలూ మాట్లాడేసుకుని సెటిల్ చేసేసుకోవచ్చు'' రవంత నొచ్చుకోలుగా చూస్తూ అన్నాడు రాజశేఖరం.

ఇంతకీ అతగాడు చెప్పిన విషయం ఏంటయ్యా అంటే అనూహ్య ఆడిన నాటకం! అవును...

అనూహ్య ఆడింది నాటకమే!

అంటే ఆదినుంచీ ఆమె నాటకమే ఆడుతూ వచ్చిందనికాదు.

ఆదిలో ఆమె గౌతమ్‌ని అసహ్యించుకున్న మాట నిజమే! మౌనదీక్షని పందెంగా కన్వర్ట్ చేస్తూ అతన్తో సవాలు చేసింది కూడా ఎలాగోలా అతని పీడ వదిల్తే చాలన్న ఉద్దేశ్యంతోనే.

సదరు పందెం ప్రారంభమైన నాటికి ఆమెలో అతనిపట్ల నలుసంత సదభిప్రాయంగానీ, అణువంత ప్రేమలాంటి భావన గానీ లేవు.

అయితే ఆ తర్వాత జరిగిన పరిణామాలు... ముఖ్యంగా గౌతమ్ సిన్సియారిటీ... క్రమక్రమంగా ఆమెను మారుస్తూ వచ్చాయి.

మనిషి ఆకతాయి అవుతే అవుగాక, కానీ అతనికి తనమీదున్న ప్రేమమాత్రం సామాన్యమైంది కాదని గ్రహించగలిగిందామె.

అయితే ఆమెది ఓటమిని ఒక పట్టాన అంగీకరించగలిగే మనస్తత్వం కాదు. అన్ని దారులూ పూర్తిగా మూసుకుపోయాయన్న నమ్మకం పరిపూర్ణంగా కలిగితేనే తప్ప విజయం కోసం ప్రయత్నం మానే బాపతుకాదు.

గడువు దగ్గరపడుతున్న కొద్దీ ఆమెను ఓటమి భయం చెదపురుగులా తొలచటం ప్రారంభించింది.

ఎంతగానో తనని ప్రేమిస్తున్న గౌతమ్‌కి తానర్ధాంగికావడంలో తప్పేమీ లేదనిపించినా అతనితో తన భావి జీవితం నందనవనంలో స్వైర విహారంలా సుఖభరితంగా సాగిపోతుందన్న నమ్మకం చిక్కినా...

తానోడిపోయి అతనికి దక్కటం అన్న ఊహనే భరించలేకపోయిందామె.

అతను ఓడిపోవడమూ జరగాలి. ఎట్ ద సేమ్ టైమ్ అతని ప్రేమకు తను పెట్టే తుదిపరీక్షలో అతను నెగ్గడమూ జరగాలి... ఎలా?

పరిపరి విధాల ఆలోచించిన మీదట...

ఆమెకు తట్టిందో బ్రహ్మాండమైన ఉపాయం.

దాని ఫలితమే- ఆరోజు బస్టాప్‌లో ఆ జులాయిలామెను కించపరుస్తూ మాట్లాడ్డం... అది సహించలేక గౌతమ్‌వాళ్ళతో తగువుపెట్టుకుని పంచెంలో ఓడిపోవడం!

ఆరోజు గౌతమ్ అలా ఓడిపోబట్టే అతనిప్పుడామె మనసులో పూర్తిగా తిష్టవెయ్యగలిగాడు.

చిత్రంగా అనిపించినా అది నిజం...

ఎందుకంటే...

ఆనాటి ఆ బస్టాప్ జులాయిలు నిజంగా జులాయి వెధవలు కారు. పోకిరీ రాస్కెల్స్ అంతకన్నా కాదు.

వాళ్ళిద్దరూ అనూహ్య స్నేహితురాలైన వసంత తమ్ముళ్ళు.

గౌతమ్ ప్రేమని టెస్ట్ చేసినట్టూ వుంటుంది, అతన్ని ఓడించినట్టూ వుంటుందని అనూహ్యే వాళ్ళతో చేతులు కలిపి తనని గూర్చి ఎలా మాట్లాడాలో తానే వాళ్ళకి నేర్పించి, ఆ రోజు వాళ్ళిద్దరితో అలా ప్రవర్తింపచేసింది.

వసంత వాళ్ల ఇంటికి తరుచుగా వెళ్తూంటుంది అనూహ్య. వసంతను పిలిచినట్టే ఈమెను కూడా 'అక్కా' అనే పిలుస్తారు ఆ కుర్రాళ్ళిద్దరూ.

అనూహ్య వాళ్లకి తన పథకం గురించి చెప్పినప్పుడు ''ఎంత నాటకం అయితే





మాత్రం నీ గురించి అలా చెడ్డగా మాట్లాడ్డం మావల్ల కాదక్కా'' అంటూ మొదట్లో వాళ్ళిద్దరూ తిరస్కరించారు.

''అతను కోపంతో రెచ్చిపోయి మౌనవ్రతం సంగతి గాలికొదిలేసి మీతో పోట్లాటకు దిగాలీ అంటే మీరలా మాట్లాడక తప్పదు నాకు తోచినట్టు నేను చెప్పాను. మీకు చేతనైతే ఇంకా అసభ్యంగా మాట్లాడినా ఫర్వాలేదు. కేవలం నాటకమే కాబట్టి ఇందులో మీరు గానీ నేను గానీ బాధపడాల్సిందేం లేదు'' అని వాళ్ళకి బాగా నచ్చజెప్పి బ్రతిమాలి మరీ ఒప్పించిందనూహ్య.

దాంతో అయిష్టంగానే వాళ్ళందుకంగీకరించారు.

అలా ఆ పథకాన్ని ఆచరణలో పెట్టి గౌతమ్ని ఓడించింది అనూహ్య.

ఆ సందర్భంలో కూడా అతను గనక నోరు విప్పకపోయి వుంటే అతని ప్రేమను ఆమె విశ్వసించగలిగేది కాదు. ఒకవేళ అలాగే జరిగి అతను గనక గెలిచుంటే ఏం జరిగుండేదో గానీ... మొత్తానికి అతను ఓడిపోయాడు. ఆ ఓటమిలోనే ఆమె మీద తనకుగల అవధులు లేని ప్రేమ నిరూపించుకున్నాడు.

అతను ఓడిపోయిన మరుక్షణమే అనూహ్య మానసికంగా అతన్ని తన భర్తగా అంగీకరించేసింది.

కానీ-

చిలిపితనం ప్లస్...

ఓ నాలుగైదు రోజులు అతన్ని బాగా ఏడిపించి, ఆ తర్వాత అతని బాధనంతా మటుమాయం చేస్తూ తన అసలు నిర్ణయాన్ని అతనికి తెలియజెప్పాలన్న కొంటె ఊహ-

ఈజ్ ఈక్వల్ టు...

అతని ఓటమి తర్వాత ఆమె ప్రవర్తన.

అయితే గౌతమ్ చాలా ఫాస్ట్ నిర్ణయం తీసుకుని ఏకంగా ఊరే విడిచి వెళ్ళిపోవడంతో అతనిలో ఇంక నేరుగా మాట్లాడే అవకాశం లేక అన్నగారితో విషయం చెప్పి అతన్నిప్పుడు ఇలా రాయబారానికి పంపింది అనూహ్య.

అదీ అసలు సంగతి.

సందేహాలకు తావు లేకుండా అన్ని వివరాలూ చాలా స్పష్టంగా చెప్పుకొచ్చాడు రాజశేఖరం.

ఎంతలో ఎంత మార్పు?

దుఃఖాంతం అయిపోయిందనుకున్న కథ సడన్గా సుఖాంతం ట్రాక్లోకి వెళ్లితే ఎవరికి మాత్రం సంతోషం కల్గదు?

తల్లీ తనయులతోపాటు ఊర్మిళ కూడా ఆనందంతో ఉబ్బితబ్బిబ్బు అయింది.

కష్టాల్లో కాలం నత్తనడక నడుస్తుంది. సుఖాల్లో యవనాశ్వం స్పీడందుకుంటుంది.

ఇక్కడా అదే జరిగింది.

అరగంటకాలం అయిదు నిమిషాల్లా గడిచిపోయింది.

ఆ తర్వాత జోగారావ్ రావడం, ఆయన సమక్షంలో రాజశేఖరం మళ్లీ ఓసారి కథంతా తిరిగి వినిపించడం 'ఇవ్వేం నాటకాలంటూ' పెద్దమనిషి తరహాలో ఆయన రాజశేఖరం వద్ద కాస్త గునిసినట్టుగా మాట్లాడినా, మొత్తానికి అందరిలానే లోలోన సంతోషించడం ఆటోమాటిగ్గా జరిగిపోయాయి.

'ఆలస్యం అమృతం విషం' అనే సూక్తిని పూర్తిగా నమ్మే వ్యక్తి జోగారావ్.

''ఇంకా ఆలస్యం దేనికయ్యా, ఇవ్వాళ్టికి ఇక్కడే ఉండిపో. రేపు మేం కూడా బయల్దేరుతాం. అందరం కలిసి వెళ్ళి మీ పెద్దవాళ్లతో కూడా మాట్లాడి వీలైతే తాంబూలాలు కూడా పుచ్చేసుకుందాం'' అన్నాడాయన అప్పటికప్పుడే తన నిర్ణయాన్ని ప్రకటిస్తూ.

అదే బెటరనిపించింది రాజశేఖరానికి కూడా.

''మీ ఇష్టం సార్...'' అనేశాడు సంతోషంగా.

ఆ తర్వాత పనులన్నీ వరసగా చకచకా జరిగిపోయాయి. అనూహ్య తల్లిదండ్రులు సంతోషంగా అంగీకరించారు ఆ వివాహానికి.

అనుకున్నట్టుగానే నిశ్చయతాంబులాలు పుచ్చుకోవడం కూడా అయ్యింది.

అయితే దగ్గర్లో మంచి ముహూర్తాలేవీ లేకపోవడంవల్ల పెళ్లికి మాత్రం ఓ నాలుగైదునెలలు ఆగాల్సిన పరిస్థితేర్పడింది.

అనూహ్యకోసం ఏడాదిపాటు ఏకంగా నోరే

కుట్టేసుకున్న గౌతమ్‌కి అదో లెక్కా?

అన్నీ సవ్యంగా జరిపించి జోగారావూ రామ సీతా వాళ్ల ఊరికి వెళ్లిపోయారు.

గౌతమ్ మాత్రం ఝుమ్మంటూ మళ్లీ హైద రాబాద్ చెక్కేశాడు సుబ్బారావ్ దగ్గరికి.

అంతే తాంబూలాలు పుచ్చుకోవడం గట్రా సుబ్బారావ్ లేకుండానే జరిగాయని కాదు. గౌతమ్ వాళ్ల వూరినుండి అందరూ బయల్దేరి ముందుగా హైదరాబాద్ వెళ్లారు. అక్కడి నుండి సుబ్బారావ్‌ని వెంటబెట్టుకునే వెళ్లారు అనూహ్య వాళ్ల స్వగ్రామానికి..

తాంబూలాలు పుచ్చుకోవడం, మిగతా విష యాలన్నీ మాట్లాడుకోవడం అనూహ్య వాళ్ల స్వగ్రామంలోనే జరిగాయి.

ఎటొచ్చీ గౌతమ్ హైదరాబాద్‌లో దిగబడిపో యింది తిరుగుప్రయాణంలో నన్నమాట.

హైదరాబాద్‌లో

కథ సుఖాంతం అయిపోయినందుకు శ్రీరా మ్మూర్తి దంపతులు కూడా బాగా సంతోషించా రు.

"నీ గురించి ముందుగా అనూహ్యతో మాట్లా డింది నేనేనబ్బాయ్" అంటూ ఆరోజు తాను వెళ్లడం, అనూహ్య అసలు సంగతంతా చె ప్పడం... గౌతమ్‌కి వివరించింది పావని.

"అంటే నాకన్నా ముందుగా మీకే తెల్సిపో యిందన్నమాట. ఏరా... సుబ్బారావ్, మరి నువ్ నా దగ్గరికెందుకు పరిగెత్తుకు రాలేదు?" నిష్టూరాన్ని ధ్వనింపజేస్తూ అన్నాడు గౌతమ్.

"తమరిగారి బోడిప్రేమ ఫలించేసిందని చెప్పి మేం పరిగెత్తుకుంటూ వచ్చేయాలా? మాకింక వేరే పనులేం లేవా?" కస్సుమంటూ కయ్యానికి కాలుదువ్వాడు సుబ్బారావు.

"ఏం కూశావురా గాడిదా... నాది బోడి ప్రేమా? ఈ ప్రపంచంలో ఎవరి ప్రేమయినా నా ప్రేమకి సాటొస్తుందట్రా...? ఈ సారంటే అన్నావ్‌గాని ఇంకెప్పుడూ అనబాకు అలా"

"అంటే?" తలతీసి మొలేస్తావా అన్నట్టుగా చూశాడు సుబ్బారావ్.

"నాలుక చీరేస్తా" వార్నింగిచ్చాడు గౌతమ్.

అలా ఉత్తుత్తి కయ్యాలాడుకుని చాలా కాల మైపోయిందేమో, తిరిగి ఇన్నాళ్లకు మళ్లీ అలాంటి అవకాశం రావడంతో ఇద్దరికీ పట్టప గ్గాల్లేకుండా పోయాయి.

ఎదురుగా పావనీ శ్రీరామ్మూర్తి ఉన్నారన్న సంగతి మర్చిపోయి మరికాస్సేపు అలాగే ఒకరి మీదొకరు అరుచుకున్నారు కాట్లకుక్కలకన్నా ఘోరంగా.

చూసి చూసి ఒళ్లుమండి- "ఇలా తన్నుకు చచ్చేటట్టయితే మా ఇల్లు ఖాళీ చేసేయండి" అంటూ బెదిరింపు అస్త్రాన్ని ఉపయోగించింది పావని.

దాంతో తాగుబోతు నెత్తిమీద చన్నీళ్లకుండ బద్దలుకొడితే మైకం దిగినట్టు మైకాలు దిగిపో యాయిద్దరికీ.

"వొద్దక్కా... అంత మాటనొద్దు" అన్నాడు గౌతమ్ గాభరాగా.

"లేదండీ... ఇంకెప్పుడూ ఇలా తన్నుకు చావం" అన్నాడు సుబ్బారావ్ బుద్ధిగా.

"అలారండి దార్లోకి. అది సరే... గౌతమ్ త్వరలో ఓ ఇంటివాడు కాబోతున్నాడు. మరి నీ సంగతి?" నవ్వుతూ అడిగింది పావని సుబ్బా రావ్‌ని.

"వీడు చేసేస్కుంటే నేను వాజమ్మలా చూ స్తూ ఊరుకుండిపోతానా? వీడితోపాటే నేనూ ను" బోర విరుస్తూ అన్నాడు సుబ్బారావ్.

ఆ సమయంలో అతనామాట తమాషాకే అన్నా సరిగ్గా అదే సమయానికి తథాస్తు దేవతలు తథాస్తు పలికారో ఏమో...

మొత్తానికి భవిష్యత్‌లో అచ్చం అలానే జరి గింది.

నాలుగు నెలలు ఇట్టే గడిచిపోయాయి.

గౌతమ్, అనూహ్య వివాహంతోపాటే, ఓ రెండురోజుల తేడాతో ఊర్మిళ, సుబ్బారావుల వివాహం కూడా జరిగిపోయింది.

అన్నట్టు ఈ నాలుగునెలల వ్యవధిలో గౌ తమ్, అనూహ్యతో ఇంకేమీ ప్రేమ సరాగాలు జరపలేదా అంటే- ఖచ్చితంగా జరపలేదనే చెప్పాలి.

అసలే ఆకతాయి. అందునా కోతికి కొబ్బరి కాయ దొరికినట్టు అనూహ్యే కాకుండా ఇరువ క్షాల పెద్దలు కూడా గ్రీన్ సిగ్నల్ ఇచ్చేశారు





కదా? మరెలా చేతులు ముడుచుకోగలిగాడయ్యా అంటే- అదొక చిన్న విషాధగాధ.

నిశ్చయతాంబులాలు పుచ్చుకోడానికి వెళ్లినప్పుడు జోగారావ్, అనూహ్యా తల్లిదండ్రులతో చాలా స్పష్టంగా చెప్పేశాడు- ''మావాణ్ణి ఇంక ఉద్యోగాలకీ గట్రా పంపడం నాకిష్టంలేదు. ఇకనుంచి నా వ్యాపారం వాడి చేతుల్లో పెట్టేద్దాం అనుకుంటున్నాను. కాబట్టి మీ అమ్మాయితో కూడా జాబ్‌కి రాజీనామా ఇప్పించేయండి' మీ అమ్మాయి హైదరాబాద్‌లోనూ, మావాడూ మా ఊళ్లోనూ అంటే కుదిరేపని కాదుగా'' అని.

''అలాగేనండీ... మా అమ్మాయి మీ కోడలయ్యాక ఆమెతో ఉద్యోగమే చేయించుకుంటారో, మానిపించి ఇంట్లోనే కూర్చోబెట్టుకుంటారో అది మీ ఇష్టం. ఈలోగా మీకభ్యంతరం లేకపోతే చేస్తూనే వుంటుంది'' అన్నాడు దానికి అనూహ్యా తండ్రి-

''నేనన్నదీ అప్పటి సంగతే. ఈ నాలుగైదు నెలల గురించి కాదు'' అనేశాడు జోగారావు.

దాన్ని బట్టి ఈ నాలుగైదు నెలలూ అనూహ్యా జాబ్‌చేస్తూ ఎదురింట్లోనే వుంటుందికదా, ఇంచక్కా రోజూ చూస్కుంటూ వుండొచ్చన్న దుర్బుద్ధి లేదా దూరబుద్ధితో గౌతమ్ అమ్మానాన్నలతో స్వగ్రామానికి వెళ్లిపోకుండా హైదరాబాద్‌లో దిగబడిపోయాడు.

అయితే అనూహ్యా వేరే విధంగా ఆలోచించింది. ఎలాగూ గౌతమ్‌తో పెళ్లయ్యాక ఉద్యోగం మానెయ్యడం తప్పనిసరి అయినప్పుడు, ఆ మానేసేదో ఇప్పుడే మానేసి ఈ నాలుగైదునెలలూ అమ్మానాన్నల సమక్షంలో గడిపేస్తే పోలా? పెళ్లయి కాపురానికెళ్లేటప్పుడు వాళ్లనెలాగూ వదిలివెళ్లడం తప్పదు. కనీసం ఈ నాలుగైదు నెలలైనా వాళ్ల కళ్ల ముందు గడిపితే వాళ్లకదో తృప్తి.

ఇలా అనుకుని ఆమె గౌతమ్ హైదరాబాద్‌లో దిగబడ్డరోజే జాబ్‌కి రిజైన్ చేసేసి, తన ప్రియాతిప్రియమైన శ్యాంబాబుగాణ్ణి వెంటబెట్టుకుని మరీ స్వగ్రామానికి వెళ్లిపోయింది.

పాపం గౌతమ్ ఆశలన్నీ నీరుగారిపోయాయి. సరే...దిగబడ్డవాణ్ణి ఎలానూ దిగబడ్డానుకదా. ఈ నాలుగునెలలు సుబ్బిగాడి దగ్గరే వుండిపోదాంలే అని అక్కడే వుండిపోయాడు. ముందు ముందు సుబ్బారావునెలాగూ ఎడబాయక తప్పదుకదా అని.

అదీ సంగతి.

ఆ పరిస్థితుల్లో ప్రియురాల్ని మనసులో స్మరించుకుంటూ కూర్చోవడం తప్ప ఎవరు మాత్రం చెయ్యగలిగిందేముందీ?



ఆ రోజు...

గౌతమ్, అనూహ్యల శోభనం.

సాంప్రదాయబద్ధంగా చేతిలో పాలగ్లాసుతో బిడియంగా గదిలో కాలుపెట్టింది అనూహ్యా.

అసలే అందమైనదేమో, శోభనపు పెళ్లికూతురి అలంకరణలో మరింత అందంగా మెరిసిపోతూవుందామె.

చూస్తూనే ఛెంగున మంచంమీంచి దూక్కుంటూ వెళ్లి అమాంతంగా ఆమెను వాటేసుకోవాలన్నంత ఆత్రం కలిగింది గౌతమ్‌కి.

కానీ మరీ ఆత్రగాడనుకుంటుందేమోనని నిగ్రహించుకున్నాడు.

పెళ్లికిముందు అతన్ని ముప్పతిప్పలు పెట్టి మూడు చెరువుల నీళ్ళు తాగిస్తే తాగించుండొచ్చు, కానీ ఎంతైనా శోభనం గదిలో స్త్రీ స్త్రీనే.

గడప దగ్గర తలదించుకు నిలచుండిపోయింది అనూహ్యా.

కళ్లతోనే ఆమె అందాన్ని జుర్రేస్తూ ఓ రెండు మూడు నిమిషాలు గడిపేసిన గౌతమ్ ఆ

మీదట మంచంమీద సర్దుక్కూర్చున్నాడు.

"రా అనూ... ఎంతసేపలా నించుంటావ్?" అనబోయాడుగాని అంతలోనే ఎప్పుడో ఏణ్ణర్థం క్రితం నిద్రపోయిన అతనిలోని ఆకతాయి చటుక్కున లేచి కూర్చున్నాడు.

నన్నెన్ని తిప్పలు పెట్టిందీ అమ్మాయిగారు?

కోపంతో కాకపోయినా, తమాషాగానైనా సరే, ఇప్పుడు కాసేపు ఏడిపించే తీరాలీ అమ్మాయిగార్ని.

ఎలా...?

పది పన్నెండు క్షణాలాలోచించగానే.

చటుక్కున ఫ్లాష్‌లా మెరిసిందో ఐడియా.

అంతే...

ఆ వెంటనే-

దభీమని మంచానికడ్డంగా పడిపోయాడు గౌతమ్.

సడన్‌గా అతనలా పడిపోవడం చూసి చెప్పలేనంత భయం వేసింది అనూహ్యకి.

గుండెలు దడదడలాడుతుండగా వడివడిగా మంచాన్ని సమీపించి చేతిలోని గ్లాసుని పక్కనే వున్న టీపాయ్‌మీద పెట్టి-

"ఏమండీ... ఏమండీ..." అంది గాభరాగా.

మనసులో మల్లెలజల్లు కురుస్తున్న మధుర భావన!

గభాల్న ఆమెను తన మీదకు లాగేసుకుందామా అనిపించిందిగాని కంట్రోల్ చేసుకున్నాడు గౌతమ్.

కంట్రోల్ చేసుకున్నది అతను కాదు. అతని లోని ఆకతాయి అతన్నలా కంట్రోల్ చేశాడు.

అప్పుడే బయటపడిపోతే ఎలా?

ఇంకాసేపు ఏడిపించాలి.

మరింత గాభరా పడిపోయేలా చేయాలి.

"ఏమండీ... ఏమండీ..." మళ్లీ పిలిచింది అనూహ్య మరింత గాభరాగా.

కిమ్మనలేదు గౌతమ్.

దాంతో అనూహ్యలోని కంగారు బాగా పెరిగిపోయింది.

ఏమైందీయనకి?

ఎందుకిలా విరుచుకుపడిపోయాడు?

"ఏమండీ... ఏమండీ..." అతని ముఖాన్ని రెండు చేతుల్లోకి తీసుకుని కుదుపుతూ ఇంచుమించు ఏడుపు గొంతుతో అంది- "ఏమైందండీ?"

పలకలేదు గౌతమ్.

"ఏమండీ... మిమ్మల్నే మాట్లాడండీ" భుజాలు పట్టుక్కుదిపేస్తూ పూడుకుపోతున్న కంఠంతో అంది.

ఆమె టోన్‌లో వచ్చిన ఆ మార్పును గమనించి-

ఒక కన్ను సగంతెరిచి ఆమె ముఖంలోకి చూసిన గౌతమ్‌కి ఆ ముఖంలోని బాధ, ఆందోళనా, కంగారు, ఆవేదనా ఎక్స్‌ప్రెషన్లూ స్పష్టంగా కనిపించడంతో ఆమెనింక ఏడిపించబుద్ధి కాలేదు.

"ఏమీ కాలేదు శ్రీమతిగారూ" ఫకాలున నవ్వేస్తూ ఆమెను ఎదమీదకు లాక్కుంటూ మంద్రస్వరాన్న అన్నాడు- "అమ్మాయిగారి అందానికి ఈ దుర్బల మానవుడు కళ్ళు తిరిగిపడిపోయాడంతే"

"ఛీ... ఎంత హడలగొట్టేశారండీ... మొత్తానికి మీ పాడుబుద్ధి పోనిచ్చుకున్నారుగాదు" అతని కౌగిల్లోంచి విడివడ్డానికి ప్రయత్నిస్తూ చిరుకోపంగా అంది అనూహ్య.

"దేవిగారికి కోపం వచ్చిందా?" ఆమె ప్రయత్నాన్ని సాగనివ్వకుండా కౌగిల్ని మరింతగా బిగుస్తూ అన్నాడు గౌతమ్.

"రాదా మరి? ఇలాంటి అల్లరిపనులు మానకపోయారంటే మీతో మాట్లాడనంతే" బెదిరింపుగా అంటూ బుంగమూతి పెట్టింది అనూహ్య.

అసలే అందాలభామ.

అందునా అష్టకష్టాలూపడి ఏరికోరి చేసుకున్న భార్య... తొలిసారిగా బుంగమూతి పెడితే చూస్తూ ఊరుకోవడానికి మన హీరోగారేమైనా వప్పునుద్దా?

ముద్దుగా వున్న బుంగమూతిని ఏం చెయ్యాలో అదే చేశాడు గౌతమ్.

అనూహ్య కళ్లు పారవశ్యంతో అరమోడ్పులయ్యాయి. ●





# చతుర ప్రపంచం

## కంప్యూటర్ బతుకులు

మరో తొమ్మిదేళ్లు గడిచాయంటే చాలు మనమంతా 21వ శతాబ్దంలో ప్రవేశించామన్న మాటే! ఇప్పటికే అన్నిరంగాలలోనూ కంప్యూటర్ల ప్రమేయం అపరిమితమైపోయింది గదా. ఈ శతాబ్దాంతానికి మనిషి వ్యక్తిగత జీవితం కూడా పూర్తిగా కంప్యూటర్ మయమైపోతుంది.

"కాంతమ్మా... పొద్దున కూరేం చేశావ్?" అని ఇరుగింటావిడ అడిగితే "ఏమోనమ్మా




ఎవడికి గుర్తుండేడ్చింది? కంప్యూటర్‌ని అడిగి చెబుతానుండు" అని పొరుగింటావిడ జవాబిచ్చే రోజులొచ్చేస్తాయట ముందుముందు.

కంప్యూటర్లు కూడా ఎప్పటిలా భారీగా కాక పేకముక్క సైజులోనో, అగ్గిపెట్టె సైజులోనో ఉంటాయట అప్పుడు. ఇప్పుడు 'వాక్‌మెన్'లు, పాకెట్ రేడియోలు, కాలిక్యులేటర్లు చేతబట్టుకు తిరిగినట్లే అప్పటి కుర్రకారు కంప్యూటర్లని జేబులో వేసుకుని తిరిగినా ఆశ్చర్యంలేదట.

ప్రయాణాల్లో చదువుకోడానికి నవలల్ని కట్టకట్టుకు తీసుకొని వెళ్లక్కర్లేదు. నవలా కంప్యూటర్‌ని పట్టుకుపోతే చాలు. అందులో 200-300 వరకూ నవలలు రికార్డయి ఉంటాయట. మనకి కావల్సిన నవల కోడ్ నెంబరు నొక్కితే చిన్నచిన్న స్పీకర్ల ద్వారా నవల మొత్తం మన చెవుల్లో వినబడుతుందట.

టెలిఫోన్‌లో అవతలి వ్యక్తి బొమ్మని చూస్తూ మనం మాట్లాడేసుకోవచ్చు. తద్వారా బ్లాక్ మెయిలర్స్‌ని, ఈవ్ టీజర్స్‌ని తేలిగ్గా గుర్తించి పట్టుకోవచ్చు. విమానంలో ప్రయాణించే వ్యక్తితో కూడా నేలమీద నుంచి ఫోనులో మాట్లాడే సౌకర్యం అప్పటికి ఏర్పడుతుంది.

మన శరీరంలో బ్లడ్ ప్రషర్ ఏ స్థాయిలో ఉన్నది, హార్ట్ బీటింగ్ కండిషన్ ఎలా ఉన్నది అన్న విషయాల్ని పసిగట్టి 'ఫలానా మందు తిను', 'ఫలానా టానిక్కుతాగు', 'ఫలానా టైమ్‌కి నిద్రపో' అంటూ కంప్యూటర్లే మనని ఆదేశిస్తాయి. అంతేకాదు మన ఆరోగ్యాన్ని దృష్టిలో




పెట్టుకొని ఫలానా ఫలానా కూరలు మాత్రమే చేయమని వంట మనిషికి సైతం పురమాయిస్తాయవి. మెడికల్ కంప్యూటర్లద్వారా మన దేహంలో ఏఏ కణాలు దెబ్బతిన్నాయి, ఏఏ కణాలు రోగగ్రస్తమయ్యాయన్నది స్వయంగా మనమే తనిఖీ చేసుకోవచ్చు. దాన్ని బట్టి మందుల్ని వాడుకోవచ్చు.

## ఎగరడంరాని పక్షి

నిప్పుల్ని తింటుంది కాబట్టే నిప్పుకోడి కాపేరు వచ్చిందని చాలామంది అంటారు. కాని అది వచ్చి అబద్ధం. మిగిలిన చాలా పక్షుల్లాగే అది ఎంచక్కా బల్లులు, ఎలుకలు, ఊసరవెల్లులు, క్రిములు, కీటకాల్ని ఆరగిస్తుంది. అంతేకాదు రకరాలు ధాన్యాల్ని ఆకుల్ని పూలని కూడా




తింటుంది. నిజం చెప్పాలంటే నిప్పుకోడి గొప్ప తిండిబోతు. క్షణం మూతపడకుండా దాని నోరు ఎప్పుడూ ఆడుతూనే ఉంటుంది. దంతాలు లేవు గనుక తిన్న ఆహారం కడుపులో జీర్ణమయ్యేందుకుగాను ఆహారంతోపాటు చిన్న చిన్న రాళ్లని, ఇనుప ముక్కల్ని మింగుతుంది అది. వాటి మధ్య పడి ఆహారం కడుపులోనే మెత్తగా చూర్ణమై, జీర్ణమై పోతుంది. ఆ తర్వాత రాళ్లు, ఇనుపముక్కలు మలవిసర్జనలో బయటకుపోతాయి.

8 అడుగుల ఎత్తున, 135 కిలోల బరువుతో నిప్పుకోడి చాలా భారీగా కనబడుతుంది. దీనికి ఎగరడం రాదు. పరిణామక్రమంలో ఎప్పుడో అంతరించిపోయిన రాక్షసి బల్లుల కాలం నాటిదీపక్షిజాతి. అంటే సుమారు 5 -6 కోట్ల సంవత్సరాల నాటి జాతి అన్నమాట. ఒకప్పుడు దక్షిణ ఐరోపా, ఆసియా, ఆఫ్రికాలలో విస్తృతంగా కన్పించిన నిప్పుకోళ్లు ప్రస్తుతం మధ్యఆఫ్రికాలో మాత్రమే పరిమిత సంఖ్యలో కన్పిస్తున్నాయి. త్వరలో అత్యంత పురాతనమైన ఈ పక్షిజాతి పూర్తిగా అంతరించిపోయినా ఆశ్చర్యంలేదు.

నిప్పుకోడికి సునిశితమైన దృష్టితోపాటు వేగంగా పరిగెత్తగల బలిష్టమైన కాళ్లున్నాయి. ప్రత్యర్థుల్ని కాళ్లతోనూ, ఉక్కుముక్కలాంటి ముక్కుతోనూ చీల్చి చెండాడగలదు. ఇది గంటకు 25 మైళ్ల వేగంతో అతి వేగంగా పరుగెడుతుంది. ప్రాచీన రోమనులు దీని కొవ్వును అనేక ఔషధాలలో ఉపయోగించేవారు. గట్టిగా ఉండే గుడ్డుపైన పెంకుల్ని వంటపాత్రలుగా వాడుకొనేవారు. ఇప్పటికీ నిప్పుకోడి ఈకలతో చేసిన టోపీలంటే చాలామంది స్త్రీలు ఇష్టపడడం వలన వీటికి గిరాకీ బాగా ఎక్కువగా ఉంది.



## ఆడవాళ్లకి అత్యవసరమైన విద్య?

కరాటే, జూడో, కుంగ్‌ఫూ వంటివిద్యల కోవలోకే వస్తుంది 'టైకెన్‌డో'. అయితే అది పైన చెప్పిన యుద్ధవిద్యలన్నింటికన్నా శక్తివంతమైన విద్య. అందులో కన్పించే వేగం ఇంతా అంతాకాదు. టైకెన్‌డోను అభ్యసించడం కూడా సామాన్య మైన విషయమేంకాదు. అలాంటి విద్యలో తన ప్రతిభను చూపి 'సమురాయ్' టైటిల్‌ను దక్కించుకున్నాడొక భారతీయుడు. అతని పేరు జావేద్‌ఖాన్.

నుకోవడం తటస్థించింది. ఫ్యూయి అతనికి టైకెన్‌డో విద్యలోని కొన్ని అంశాల్ని ప్రదర్శించి చూపాడు. ఆ కొరియన్ యుద్ధ విద్యలోని వేగం, వడుపు, శక్తి జావేద్‌ను ముగ్ధుణ్ని చేశాయి. తను అప్పటి వరకూ నేర్చుకున్న విద్యలన్నీ 'టైకెన్‌డో' ముందు దిగదుడుపేనన్న భావం అతనిలో కలిగింది. వెంటనే అమెరికా పరుగెత్తి హుఇస్లో అనే గురువు దగ్గరచేరిపోయాడు. ఆయన జావేద్‌కు 'టైకెన్‌డో' నేర్పాడు. అంచెలంచెలుగా ఎదుగుతూ ఆ విద్యలో ఉన్నత స్థానానికి చేరుకున్న జావేద్ స్వదేశానికి తిరిగి వచ్చి, బొంబాయిలో 'టైకెన్‌డో' స్కూలు నొకదాన్ని ప్రారంభించాడు. అతని స్కూలులో ప్రస్తుతం 900 మంది వరకూ విద్యార్థినీ విద్యార్థు





27 ఏళ్ల జావేద్‌ఖాన్ బొంబాయి నివాసి. చిన్నతనం నుంచి మార్షల్ ఆర్ట్స్ పట్ల మక్కువ చూపించే అతను పదిహేను పదహారేళ్లు వచ్చేసరికి కరాటే, జూడో, కుంగ్‌ఫూ వంటి విద్యలలో ఆరితేరిన వాడయ్యాడు. అంతలో ఓసారి అతను పూనే వెళ్లడం, అక్కడ ఫ్యూయి అనే వియత్నాం కాందిశీకుణ్ని కలు

లు ఆ విద్యను అభ్యసిస్తున్నారు.

"భారతీయ స్త్రీలు టైకెన్‌డో అభ్యసిస్తే చాలు వాళ్లను ఒకళ్లు రక్షించవల్సిన పనిలేదు. ఆత్మరక్షణ చేసుకోడమేగాక గూండాలు, రౌడీలబారినుండి ఇంకా పదిమందినైనా వారు రక్షించగలుగుతారు" అంటున్నాడు జావేద్ ఖాన్.

సలహా బాగానే ఉంది కానీ మరి గూండాలూ, రౌడీలూ కూడా ఆ విద్య నభ్యసిస్తే ఏం చేయాలో జావేద్ చెప్పలేదు.




## భూకంప పరిశోధక కేంద్రాలు

అది సముద్రతీరంలోనున్న ఒకానొక ఓపెన్ ఎయిర్ ఆడిటోరియమ్. సుమారు 60,000 మంది ప్రేక్షకులు అక్కడ జరుగుతున్న నృత్య ప్రదర్శనను తిలకిస్తూ ఆనందంతో కేరింతలు కొడుతున్నారు. అంతలో హఠాత్తుగా భూమి కంపించింది. ఆడిటోరియమ్‌తోపాటు అందులోని సమస్త ప్రేక్షకులూ నిముషాలలో సజీవ సమాధి అయిపోయారు. ఈ దుర్ఘటన 1775లో పోర్చుగల్ దేశంలో జరిగింది.

గురించి మనదేశంలో వాతావరణ కేంద్రాలు సమాచారం ముందుగానే అందించి హెచ్చరిస్తున్నట్లే అక్కడ భూకంప సమాచారాల నందించే కేంద్రాలు నెలకొల్పారు. దేశవ్యాప్తంగానున్న 133 ఉపకేంద్రాలలో పనిచేసే సిబ్బంది భూగర్భంలో జరుగుతున్న మార్పుల్ని ఏర్పడుతున్న వత్తిడుల్ని రసాయనిక చర్యల్ని ఎప్పటికప్పుడు గమనించి సమాచారాన్ని ప్రజలకు ముందుగా అందిస్తున్నారు. ఇందువల్ల ముందు జాగ్రత్తలు తీసుకోడానికీ, సహాయ కార్యక్రమాలు చేపట్టడానికి చాలా సులువవుతోంది. భూకంపాల్ని పసిగట్టే ఈ విభాగం జపాన్ రవాణా మంత్రిత్వ శాఖ అధీ




జపాన్ దేశానికి ఇలాంటి భూకంపాలు కొత్తేమీ కాదు. అక్కడ తరచూ ఇలాంటి అనుభవాలు పునరావృతమౌతూనే ఉంటాయి. 1923లో సంభవించిన ఒకానొక భూకంపం కారణంగా ఆ దేశంలో లక్షమంది ప్రజలు ప్రాణాలు కోల్పోయారు. లక్షాపాతిక వేలకి పైగా గృహాలు భూస్థాపితమైపోయాయి. ఈ ప్రమాదాల్ని దృష్టిలో పెట్టుకొని గృహ నిర్మాణంలో అక్కడ చాలా తేలికరకం కలపను వాడడం ప్రారంభించారు. ఆ కారణంగా ఒకవేళ ఇల్లు కూలినా ప్రాణహాని జరుగదు. అంతేకాదు అక్కడి శాస్త్రజ్ఞులు రాబోయే భూకంపాల్ని ముందే పసిగట్టి చెప్పగల పరికరాల్ని కనిపెట్టారు. తుఫానులు, వర్షాలు, గాలిదుమారాల

నంలో ఉంటుంది. ఈ విభాగం ప్రధాన కేంద్రం టోక్యో నగరంలో ఉంది.

## రాబందుల భక్తులు

'రెడ్' అనడంతోనే మనకి కమ్యూనిస్టులే గుర్తొస్తారు. కాని 'రెడ్ ఇండియన్స్'కీ కమ్యూనిస్టులకీ ఎలాంటి సంబంధమూ లేదు. రెడ్ ఇండియన్స్ అనేవాళ్లు ఉత్తర అమెరికాలో నివ

సించే ఒకానొక జాతి ప్రజలు. భారతదేశానికి సముద్రమార్గం కనిపెట్టాలని 1492లో బయలుదేరిన కొలంబస్‌కి భారతదేశం బదులు ఉత్తర అమెరికా కన్పించింది. అక్కడి ప్రజలు కొంచెం ఎర్రగా, రాగిరంగులో కన్పించారు. ఇంకేముంది? ఆ మహానుభావుడు అదే ఇండియా అనుకొని ఆ ప్రజల్ని 'రెడ్ ఇండియన్స్' అని సంబోధించాడు. దాంతో వారికి ఆ తర్వాత అదేపేరు ఖాయమైపోయింది.




రెడ్‌ఇండియన్స్ అడవి దున్నల్ని వేటాడతారు. వాటి మాంసాన్ని తింటారు. పదునైన వాటి కొమ్ముల్ని బాణాలుగానూ, ఆయుధాలుగానూ రూపొందిస్తారు. కొన్ని కొమ్ముల్ని గుల్లచేసి వంటపాత్రలుగా కూడా ఉపయోగిస్తారు. వాటి చర్మాలతో ఉడుపులు, డేరాలు తయారుచేసుకుంటారు. ఆ డేరాల్ని వాళ్లు 'దేబి' అని వ్యవహరిస్తారు. విచిత్రమేమంటే - అడవిదున్నలు తమ జీవితాలతో ఇంతగా పెనవేసుకుని పోయినా వారు వాటిని శత్రువులుగానే పరిగణించి, కనబడినదానిని కనబడినట్లే చంపేస్తారు.

మగవాళ్లు 'వేట'లాంటి వీరోచిత కార్యక్రమాలతో తలమునకలవుతుంటే రెడ్‌ఇండియన్ స్త్రీలు ఇంటిపనులు, వంటపనులు చక్కబెడ్తారు. జొన్నలాంటి మెట్ట పంటల్ని పండిస్తారు. వేర్లు, మూలికలు సేకరించి ఇంటిల్లిపాదికీ అవసరమైన వైద్యాలు చేస్తారు. పొలం పనుల మీద బయటికి వెళ్లేటప్పుడు ఆ స్త్రీలు పిల్లల్ని తమవెంట తీసుకుపోతారేతప్ప, వంటరిగామాత్రం వదలరు. మరీ చంటిపిల్లలైతే ఒక బుట్టలాంటిదానిలో వాళ్లని కూర్చుండబెట్టుకొని, దాన్ని మూపున కట్టుకొని తిరుగుతారు. ఆ బుట్టల్ని వారు 'పప్పూసి' అని పిలుస్తారు.

రెడ్‌ఇండియన్‌లకు గడియారాలు, వాచీలు తెలియవు. వాళ్ల ఆచారాలు, సంప్రదాయాల్ని అనుసరించే కాలగణనం చేసుకుంటారుతప్ప ఆధునిక పద్ధతుల్ని అంగీకరించరు. వాళ్ల దేవతలు కూడా ఎక్కువగా రాబందులు, చెట్లు, మెరుపుల రూపంలో ఉంటారని వారి విశ్వాసం.

రెడ్ ఇండియన్స్‌లో కూడా ఎన్నో తెగలు, మరెన్నో ఉపతెగలు ఉన్నాయి. ఎవరి ఆచార సంప్రదాయాలు వారివేతప్ప ఒక తెగకి మరో తెగకి సంబంధం ఉండదు. ఇప్పుడిప్పుడే ఈ ప్రజలలో క్రమంగా నాగరికత మొదలవుతోంది. నవ్యజీవన విధానాలపట్ల, విలాసవంతమైన జీవితంపట్ల మోజు చూపిస్తున్నారు.

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd. Hyderabad. Tel. 229428. Office address: CHATURA Telugu Monthly Eenadu Compound, Somajiguda, Hyderabad Tel. Hyderabad: 223422, 229444, Madras 470434, Vijayawada 476685, Visakhapatnam 52211, Tirupati 5291, Anantapur 22977.



# చను
# పాలిచ్చే తల్లీ!
# మీరు 'తినాలండీ'
# ఇద్దరి కోసం!

## పోషకాహారాలు మీకు చాలా అవసరం మరి ఇదిగో

క్రొత్త (కాంప్లాన్®)

# విటామిల్క్(T)

తన పోషకాహారాల కోసం బిడ్డ మీ మీద మాత్రమే ఆధారపడతాడు, వానికి కావలసిన పాలను మీ నుండే పొందాలి.




చనుపాలనుండి బిడ్డకు లభించే పోషకాహారాలు కాంప్లాన్ - విటామిల్క్‌లో ఉన్నాయి, మరి అంతే కాకుండా కాంప్లాన్‌లోఉండే గుణవంతములన్నింటినీ కూడా అది కలిగియున్నది. పాలలోని మాంసకృతులు (22.2గ్రా), ఫొలిక్ ఏసిడ్, ఎ, బి$_6$ మరియు సి విటమిన్‌లు, ఐరన్, ఆయోడిన్ కాల్షియం, జింక్ మరియు మెగ్నీషియం మొదలైనవన్నీ అవసరమైన పరిమాణంలో దానిలో ఇమిడి ఉన్నాయి.

3 కప్పులు ప్రతిరోజు

రెగ్యులర్ * చాకొలేట్

గ్లాక్సో నుంచి వస్తుంది మంచి ఆరోగ్యం.

GL/V/N/91/TEL

CHATURA Telugu Monthly, Hyderabad-500 004, Regd. No.